

ప్రచురణ సంఖ్య : 1019

ప్రతుల సంఖ్య : 2000

ప్రథమ ముద్రణ : జూన్, 1982

వెల : రూ. 8/-

ముఖ చిత్రం : మోహన్

ముద్రణ :

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్,

విజయవాడ-520 004.

# ఆకాంక్ష

ఆరేళ్ళుగా నవలల పోటీలు నిర్వహించాక మేం ఎందుకు యీ పోటీలు తలపెట్టామో, ఏం ఆశిస్తున్నామో, యిప్పటికి ఏం సాధించామను కుంటున్నామో ఆ అనుభవాల్నీ ఆకాంక్షల్నీ పాఠకులతో రచయితలతో అరమరికల్లేకుండా పంచుకోడం అవసరమని అనుకొంటున్నాం.

సమకాలీన సామాజిక జీవిత సంక్లిష్టతని ప్రతిబింబించే అవకాశం ఎక్కువగా ఉన్న సాహిత్య ప్రక్రియ నవల. అది, పాఠకుడికి సమాజపు అంతస్స్వరూపాన్ని సాక్షాత్కరింపజేసి, అతణ్ని చైతన్యవంతుణ్ణి చెయ్య గలదు. ఈ చైతన్యం సామాజిక జీవితాన్ని మెరుగు పరుచుకొందుకు జీవితాన్ని మరింత సమగ్రమూ అర్థవంతమూ చేసుకుందుకు ప్రేరకం కాగలదు.

కాని, తెలుగులో, కాలక్షేపానికి పనికొచ్చే, పాఠకుల్ని వూహాలోకాల్లో విహరింపజేసి అచేతనుల్ని చేసే నవలలకే కొంత కాలంగా ఎక్కువ ప్రోత్సాహమూ, ప్రాచుర్యమూ లభిస్తోంది. అంతమాత్రంచేత యథార్థ జీవితాన్ని చిత్రించే నవల అసలే రాకపోలేదు. తగినన్ని రావడం లేదన్నదే మా తపన.

పాఠకుల అనాదరణవల్లగాని, రచయితల ప్రతిభా దారిద్ర్యంవల్ల గాని యిలా జరుగుతోందని మేం అనుకోడంలేదు. స్వాతంత్ర్యానంతర కాలంలో సమాజ స్వరూపంలో వచ్చిన మార్పుల ఫలితంగా యీ ధోరణి కళారంగాలన్నిటా—స్థాయీభేదం వున్నప్పటికీ – కనిపిస్తున్నదే.

అందుకే, కష్టనష్టాలున్నా, యిది ఎదురీతఅని ఎరిగీ, యీ లోటును పూరించాలని, వాస్తవ జీవితాన్ని చిత్రించగల యువ నవలా రచయితల్ని ప్రోత్సహించాలని, యీ తరహా నవలలు కోరే పాఠకులకి వాటినందించి ఉత్తమ సాహిత్యాభిరుచిని పెంపొందించాలని యీ నవలల పోటీల్ని తలపెట్టి 1977 నుంచి ఏటా నిర్వహిస్తున్నాం.

మేం తలపెట్టిందే తడవుగా సద్యోఫలితాలు కలుగుతాయనిగాని, అలాటి నవలలు అసంఖ్యాకంగా పోటీలకు వచ్చేస్తాయనిగాని భ్రమలు మాకేనాడూ లేవు.

మాటల తేడాలున్నా ప్రతి ఏటా

"స్వాతంత్ర్యానంతర కాలంలో బహుముఖాల మార్పులు వచ్చాయి. కొందరు సంపదలను స్వాయత్తం చేసుకొంటున్నారు. పేదాది పట్టణ, గ్రామీణ శ్రమజీవులు, కర్షకులు, మధ్య తరగతి కుటుంబీకులు నిస్సహ జీవితానికి లోనౌతున్నారు. సంఘటిత శ్రామిక వర్గం తన జీవనస్థాయిని నిలుపుకొనేందుకు పోరాడుతోంది. ఆర్థికసంక్షోభపు వత్తిడి గ్రామీణ శ్రమజీవుల్నీ కర్షకుల్నీ కూడా పోరాటాల వెల్లువలోకి తోస్తున్నాయి. అన్ని తరగతుల ప్రజల సాంఘిక, సాంస్కృతిక జీవితంలో, ఆలోచనా సరళిలో మార్పులు వస్తున్నాయి వభిన్న సామాజిక శక్తులు, అనునిత్యం సంఘర్షిస్తున్నాయి. సామాజిక జీవితం సంక్లిష్టమవుతోంది. తెలుగు ప్రజల జీవితంలోని యీ పరిణామాలనూ అంతస్సంఘర్షణలనూ శక్తివంతంగా ప్రతిబింబించే నవలలను—"

ఆహ్వానిస్తున్నాం.

ఈ ఆరు వార్షిక పోటీల్లో 15 నవలలు బహుమతులు పొందాయి. వీటి రచయితల్లో లబ్ధ ప్రతిష్ఠులైన వారున్నారు. కొత్తగా కలం పట్టినవారున్నారు. అంతకు పూర్వం తెలుగు నవల అంతగా స్పృశించని జీవిత రంగాల గురించిన నవలలున్నాయి. ఆ మేరకు మా సంకల్పం వృథా కాలేదని సంతోషిస్తున్నాం.

కాని అంతటితో సంతృప్తి పడలేకపోతున్నాం. ఇప్పటికీ తెలుగు నవల స్పృశించని జీవితరంగాలెన్నో ఉన్నాయి. మనకి గనులున్నాయి. గని కార్మికులున్నారు; సముద్రతీరం ఉంది. పల్లెకారులున్నారు. వివిధ పరిశ్రమలు, ఓడరేవు, నౌకా నిర్మాణం, రైళ్లు, బస్సులు, తంతితపాలా, విద్యుచ్ఛక్తి, బ్యాంకులు మొదలగు వాటిలో సంఘటిత కార్మికవర్గం వుంది. చిన్న చిన్న పరిశ్రమల్లో, రోడ్డు రవాణాలో, రిక్షా కార్మికులుగా, కూలీలుగా వివిధ వృత్తుల్లో ఉద్యోగాల్లో సుసంఘటితంకాని కార్మికవర్గం వుంది. గ్రామ సీమల్లో గణనీయమైన పేద, మధ్యతరగతి రైతాంగంవుంది. దారుణమైన దోపిడీకి గురౌతూన్న ఎన్నో తెగల గిరిజనులున్నారు. వివిధ వృత్తుల్లో, ఉద్యోగాల్లో మధ్య తరగతి మేధావి వర్గం వుంది. వృత్తి, వుద్యోగాల్నిబట్టి,

జీవిస్తున్న ప్రాంతాల్నిబట్టి వారివారి జీవన విధానంలో, వారెదుర్కొనే సమస్యలలో, వారి ఆలోచనా సరళిలో, ఆకాంక్షల్లో వైవిధ్యంవుంది.

ఛాందస మత భావాలు, కుల తత్వాలు సమాజ మంతటిమీద పట్టు చిక్కించుకొందుకు యత్నిస్తున్నాయి. వరకట్నాల్లాటి దురాచారాలు మరింతగా వ్యాపించి బలపడి ఎందరివో పచ్చని జీవితాల్ని మట్టుబెడుతున్నాయి.

విద్య అన్ని స్థాయిల్లో దశల్లో వ్యాపారవస్తువై సామాన్యుడికి అందుబాటులో లేకుండా పోతోంది. ఇన్ని గండాలు గడిచినా ఎదురయ్యేది నిరుద్యోగం. వృత్తివిద్యలు నేర్చినా వున్నతవిద్యలు నేర్చినా జీవన భృతి దొరకని స్థితిని ఎదుర్కొంటోంది యువతరం.

లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి సిగ్గుతెరలు విడిచేసి మామూళ్ళయిపోయాయి. ఇవన్నీ స్వార్థపరవర్గాల చేతుల్లో సాధనాలై జాతి ఆర్థిక, సామాజిక, నైతిక జీవితాన్ని దిగజారుస్తున్నాయి.

వీటి నెదుర్కొని కనీస జీవితావసరాలు తీర్చుకోడం, జీవనస్థాయి నిలుపుకోడం కోసం వివిధ తరగతులు పట్టణాల్లో వున్నా పల్లెల్లో వున్నా సంఘటితంగానో వైయక్తికంగానో పోరాడుతున్నాయి. కొన్నిసార్లు రాజీ పడుతున్నాయి.

ఈ సమకాలీన జీవిత చిత్రాన్నంతటినీ ఏవొక్క నవలా ప్రతిబింబించలేదు. ఆయా రంగాల గురించిన అనుభవమో పరిశీలనో లేనిది వాటిని ఏ రచయితా చిత్రించ జాలరు. కాని వివిధ వృత్తుల్లో రంగాల్లో వున్న నవలాకారులు మనకున్నారు.

కందుకూరి, ఉన్నవ, కొడవటిగంటి, వట్టికోట, గోపీచంద్ జి. వి. కృష్ణారావు ప్రభృతులైన వారు పెట్టిన ఒరవడి మనకి వుంది.

కాని జీవితంలోని యీ వైవిధ్యాన్ని పోటీకి వస్తున్న నవలలు తగినంతగా ప్రతిబింబించడంలేదనే చెప్పాలి. ఇప్పటికి బహుమతులు పొందిన 15 నవలల్లోనూ 11 నవలలు ప్రధానంగా వ్యవసాయ కార్మికులకి సంబంధించినవే (వీటిలో మూడు గిరిజనులకీ, 8 హరిజనులకీ సంబంధించినవి). ఒకటి మాత్రం పట్టణ మధ్యతరగతి జీవితాన్నీ, మిగిలిన మూడు కార్మికుల జీవితాలనీ చిత్రించాయి.

వస్తు వైవిధ్యంతో బాటు ఆ యేటి కాయేడు పోటీకి వచ్చే నవలల రాసిలోనూ స్థాయిలోనూ కూడా మెరుగుదలని ఆశించాం.

ఆయా సంవత్సరాల్లో బహుమతుల నిర్ణేతలుగా వ్యవహరించిన వారు స్థాయి తక్కువవున్నా మొదటి బహుమతి నివ్వడం సరికాదని ఖండితంగా అభిప్రాయపడ్డారు. తుదినిర్ణయం వారిదేకాబట్టి వారి అభిప్రాయంతో పాలు పంచుకొంటూ వారి నిర్ణయాన్ని శిరసావహించాం.

పోటీలకు వచ్చిన వాటిలో బహుమతి పొందకపోయినా ప్రచురణార్హమైన నవలగా యిప్పటికి, 'రెండు నములు' నవల నొకదాన్నే వారు సూచించగా ప్రచురించాం.

వస్తువైవిధ్యం దృష్ట్యానేకాక శిల్పం, శైలి, సామాజిక అవగాహన దృష్ట్యా కూడా మరింత మెరుగుదలని జడ్జీలేకాదు వారితో బాటు సహజంగానే ప్రచురణకర్తలుగా మేమూ, పాఠకులూ కూడా ఆశిస్తున్నాం. ప్రతి యేటా ముగ్గురు జడ్జీలుంటారు. అభిరుచుల వైవిధ్యం వుండేందుకు వీలుగా ప్రతిఏటా జడ్జీలలో కొందరు పాతవారిస్థానే కొత్తవారుంటారు.

బహుమతులు పొందిన రచయితలంతా జడ్జీల సూచనల నామోదించి తమ నవలలను మెరుగుపరచడంతో నిలంబనలేకుండా సహకరించారు. వారికి మా కృతజ్ఞతలు.

నవలల్ని ఎడిట్ చెయ్యడంలో అడిగినదే తడవుగా సహాయపడుతూ వచ్చిన శ్రీ మహీధర రామమోహనరావుకి మా హృదయపూర్వక కృతజ్ఞతలు,

ఈ కృషి సఫలం కావడంలో పాఠకుల సమీక్షకుల ఆదరణ సహృదయ విమర్శల పాత్ర ప్రధానమైంది. వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

జీవితం ప్రమాణంగా, వస్తువైవిధ్యమూ, శిల్పం, శైలిలలో వున్నత స్థాయిగల రచనలతో మరింతమంది యువ రచయితలూ, రచయిత్రులూ పోటీల్లో పాల్గొంటారని విశ్వసిస్తూ—

ప్రచురణ కర్తలు.

# బహుమతులు పొందిన నవలలు

దేవుళ్ళారా మీ పేరేమిటి? రు. 6-00

—శ్రీకాంత్

తమ ఆధిపత్యం నిలబెట్టుకోడం కోసం ఎన్ని ఘాతుకాలైనా చేసే వాళ్ళు, భూస్వామ్య దురహంకారుల మరంతాలకు బలైపోయిన పడుచులు, అన్యాయాలకు ఎదురుతిరిగి తమ బ్రతుకును దిద్దుకోడానికి తెగబడి పోరాడే వాళ్ళు— ఈ నవల్లో కనిపిస్తారు. ఉద్వేగపూరిత ఘటనా సంభరితమై మనసుల్లో చిరముద్ర వేసుకునే నవల.

కన్నీటికి నోరొచ్చింది రు. 10-00

—యస్. కాశీవిశ్వనాధ్

తరతరాలుగా ధనం దర్పంగలవారి పదఘటనల్లో నలిగిపోయిన వారు పార్వతి. పోతన్నలు. కనీసం తమ కొడుకైనా అలాంటి దుర్భర జీవితంనుండి బైటపడి స్వేచ్ఛగా బతకాలని తపించిన వారిద్దరి అంతరంగ కన్నీటి కథనం.

[illegible] మనుషులే రు. 9-00

—డా॥ పరుచూరి రాజారామ్

డబ్బే జీవితంలోని అన్ని విలువల్నీ శాసించే వికృత వ్యవస్థలో తలఎత్తే క్షీణజీర్ణ ధోరణులకులోనై పతనోన్ముఖమైన జీవితాల్నీ, నడిమిరకం బతుకుల్ని ఆవరిస్తున్న అశాంతి, అసంతృప్తి, అంతర్మథనాల్ని మనముందు ఆవిష్కరించే నవల.

బలిపశువు రు. 7-50

—జాతశ్రీ

ఇది పూనమ్మ కథ. గూడెం పెద్దల కట్టడిలో ఆ ఊరి దొరల ముట్టడిలో నలిగి నవసిపోయిన అభాగ్యురాలి ఆర్తగాథ. గ్రామీణప్రాంతాల్లో ఈనాటికీ సాగుతున్న భూస్వామ్య దురహంకారుల అహంకారానికీ, అత్యాచారాలకీ అద్దంపట్టిన నవల.

కోటి కుటుంబాల ఘోష రు. 5-00

—కె. బ్రహ్మానందరావు

వాళ్ళూ అందరిలాంటి మనుషులే. కానీ వాళ్ళ జీవితం అందరిలాంటిదికాదు. బాధలు, దారిద్ర్యం వారి జీవితంలో గూడు కట్టుకున్నాయి. అయినా రేపుమీద ఆశతో జీవితాల్ని సాగిస్తూ వలస జీవితానికి అంకితమైన వ్యవసాయ కార్మికుల జీవితానికి అద్దంపట్టిన నవల.

సంకెళ్ళు తెగుతాయి రు. [illegible]

—మల్లిక్

చిన్న పెద్ద కార్ఖానాల్లో పనిజేస్తూ నగ్నంగా దోపిడీకి గురౌతున్న సమాజ చోదక శక్తులైన శ్రమవీరుల ఆశలు, ఆశయాలు, ఆకాంక్షలు, పోరాటాలు, పరాజయాలు—అన్నింటిని ప్రతిబింబించిన నవల. పారిశ్రామిక రంగం జీవితం ప్రధాన నేపథ్యంగా వెలువడిన తొలి నవల.

మనిషికీ మనిషికీ మధ్య... రు. 5-00

—వి. రాజారామమోహనరావు

మనిషికీ మనిషికీ మధ్య సంబంధాల్లోని సహజమయిన మానవతా విలువల్ని, 'అవసరం' (డబ్బు) మేరకు పరిమితం చేస్తున్న పెట్టుబడిదారీ

దోపిడీసమాజంలో కాకిరాయి గనికార్మికుల శ్రమా, అమాయకత్వం ఎన్ని రకాలుగా దోచుకోబడుతున్నదో ప్రతిభావంతంగా ప్రతిబింబించే నవల.

స్మశానం దున్నేరు — రు. 6-00

—డా॥ కేశవరెడ్డి

నిమ్నజాతులుగా పరిగణింపబడుతున్న వర్గాలు తమ తెగల మధ్య గల వైరుధ్యాలు, సంఘర్షణలమూలంగా సాంఘిక దురాచారాలకూ, దురన్యాయాలకూ ఏ విధంగా బలిఅవుతున్నారో చూపిస్తూ దళితవర్గాల మధ్య సమైక్యత అవసరాన్ని గుర్తింపజేసే నవల.

శతాబ్దాల నిశ్శబ్దం — రు. 7-00

—దశరథ్

తెలంగాణా ప్రాంతాల్లో భూస్వాముల హస్తగతమైవున్న సాంఘిక వ్యవస్థ తాలూకు నిజస్వరూపాలపై పుకి కళ్ళు తెరిచి, మూఢాచారాల్నుంచి అంధవిశ్వాసాల్నుంచి యిపుడిపుడే బయటపడుతున్న శ్రమజీవుల్లో ఓనమాలు దిద్దుకుంటున్న సామాజిక చైతన్యాన్ని చిత్రిస్తున్న నవల.

ఇనుప చక్రాలు... — రు. 10-00

— యర్రంశెట్టి శాయి

పైకి మేడిపండులా కనిపించే రైల్వే యంత్రాంగం పొట్టవిప్పి చూపిస్తూ, ప్రక్షాళన పరిష్కారాన్ని స్ఫురింపజేస్తూ, ఆయా పరిస్థితుల్లో తనకున్న ప్రత్యక్ష అనుభవాల ఆధారంగా రైల్వే యంత్రాంగం విశ్వరూప సాక్షాత్కారాన్ని ఆవిష్కరించేందుకు చేసిన ప్రతిభావంతమైన ప్రయత్నం యీ నవల.

వెదురు పూలు నినదించాయి...   రు. 7-00

— జాతశ్రీ

నాగరికతా అవకాశాల విలువల్నించి వంచింపబడుతూ, నిత్యం దోపిడీలకు గురౌతూ, ఎంతో అమాయిక అటవికదశలో బతుకులు కొనసాగిస్తున్న కోయజాతి ప్రజాజీవితంలో యిపుడిపుడే మేల్కొంటున్న మార్పుల్ని సమర్థవంతంగా చిత్రిస్తూ, దోపిడీకి వ్యతిరేకంగా వాళ్ళ ప్రతిఘటనని, సంఘటనని కళ్ళకు కట్టినట్టుగా చూపించే నవల.

కూలి బతుకు   రు. 12-00

—సింహప్రసాద్

కుల ప్రాతినిధ్యం నించి ధనప్రాతినిధ్యానికి ఎదిగిన వ్యవస్థలో ఒక సామాన్య పేదకూలీ కుటుంబం అతి స్వల్పమైన తమ ఆశల సాధన కోసం జీవితంతో అనుక్షణం పోరాడి, ఓడిపోయిన వాస్తవికత. అయితే యీ ఓటమి వెనుక జాగృతమవుతున్న వర్గదృక్పథం, మార్పు, వెన్నెముకగా ధరించి ముందుకువస్తున్న యువత, గ్రామీణ వ్యవస్థలో పెత్తందార్ల అఘాయిత్యాల్ని, సామాన్యుల ఆవేదనల్ని, ఆరాటపోరాటాల్ని శక్తివంతంగా వివరించిన నవల.

చీకటి చెదిరింది   రు. 8-00

— దశరథ్

దోపిడీ సమాజంలో యిప్పటికీ నిమ్నజాతులుగా పరిగణింపబడుతూ అన్నింటినించీ వంచింపబడటమే తప్ప ఏమీలేని జనాలు, వాళ్ళలోంచి వస్తూన్న మార్పులు, వాళ్ళ నిత్యజీవితం, ఆ జీవితం చుట్టూ అల్లుకున్న భయంకరమయిన దృశ్యాలు, భద్రతారాహిత్యం, తునికాకు కార్మికజీవితం నేపథ్యంతో ప్రతిభావంతంగా సాగిన రచన.

# 1

చామనచాయ రంగు, ఎత్తుకుదగినబలం, చెవులుకప్పిన క్రాపుతో ఒక అందమైన యువకుడు చేతిలో బ్యాగ్ పట్టుకుని భుజాన బెడ్‌హోల్డర్ వేసుకొని వస్తున్నాడు. చెట్లచాటుగా అల్లంత దూరాన వినవస్తున్న మాటలు విని ఆగాడు.

"దొంగముండ కొడుకా, లంగ గాడిది కొడుక, నీ పెండ్లాం.... కొంప ముంచితివి గదరా. బంగారమట్లోంటి చెట్టును నాశనం జేస్తివి కదరా." అంటూ ఆ తోటలోని నూర్జహాన్ అంటుమామిడి మొక్కను చూస్తూ ఉద్రేకంతో తెగతిడుగుతున్నాడు మాధవరావుదొర పాలేరు వెంకన్న.

వెంకని పేరు యెంకటయ్య అని తల్లిదండ్రి పెట్టుకున్నా, వెంకన్న అని అతని చిన్ననాటి నుంచి స్నేహితులు పిలుస్తున్నా దొర యేనాడూ ఆ పేళ్ళతో పిలిచి యెరుగడు. దొరే యేం ఖర్మ, దొరింటివాళ్లు ఎవళ్ళయినా ఇంకా వారింటి పాలేళ్ళయినా ఎంకా అనే పిలుస్తుంటారు.

"ఇటుదిక్కు వొచ్చేతలికి అటు యెడ్లచ్చి...."

"ఇంటెందుకొచ్చినవ్‌రా?"

"మ్యాకెలు గెట్టుదాటినయ్ దొరా,,,"

"దూరం నుంచే కేకెయ్యనుంటివి,,,"

"కేకేసుతానికి అల్లయాడున్నరు? పొలగాండ్లు పెనుకంపిరి, దొంగ మ్యాకెలు ముందటురికచ్చె."

"అయితే అటునుంచేం రాలే?"

"రాలేదండ్రి."

"మనెడ్లే మేసినయంటవ్?"

"పుల్లగ తిండి. చూడాగది..."

"ఎంత దొంగ మాటర్రా? ఎవలగొడ్లో రోజచ్చిచ్చినయ్. చెట్లన్నిటిని తొక్కి మేసినయ్. నువ్వేమో సత్తెపంతుని తీరుగ మాయే మేసినయ్ దొరా అంటున్న వింకా!"

"నిజముండ్రి!"

"నోరుమూసుకో ముండకొడుకా! మా యెడ్లు దొంగలు; మందివి మంచియారా? దొంగగాడ్దికొడుకుల సోపతిన అవ్విగూడా దొంగయెత్తున్న యేమో సూడద్దురా మరి. కావలి ఉన్నదెందుకు? నెలకు నాలుగు కుంచాల జొన్నలిత్తలేమురా సైకిలు చెర్రాలనొంటియి. చేనెండుతేంది, చెట్టిరుగుతేంది. నెల నెలకు మీ జీతం మీకు నాగా లేకుంట ముట్టె. ముంచుతున్నరు గదరా మీ పెండ్లాలు ముండమొయ్య, దొంగ లంజెకొడుకులు."

"ఎట్లదొరా బాంచెను, యేమన్నా నమ్మరు, తమరి మాట తమరే."

"నా కెరుకలేదురా దొంగగాడిదికొడకా, నమ్మె మాటేదో, నమ్మని మాటేదో? ఎదురు మాట్లాడుతున్న వింకా. తెలివితక్కువ ముండాకొడుక."

చెట్టువిరిగింది నిజమే. కొత్తగా పెట్టిన మొక్కలవి. తోటకావలి తనం తనదే. అయితే ఉదయంపూట ఎడ్లకాపరి ఇటిన్ని ఎడ్లను చూడుమని వుంచి తాను తినిరావటానికి యింటికి పోతాడు. పశుజంతులు దొంగారెడ్లు. ఈ ముసలి మనిషికి అవి వినవు. ఇటున్నవాటిని ఉరిగేస్తే అటువి పరుగెత్తుతవి. వెంకయ్య మనస్సులోనే తన గోడు దిగమింగుకొన్నాడు.

ఇవే తన్నిట్లా గోసపెడుతున్నాయంటే ఇంకా మంచిగొట్లున్నత్తయ్, తోటలోనేమో కంచెవలె గడ్డిపెరిగె. చిల్లర మల్లర ఒకటి రెండు అరకల వాళ్లు పూటో అరపూటో ఇటువచ్చి ఎడ్లను మేపుకొని పోవాలను కుంటారు. వాళ్ళలా ఆశ పడుతారు. కాని దొరగారేమో రానివ్వరు. ఎందుకు రాని

స్తారు? వారి సొంత చేను. వారికి పశువులుండె. అవి మేయగా మిగిలింది తగులనైనా పెటిస్తాడు. ఆ యేటికి దున్నితే పెసరో ఉలవో చల్లొచ్చునను కుంటాడట్లా. ఊళ్ళనాన్ని లోపలికి రానిస్తే ఊరుకుంటారు! ఒక్కపూటకు పోనీ అని విడిస్తే దినం వస్తారు. వస్తేవచ్చిరి మేపుకొని పోనీ అంటే చెట్ల నుంచుతారు? మొక్కలనేమో ఎట్లతో తొక్కిస్తారు. పెద్దవాటి కొమ్మలెక్కి విరుడుగొటుతారు. మధ్య పాట్లా. ఇట్లా తనవి– వెంకయ్య ఒక్కనిట్టూర్పు విడిచేడు.

"దొర సూత్తే మీకేందిగని నా పని జేత్తడురో. మురికి తిట్లు తిడుతరు. యీపు సాపుజేత్తరు, మీకు దండం పెడుతగని, యిటు మొకెయి రాకండి. నా జీతంల మన్ను బొయ్యకుండిరా – దూరం పోండ్రి" అని పశువులతో వచ్చినవాళ్ళను బ్రతిమాలి చెప్తూనేవుంటాడు. వినని వాళ్ళను తిడుతూనూ వుంటాడు. అయితేనేం, వాళ్లు వినరు. పైగా ఎన్నో మాటలంటారు.

"ఏందిరో! నువ్వే దొరోలె జేత్తున్నవ్. దొరెనుక దొరవైనావురా? రేపు నీ గుమ్మలు గరిసెలే నిండులాయిరా? అప్పుడే నీకండ్లు నెత్తిమీదికి పోయినయేమిరో! గట్టుకు మొరిగిన కుక్కగూడెల్లి సచ్చిందట. ఎంగిలి బొక్కలు దొరికితే సాల్లా దొరింటి కుక్కలు కూడా బొంయిమంటు తెగ మొరుగుతయ్."

ఇట్లా ఎవరికి తోచిన మాటలు వాళ్ళంటూ వుంటారు. ఇవ్వన్నీ బంగ్లామీద హాయిగాపడుకున్న దొరకు ఎట్లాతెలుస్తవి. ఆమాత్రం తెలువ కుండా ఉంటున్నారు? తెలిసినా తెలువనట్లే, నటిస్తారు. పాలేళ్ళను హుషారుజేసి 'ఉష్కో' అంటారు. కూలిముండాకొడుకులు తిట్టుకు తన్నుకు కుమ్ములాడుకు చస్తారు. మీకేం దొరా.' అనుకున్నాడు. అంతా లోలోపలే,

వెంకన్న చేతికట్టెను ఎత్తిపట్టుకొని చేతులు కట్టుకొని దొర ఆగితే ఆగుతూ, దొర నడిస్తే నడుస్తూ, తిరిగిచూస్తే పక్కకు తప్పుకుంటూ, అతడడిగిందానికి బదులు చెప్పుతూ తిరిగాడు. చుట్టుపక్కల పసులేవైనా వచ్చినాయేమోననేది కనిపెట్టుతూనే తిరుగుతున్నాడు.

దొరగారు తిట్టిన తిట్లన్నీ సహించి, దొర యిచ్చిన ఆజ్ఞలెల్లా భరించి, వినయంతో తలకుంగిపోగా, వయసుతో నడుం వంగిపోగా దొరను ఊరి వైపు సాగనంపి తన గుడిసె దిక్కు నడువసాగాడు. ఆ తోటలోనే ఓ మూల నుంది వెంకన్న గుడిసె. ఊరి చివర్లో కులపోళ్ళ ఇండ్ల దగ్గర తనకో యిల్లుంది. ఇప్పుడది ఎముకల గూడులా వుంది. నాలుగ్గోడల మీద బండెడు బడితలు శేషంగా మిగిలివుంది.

గుడిసె కప్పుకోవాలె దొరా అంటే,

"యేం జేసుకుంటవేరా ? ఇక్కడ తోటల ఉండనేఉంటె. రెండిండ్లు కావన్నారా నీ బతుక్కు"-అన్నాడు దొర.ఊరిన మూడిండ్లు,జిల్లాన ఒకటి, పట్నం లొక్కటి యెందుకు దొరా మీకు మరి అన్నిండ్లు, పెద్ద పెద్ద బంగ్లాలు? అని అనలేడు వెంకన్న, మనులోనే అనుకుంటాడు. దొరతో అనాలనుకుంటాడు. కాని అనలేడు.

గుడిసె దిక్కు పోయేసరికి కొడుకు రాజయ్య బుసలు కొడుతూ ఎదురుగా కనిపించాడు.

"ఎప్పుడ త్తివి కొడుకా ?" తండ్రి మాట వినవస్తూ లేచినిక. మనసంతా ఉద్రేకంతో ఉడికిపోతున్నది.

'ఎందుకు ఇంతహీనంగా బ్రతుకవల్సి వస్తున్నది?' అన్న ఆలోచనతో అతని అంతరంగం ఉడికిపోతున్నది.

"ఎట్లనో ఉన్నవు కొడుకా ? ఎండనబడి వస్తివా ?"

తండ్రి మాటను పట్టించుకోలేదతడు.

"ఎందుకే దొరోడు అంతగా తిడుతున్నాడు ?"

కొడుకు ప్రశ్న చిత్రంగా ఉంది వెంకన్నకు. ఇన్నాళ్ళబట్టి తిడుతూలేడా ? ఇవ్వాళనే కొత్తగా ఎన్నడూవినని మాటలు విన్నట్టు, ఏదో జరుగని పని జరిగినట్టు- ఏమిటో ఈ మాట అనుటున్నాడు- ఇంకా 'ఆడు - ఈడు' అంటండు. లేని కత మల్లోటి. యెవలన్న యినిరా దొర తోని అనిరా ఇదో రంపాటకం మల్లా,' అని చుట్టు పక్కల చూశాడు. ఎవరూ లేంది గమనించి నెమ్మది పడ్డాడు.

"ఇయ్యాల కొత్తంగింటున్నావ్ కొడుకా. మొదాటినించి ఉన్న కతేనయె."

"ఔను, పాత కథే. కాని ఎందుకు మనం ఇన్ని తిట్లుతినాలె, ఎందుకని ఇంత పాడు బ్రతుకు బ్రతుకాలె ?"

"రాత కొడుకా రాత ! ఆ దేవుని గుల్లె మన్నుబొయ్య, ఆల్లు పువులపూజ జేసిపుడితే మనం రాల్ల పూజే జేసినమేంవో. వాల్ల నోట్లె పాలు మన నోట్లె నీల్లు."

"రాత ! ఇదంతా నుదుటి రాతనా ? దేవుని చేతనా ?" అని పైకన్నాడు. కాని, మనసులో మాత్రం "ఇదంతా పెద్దోని చేతనైన తనం. పేదోని చేతగాని తనం. వంగి మోసేవాడున్నంత కాలం ఎక్కి స్వారిజేసే వాడుండనే ఉంటాడు' అనుకున్నాడు, రాజయ్య.

# 2

"అన్న యెప్పుడచ్చినవే" పదిహేనేండ్ల మల్లిక బెపుల్లల మోపు నెత్తికెత్తుకుని చేరవచ్చింది. ఆమె ముఖం మీది ఆనందపు వెన్నెల పూర్ణిమ చంద్రబింబాన్ని స్ఫురింపజేస్తుంటే, ఆ రూపం (లేచిన తల, మాసిన బట్ట పేలికలు) అమావాస్య చీకట్లను స్మృతికి తెస్తున్నది.

రాజు కళ్ళల్లో నీళ్ళు నిండినవి. అవి ఆనంద బాష్పాలు కావు. చెల్లెను చూసి, చెల్లె పరిస్థితిని చూసిన దుఃఖ బాష్పాలు.

మా అన్న దొరోలె ఉన్నడు అనుకోవటం, అలా మందికి చెప్పుకోవటం ఆ పిల్లకు సంతోషాన్ని కలిగించే విషయం. పైగా గర్వ కారణం. అప్పుడామెకు తన స్థితి గుర్తుకు రాదు. తాను తనజాతి వాళ్ళం దరి లాగే ఉంది. కుడి యెడమగా. కాని తన అన్నో! దొరబాబులా ఉన్నాడు. ఇంకొన్నాళ్ళయితే పెద్ద నౌకరీ చేస్తాడు. నెలకు కొన్ని నూర్లు సంపాదించుతాడు. అప్పుడు తనకు మంచి మంచి బట్టలు నగలూ తేడూ.

చ్చలు మంచిగ రాసి బాబుకావన్నని కోటొక్క దేవతలకు మొక్కు తన్న."

మాటా చేటా గుడిసెముందు పడేసి కొడుకు ముందట మంచం దగ్గర కూలబడి ఆప్యాయతతో అతనికాళ్ళను తన చేతితో నిమరసాగింది. మల్లమ్మ కంగతోనీళ్లు తెస్తుంటే వెంకన్నకాళ్లు రెక్కలుకడుక్కుంటున్నాడు.

# 3

గాఢంగా నిట్టూర్చాడు రాజు. అతనికిదంతా గంద్రగోళంగావుంది. ఏమేటా మనసు ఎదిగిపోతున్నది. ఇరువది రెండేండ్ల యువకుడు. ఆలో చనా కోణాన్నిబట్టి పాత విషయాలే కొత్తగా కనిపిస్తున్నాయి.

కలరా, మశూచి వంటి రోగాలు దేవతల కోపం వల్లకాక రోగ క్రిములద్వారా వస్తున్నాయని తెలుసుకోలేదూ, ఇంజక్షన్సు, టీకాల ద్వారా వాటిని నివారించుకోగలుగుతున్నాం కూడా. మరి ఈ దరిద్రాన్ని ఎందుకు వదుల్చుకోలేకుండా వున్నామూ అని మనస్సు మధనపడుతూంది. ఈ దారి ద్ర్యాన్ని మనుషులే సృష్టించేరంటూ సుబ్బరాజు చెప్తాడు. కాని తనకి మాత్రం దీనికి కీలకం కుల భేదాలలో వున్నదనిపిస్తూంది.

ఇన్నాళ్లు జరుగుతున్న సంఘటనలకు కారణాలను అన్వేషించేవాడు కాదు రాజు. కొన్ని విషయాలకు మనసు బాధపడ్డా మనం చేసే దేముందిలే అని నెమ్మది పడేవాడు. లేదా కొన్ని రోజుల వరకు బాధపడి క్రమంగా ఆ విషయాలు మరచిపోయేవాడు. కాని కాలేజీకి వెళ్లేక అల్లా వూరుకుందా మన్నా సాధ్యంకాదు. మార్క్సు పుస్తకాలు చదవమంటాడు సుబ్బరాజు. మనదేశంలోవున్న కులాల గొడవ మార్క్సుకేం తెలుసు అంబేద్కరును చదువన్నాడు ప్రకాశం.

ఇప్పుడు మాత్రం రాజు మనసులో విపరీతమైన ఆందోళన సాగు తూంది. మిత్రులవాదనలు ఏది విన్నప్పు డవే సరిగ్గావున్నాయనిపిస్తూంది. తెల్చుకోలేకున్నాడు.

ఈ దినం తాను వచ్చేటప్పుడు బస్సులో ఘటన మనసులో మెదిలింది. "ఇక్కడెవ్వరైనా ఉన్నారా బాబూ?" అంటూ ఆత్రంగా అడుగుతూ ఒక వ్యక్తి తన చేతుల్లోని సామాను తన పక్క సీటుపై ఉంచుతూ నిలబడ్డాడు.

"లేరు" అని రాజు అటుగా చూశాడు.

'లేరు' అనే మాటకు నిశ్చింతగా కూర్చోవచ్చునుకదా అని ఆనంద పడిన ఆ మనిషి రాజు ముఖాన్ని చూసి క్షణంసేపు ఆలోచనకు లోనై వెంటనే తన మూడుసంచుల్నిలాక్కుని వేరే సీట్లోకి వెళ్ళాడు. అతడు తమపూరి గుడిపూజారి. జాతి విభేదాలు వద్దన్న రామానుజాచార్యుల మతస్థుడు. భక్తులకు కులవిభేదం పనికిరాదని తిరుమంగైయాళ్వారు దొంగ కథ పవిత్రంగా చదివే మనిషి. పాండురంగని మరాఠా భక్తుల్లో పలువురు క్రింది జాతుల వాళ్ళనని ప్రసంగం చేసే పరమ భాగవతోత్తముడు. కాని, స్వగ్రామంలో స్వప్రవర్తనంలో మాత్రం సంకుచిత కుల, మత భేద బుద్ధి పోనీడు. సమభావం రానీడు. జాతినిగుర్తించకపోతే పర్వాలేదు, గుర్తించటం లోనే వస్తుంది అసలు చిక్కు.

# 4

తల్లి యెప్పుడో లేచి వంట పనిలోకి వెళ్ళింది. తండ్రి గుడిసె చూరు నీడలో కూర్చుండి తాడు పేనుకుంటున్నాడు.

రాజుకు చిన్ననాటి సంఘటన ఒకటి మనస్సులో మెదలసాగింది.

ఒకసారి బడిలో టీచర్ విద్యార్థులతో వంగి దుమికించుడు ఆట ఆడి స్తున్నాడు. ఈ దొరగారి కొడుకు చినబాబు కూడా అందర్లో ఉన్నాడు. అతను అంత ఎత్తు దుముకలేక రెండుమూడుసార్లు దొంగై వంగి నిల బడ్డాడు. వెన్నముద్దవలె యేపుగా గారాబంగా పెరుగుతున్న పిల్లవాడు. ఆ మాత్రానికే అలసి ఆనాటి రాత్రి కాళ్లు నొస్తున్నాయని ఏడ్వటం సాగించా

డట. కారణం అడిగి తెలుసుకొని ఈ దొర ఆ బడిపంతులును పిలిచి చెడా మడా నాలుగు చీవాట్లు పెట్టాడు.

"బడి అన్న తర్వాత అందరూ ఒక్కటే మాకు. ఆటలాడితేనే పిల్లల శరీరాలు దృఢంగా ఉండేది." అంటున్న పంతులుగారి సౌమ్య గళాన్ని ఒక్క గాంభ్రీర్యంతో మూసేశాడు.

"గాడిద, గుర్రం రెండు ఒక్కటేనంటావ్ పంతులూ?"

"ఆ! యెంత మాట? పెద్దా చిన్నా గురు మర్యాదా ఉండవా? గాడిద గుర్రం ఎన్నటికీ ఒక్కటికావు. గాడిద గాడిదే. గుర్రం గుర్రమే" అన్నాడు పంతులయ్య దొర ప్రశ్నకు జవాబుగా.

"మరి మాచిన్నదొరను పంగబెట్టి ఆ కూలీనాలి అలగాజాతి ముండా కొడుకులను దుమికిస్తావ్?"

నోరెండిపోయింది పంతులుగారికి!

"ఆ మొద్దుగాడిద కొడుకులు మీదెక్కి దుమికితే మా బాబు ఓర్చుకుంటాడు? మల్లా వాళ్ళకు మావాన్ని ఎక్కి దుమికే సాహసమే. భలే మనిషివి. జాగ్రత్త కొంచెం! దొరింటి పిల్లవాడని మరచిపోకు," అని మందలించి పంపించినా, ఆ యేటినుంచే తమ పిల్లవాన్ని దొర పట్నం పంపించాడు. ఈ బడికి ఇక పంపలేదు. క్రింది జాతి పిల్లలతోకలిసి చదువుకుంటే గౌరవంగా ఉండదని వారి తలంపు.

వంట మనిషినిపంపి ప్రత్యేకంగా ఓ యింటిలో ఉంచాడు హాస్టల్లో సౌకర్యంగా ఉండదని. ఒక్కగానొక్క కొడుకు. చిన్నపిల్లవాడు. ఇంట్లో ముద్దుగా తిరుగుతుంటాడని భార్య కోరితే మొదట ఉంచినాడు.కాని ఆ దొరకు ఈ పల్లెలో తన కొడుకును చదివించాలనే లేకుండె. కాని కూతురు ఓ ముసలమ్మ పద్దలో వుండడానికి ఇష్టపడలేదు. అన్నగారి చేతికింద వుండడమూ నచ్చలేదు. పట్టుపట్టింది. హాస్టలులో చేరింది.

దొర కొడుకు శ్రీకాంత్ చదువుకు జరిగిన హంగామా అంతా మనస్సున మెదిలి రాజుఒక్క దీర్ఘశ్వాస వదిలేడు.

పేద పిల్లల చదువులు నట్టేటి నావలు. ఎన్ని అడ్డంకులు! పిల్లల కూలీ డబ్బులకు ఆశపడే తల్లిదండ్రులే ముసాఫితికకు పైగా. ఏటా రెండు

# 5

మలిసంధ్య. సూర్యుడు తన ధవళ కిరణ ప్రతాపాన్ని తగ్గించు కుని అరుణవర్ణంతో పశ్చిమాన కుంకుమరంగు కాబోతున్నాడు.

మామిడిచెట్టు చాటుగా పిల్లకాలువ ప్రక్కన పచ్చగా పెరిగిన గడ్డిలో కూర్చుని ఉంది సునంద. తెల్లటి నైలెక్స్ చీర కట్టుకుంది. దానిపై అక్కడక్కడ గులాబీపూలు ఆకుపచ్చని కాడలతో పాటుగా ప్రింట్ చేయ బడినై. రోజాకలర్ జాకెట్, రిస్ట్‌వాచీ. ఒంటిపేట ముత్యాలహారం, మూడు వరుసల ముత్యాలు వ్రేలాడుతున్న జూకాలు, పల్చటి పట్టీ శాండల్స్ పక్కన ఒద్దికగా వున్నాయి. ఆమె వెనుకవైపునుంచి సూర్యకాంతి పడుతు న్నది.

ఎదురుగా మామిడిచెట్టు కొరిగి నిలబడి ఉన్నాడు రాజు. ఖాకీ రంగు ప్యాంటు, తెల్లవానిపై నీలంగళ్ళ చారలున్న హాఫ్‌హాండ్స్ బుష్షర్టు వేసుకున్నాడు. ముఖంపై సూర్యకాంతిపడి చిరుచెమటతో నిండివుంది.

అతడు ఆమెకు అనుకున్నదానికన్నా అందంగా కనిపిస్తున్నాడు. సంధ్యారుణ కిరణాలు పైనబడి రంగు మనిషిగా సైతం కనిపిస్తున్నాడు.

"రాజూ!"

అటు ఆమెవైపు ఒకసారి చూసి వెంటనే తలను మరోవైపు త్రిప్పు కున్నాడు. పనిలేనిపని. కాలితో చెట్టుమొదట ఉబ్బెత్తుగా తేలి ఉన్న వేరును చిన్నగా తంతున్నాడు.

"పరీక్షలు బాగా వ్రాశావా?" సునంద అడిగింది.

"ఆ" అన్నాడు పొడిగా రాజు.

'నువ్వో' అనైనా అడగలేదు అనుకుని "రాజూ! నీతో నేను ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అంది సునంద.

"మాట్లాడండి" అన్నాడు, 'ఏ విషయం'? అనైనా ఆసక్తి చూపలేదు.

"కాలేజీలో నువ్వూ మీ ఫ్రెండ్సూ సాగిస్తుండిన చర్చలు చాల మాట్లు విన్నాను. అయితే నా అనుమానాలు తీరలేదు."

"మీమేం వాదించుకున్నామో, మీరేం విన్నారో నాకు తెలియదు కదా." అన్నాడు రాజు.

"మీరు పెళ్ళిళ్ళు ప్రేమలు గురించి మాట్లాడడం విన్నా. ప్రేమ వున్నచోట కులప్రసక్తి రాదని సుబ్బరాజు అన్నారు. కులం వున్నచోట ప్రేమ వుండదని నువ్వు అన్నావు. ఔనా?"

రాజు చిరునవ్వు నవ్వేడు.

"అబద్ధం ఏం వుంది ?"

"అబద్ధమే అనిపిస్తూంది. నేను పెళ్ళాడాలనుకుంటున్నా."

"చదువు మానేస్తారేమిటి ?"

"ఆ తర్వాత చూస్తాను."

"ఎవరినైనా ప్రేమించారా ?"

"అవును !"

"అయితే పెళ్ళి చేసుకోండి."

"అతను ఒప్పుకోవద్దూ ?"

"మీరు ప్రేమిస్తే కాదనే వాళ్ళెవరుంటారు ?"

"ఏం ఎందుకు ?" కొంటెగా అంది.

"అందమైన అమ్మాయివి. పెద్దింటి సంబంధం, బోల్డెంత కట్నం. ఎవరు కాదంటారు?"

"నా అందాన్ని, డబ్బుని పట్టికాక నామనస్సును ప్రేమించే వ్యక్తిని పెళ్ళాడాలని ఉంది నాకు."

"ఏం కట్నం ఇచ్చి పెళ్ళిచేసుకోనని మీ కాలేజీలో ఎమోషనల్‌గా ప్రతిన పూనారేమిటి ?"

"ఊహూ."

"మీనాన్నగారికి నష్టం అనుకుంటున్నారా ?"

"కాదు."

"మరి ?"

"నా డబ్బును ప్రేమించే మనిషితో నేను సుఖపడుతాననే నమ్మక మేముంది ? డబ్బు ఎన్నెన్నో దగుల్బాజీ వేషాలు వేయించుతుంది."

"నిజం చెప్పారు."

"అందుకని...." ఆమె మాట నాపేసరికి ఆ మాటను వినబోతున్న వాడల్లా ఆశాభంగమై ఆమెపంక చూశాడు.

ఆమె మాటకోసం తడబడుతూ ఆగలేదని, విషయాన్ని వివరించడానికి ముందు ఊరిస్తున్నదని గ్రహించేసరికి నవ్వు వచ్చింది. చూపులు తిప్పుకున్నాడు.

"నన్ను ప్రేమించే అతన్నే పెళ్ళాడాలనుకుంటున్నాను."

"మంచిదే."

"డబ్బుగాని కులంకాని చూడకూడదనుకున్నాను."

"కష్టమే సుమండి."

"అతడు తనకన్న పైకులం పిల్లని అయినా కాదంటాడంటావా ?"

రాజ నవ్వేడు.

"అతడు మీకన్న తక్కువకులంవాడనే ఆలోచన మీ బుర్రని వదలనే లేదుకదా."

ఆమె కొంతసేపు ఆలోచించింది. చల్లకువచ్చి ముంత దాచడమేమిటి ? అవకాశం వచ్చినప్పుడు అసమర్థతవల్లో అభిమానంవల్లో హృదయాన్ని నివేదించుకోక ఆ తర్వాత వీలుకాక బాధపడటం దేనికి ? తగదనుకుంది.

"నన్ను పెళ్ళాడడానికి ముందుకు రారంటావా ?"

"అనే అనుకుంటున్నాను" అన్నాడు రాజు.

"నువ్వైనా !" సమయాన్ని చక్కగా వినియోగించుకుంది. టీచర్ ప్రయత్నించి పిల్లవానితో పాఠాన్ని రాబట్టినట్లు యుక్తినంతా ఉపయోగించింది.

"నేనా !" అన్నాడతడు ఒకేసారి. ఆ మాటలో సంచలనం లేదు.

"ఏం ఎందుకు కాగూడదు ?"

అతడు నవ్వాడు.

ఆ నవ్వు ఆమెకు భయాన్ని కలిగించింది.స్పష్టంగా బయట పడింది.

"నిజం రాజూ ! దేవునిపై ప్రమాణంచేసి చెప్తున్నాను. నాకు నిన్నే పెళ్ళాడాలనివుంది."

"ప్రేమ! పెళ్ళి! దేవునిపై ప్రమాణాలు!"

"నమ్ము రాజూ నా మాట. నేనేం అబద్ధమాడుతూ లేను."

"మీరు అబద్ధమాడుతున్నారని నేనూ అనుకోవటంలేదు." అప్పటికా అనుమానం ఇదివరకే వుంది.

"సునందగారూ! ఆవేశానికి లోనయి నన్ను అపహాస్యం పాలు చేస్తున్నారని మాత్రం అనగలను."

"కాదు రాజూ."

"అవును సునందగారూ. మీకు నాతో పెళ్ళా?"

"ఏం ఎందుకు కాగూడదు?"

"మన కులాలు వేరు. అంతస్థులు వేరు. నాకూ మీకూ నక్కకూ నాగలోకానికున్నంత దూరం వుంది. అనటానికి మీకు వివేకం పనిచేయకున్నా వినే నాకైనా...."

"కాదు రాజూ. కులం, ధనం, అంతస్థు ఇవన్నీ అబద్ధాలని నిరూపించుదాం. ప్రేమకు అవేవీ అడ్డురావని చాటిచెప్పుదాం."

"మీ నాన్నగారు అంగీకరిస్తారా?"

"అంగీకరించ కేం జేస్తారు."

"ఏ పరిస్థితిలోనూ ఒప్పుకోరు."

"ఒప్పిస్తాను."

"ఒప్పుకోరు?"

"ఒప్పుకుంటే?"

"ఒప్పుకోకపోతే?"

"ఏ దూరప్రాంతానికైనా వెళ్ళి ఏ పనైనా చేసుకుంటూ హాయిగా జీవిద్దాం."

"దొంగలవలె పారిపోయి."

"తప్పేంకాదు రాజూ!"

"తప్పేం కాదు. ముప్పు రాకపోదు. మావాళ్ళు జాడలుదీసి నన్ను తన్ని లేదా హతంచేసి, నిన్ను మళ్ళీ యింటికి తీసుకొచ్చుకొని మునుపటి కన్న మిన్నగా, ప్రేమగా చూసుకోరూ?"

"కాదు. అట్లా ఎప్పుడూ కాదు."

"ఏదికాదు దొరసానిగారూ? అట్లా చేసినవాళ్ళ నెందరిని చూస్తూ లేము. ధనికులైన యువతులు యువకులు ఎందరినో పేదవారిని ఆశలు చూపి ఆకర్షించి, ఆ తర్వాత మోసగించి తిరిగి వచ్చి హాయిగా పెళ్ళాడి సుఖించడం చూస్తూనేవున్నాం."

"నన్నట్లానే భావిస్తున్నావా?"

"నేను ఎట్లా భావిస్తూలేను."

"మావాళ్లు ఒప్పుకుంటే ఒప్పుకుంటావా?"

"లేదు. ఒప్పుకోలేను."

"ఏం అంత పనికిరానిదాన్నా?"

"అర్హత నెరిగి ప్రవర్తించడం నా బాధ్యతగా గుర్తించి-"

"కావాలని అర్హత వరించి వచ్చినప్పుడు?"

"అయినా నా స్థానం గుర్తుంచుకునే మెదలుతాను."

"అదృష్టాన్ని కాదనవద్దు."

"అది నాకు వద్దు."

"పిచ్చివానివి కాకు రాజూ."

"నావాళ్ళందరినీ కాదని అందలాలెక్కాలనే స్వార్థం నాకు లేదు. నా అర్తవాటంట్లో చిన్నగా చూస్తే సహించే సహనమూ లేదు."

"నీ కే రీతిగానూ ఆత్మగౌరవానికి భంగం రానీయను."

"అది మీనుంచి కాదు. మీవాళ్లు వినరు. పైగా ప్రేమ పెళ్ళి అనే మాటలిప్పుడు అవసరంగా లేవు నాకు."

"రాజూ!"

"మీకోసం చూస్తుంటారు ఇంట్లో. త్వరగా వెళ్ళండి. వచ్చి సాగనంపివస్తాను. రండి చీకటవుతున్నది మాట మార్చాడు.

"నేను వెళ్ళగలనులే" ఆమె లేచి రుసరుసలాడుతూ వెళ్లుతున్నది తిరిగి చూడకుండా.

అతడా వెవంకనే చూసి నిట్టూర్చి నీరులేని మోటకాలువలో కూర్చుని తల వంచుకున్నాడు.

# 6

వీధి భాగవతం 'అల్లిరాణి కథ' ఆడుతున్నారు నటీపూళ్ళో దొర గారి బంగ్లా ముందర.

చిన్ననాటి స్నేహితులతో కలిసి రాజు సైతం ఆట చూడటానికి వచ్చాడు. కథ కావాలని కాదు, కేవలం కాలక్షేపానికని వచ్చాడు.

'వాడేం వస్తడురా పట్నం మనిషి' అని ఎకసెక్కెం ఆడిన మేన బావ మాట సరికాదని నిరూపించడానికి వచ్చాడు. పక్కింటి చంద్రయ్యా తోడున్నాడు.

ఆట నడుస్తున్నది.

అల్లిరాణి కథ జైమినీభారతంలో వుంది. ఆమె స్త్రీల రాజ్యానికి రాణి. ఎక్కడ మగవాళ్ళు కనిపించినా చంపడమో దూరం పంపడమో నాటకంలో ఉన్న విషయం. మగవాసన గిట్టదు వాళ్ళకు. అంతా ఆడపెత్తనమే.

కాని, జైమినీ కథలో మాత్రం మగవాళ్లు కనిపిస్తే పట్టుకెళ్ళి యథేచ్ఛగా అనుభవించి నిర్వీర్యుల్నిచేసి పిదప వారిని చంపెయ్యటం ఆ దేశపు స్త్రీలు కావించేవారని వుంది.

అల్లిరాణి అనబడే ఈ రాణీప్రమీల సైతం అంతే.

మహాభారత యుద్ధానంతరం ధర్మరాజు అశ్వమేధయాగం చేసి ఆ సవనాశ్వాన్ని భూ ప్రదక్షిణకు పంపిస్తాడు.

ఆ అశ్వసంరక్షణకు సేనా పరివారంతో అర్జునుడు వెంట వెళ్ళాడు. ఎదిరించిన రాజుల నెల్లా జయించుతూ విజయుడు ముందుకు వెళ్ళాడు. కాని అల్లిరాణితో కథ తలక్రిందులైంది. జయుడు విజయుడు కాలేకపోయాడు. ఏడాది దాటేటట్లుంది. అపజయంతో అజాత శత్రువును దర్శించలేడు. అవమానం! ఎట్లా అని అర్జునుడు సోచాయిస్తూవుంటే ఆపద్బాంధవుడు శ్రీకృష్ణుడు వచ్చి మంచి మార్గం చూపాడు. ఆ రాణిని పెండ్లాడుమన్నాడు.

"హరి హరీ? ఆ స్వైరిణిని పెళ్ళాడాలా"? అన్నాడు కిరీటి. తప్పదు" అన్నాడు పరంధాముడు. చేసుకున్నాడు అర్జునుడు అల్లిరాణిని పెళ్ళి! విజయుణ్ణని మరోసారి నిరూపించుకున్నాడు నరుడు.

ఆ కథ పల్లెటూరి వారి వర్ణనల్లో కల్పనల్లో మరీ వింతరూపు సంతరించుకుంది.

కృష్ణుడు మాయాగారడి వాని రూపుదాల్చి పాముగా అర్జునుని మార్చి అల్లిరాణి ఇంట ఉంచి వెళ్తే, ఆ సర్పం కందర్ప సుందర పురుష రూపంతో వెళ్ళి ఆ రాణిని ఎన్నో చెప్పరాని పనులన్నీ చేస్తుంది.

ప్రేక్షకులంతా నవ్వుతున్నారు. స్త్రీలు సిగ్గుపడుతున్నారు. సిగ్గు మరచిన వాళ్ళయినా తెగసిగ్గు నభినయిస్తున్నారు. నిద్రపోతున్న చెలికత్తెల లేపుతున్నారు మరికొందరు.

కథ రసపట్టులోఉంది. రాజు ప్రక్క మిత్రులు మోచేతితో అతన్ని పొడుస్తూ నవ్వుతున్నారు. లైటు వెల్తురు ముఖంపై ప్రతి ఫలిస్తూ ఉండగా గోడక్రీనీడలో నవ్వుతూనిలబడ్డాడు రాజు. కాని అతన్ని మేడపైభాగం ముందుడాబాపై పడకకుర్చీలో కూర్చునిఉన్న ఒక సుందరి తన్మయత్వంతో చూస్తున్నదనే విషయం అతనికి తెలియదు. సునంద పాతాళభైరవి సినిమాను చూసి రాజుపై ప్రేమ మరింత పెంచుకుంది. ఆ చలన చిత్రం లోనూ రాకుమారి తోటమాలి కొడుకును ప్రేమించుతుంది. అదో అందమైన సాహసచర్యగా ఆమె మనస్సు నాకట్టుకుంది. తమ తోటకాపరి కొడుకుపై వలపు పెంచుకుంది. ఆ వలపును పంచుకుందామంటే అతడువినటం లేదు. ఆ ఆలోచనలలో ఆమె మేలుకొనే కలలు కంటూంది. కలలోరాజు ప్రత్యక్షం,

తాము ఇద్దరే ఉన్నారు. చుట్టు పక్కల చెట్లూ గుట్టలు.

మసక వెన్నెల. ఆమె వెళ్ళేసరికి అతడు తనకోసం ఎదురు చూస్తున్నాడు. అల్లంత దూరంనుంచే ఆమెను గుర్తించి అతడు ఎదురుగా వచ్చాడు. ఎదురు చూసిన క్షణం :

"రాజూ!"

"సునందా దేవిగారూ?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను"

"నిజం ?"

"నిజం రాజూ ! నిజం"

"నా మనసు నమ్మలేకున్నది."

"నీవు లేకుంటే బ్రతకలేను రాజూ! నీతోడిదే నా జీవితం. నీవే నా సర్వస్వం. నన్ను నీ దాసిగా చేసుకో–"

ఆ మాటతో ధైర్యంగావున్నది. పలుకుబడిలో రసతన్మయత్వం వున్నది. ఆ ప్రేమలో ఎంతో బలముంది. ఆ ఆత్మార్పణంలో ఎంతో స్వచ్ఛత ఉంది. ఆ అర్థింపులో ఎంతో మధురవేదన ఉంది. రాజు పరవశుడయ్యేడు. "నాజీవితం ధన్యం." అంటూ ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు. అతని బాహుబంధంలో ఆమె ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నది. ఆ చుంబనాలు, ఆ స్పర్శలు, ఎడతెరపి లేకుండా – ఎంత హాయి ! ఎంత బాధ ! బాధలో హాయి, తీయని బాధ, మరువలేని హాయి. మధురమైన బాధ.

ఈ మధుర క్షణాలు జీవితంలో శాశ్వతంగా ఉంటే – ఉండలేదు. నవ్వులతో ఉలికిపడింది.

# 7

రాజు తన తమ్ముడు రాములును గురించి ఆలోచిస్తున్నాడు. వాడికి నాటకాలు, తోలుబొమ్మలాటలు, బొబ్బిలి కథలు, నడకకు అందే దూరంలో ఎక్కడ ఏ వినోదం వుందన్నా పరుగెత్తేవాడు కూడారమ్మని అన్నని వేధించేవాడు. వాని బాధపడలేక ఎన్నిమార్లో పుస్తకాలు మూలబెట్టి వెళ్ళేడు. వాడీవేళ లేకపోవడం ముల్లుగుచ్చినట్లు కనిపిస్తోంది.

రాజుకంటే రాములు కేవలం రెండేండ్లు చిన్నవాడు. కాని ఇద్దరిని ఒకేసారి చూస్తే ఎవరు పెద్దో గుర్తించటం కష్టం. కవలపిల్లలుగా కనిపించేవారు. ఇంకా రాములు కాస్త మందం.

వెంకన్నకు కొడుకులిద్దర్నీ చదివించాలనే ఉంది. తనలా గొడ్డు చాకిరి చెయ్యకుండా కొడుకులు చదువుకుని దొరబాబులవలె బతుకాలని అనుకున్నాడు.

రాజు ఉన్నూరి చదువు ముగించి బస్తీకి వెళ్ళినాడు. పట్టువదలక వెంకన్న రాములును బడికి పంపసాగాడు. చదువు రాకడపోనీ పిల్లవాని నడక సైతం అదుపుతప్పింది. ఎవరు ఏ పని చెప్పినా రాములు తయారు. మొదట గొప్ప కోసంచేసినా ఈ పనులు సైతం పాఠాలు ఎగవెయ్యడానికి మంచి దారిగా కనిపించేయి. మాస్టర్లూ అతనిని ఆదరించేరు. ఏ మాస్టరింట పనిచేస్తున్నా బడిలో ఉన్నట్టు హాజరు పడుతుండేది. మార్కులెట్లున్నా పిల్లల హాజరుని బట్టి ప్యాసు నిర్ణయం చేస్తూంటే ఒక్కొక్క క్లాసు సక్రమంగానే పెరుగుతూ వచ్చాడు. ప్రక్కూరిలో చదివేటప్పుడు ఏడవ తరగతి అతన్ని ముంచింది. కాపీ చేయటం సైతం చేతకాలేదతనికి. రెండవ సంవత్సరం రాములును ఏడవ తరగతిలోనే ఉంచినప్పుడు ఎప్పుడు పాడే పాట పాడాడు దొర.

"ఏం చదివి కలెక్టరైతాడ్రా యెంకా నీకొడుకు. ఎందుకింకా వాన్ని బడికి దోలుతవ్. మీ తాత ముత్తాతల నుంచి మీరందరూ చదువుకునే బతికినార్రా? మన్నును నమ్ముకునోడు చెడిపోడు. కోటి విద్దెలు నేర్చినా కొండ్రను మించవ్రా."

"నిజమే దొరా, ఆ కొండ్ర ఉన్నంక యిన్ని బాదలెందుకు?"

"ఇదేందిరో, కొత్తగా మాట్లాడుతున్నవ్. ఈ భూములన్నీ యెవలయ్‌రా? మీరు దున్నకపోతే మేం దున్నుతున్నాంరా. మీరు తినంగ మిగిలిందే కాదురా మా యిండ్లకు చేరేది."

ఎంతటి అప్రియాలనైనా ఎంతో ప్రియంగా, ఎంతటి అసత్యాలనైనా సత్యాలుగా బోధించగల, వాదించగల ప్రజ్ఞ దొరవారికుంది.

రెండవసారి యేడవ తరగతిలో తప్పినప్పుడు తనవంక దిగాలుపడి చూస్తున్న తండ్రితో "నేను చదువుకోనే ఇగ." అన్నాడు రాములు.

"ఏం జేతవురా మరి?"

"మీ వోలె యెవుసంజేత్త."

"మేం యిన్నేండ్లబట్టి ఈ పనిజేసి రెండుసేతుల తింటన్నం. ఇగ నువ్వు నాలుగు జేతుల తింటవ్" అప్పటికి ఆ సంభాషణ ఆగింది.

పెళ్ళాం యెంకన్నకు నచ్చజెప్పింది.

"అందరి రాత లొక్క తీరుగుండయ్. ఎవల బతుకులెట్ల సదుప నున్నయో నారాయుడి కెరుక. నరులం మనమెంతటోల్లం. కొడుకేమో సదువుకోనంటుండె. నువ్వు అన్ని ఒత్తిడిజేత్తె ఆడు తిక్కతోని మనకు కాకుంట అయి యేన్నన్నబోతడు. సచ్చినాసత్తడు. మనం మొసుకటినుంచి ఈ సదువుల్లోనే బతికినమా? మనోలాడు."

"మన కొడుకులు మనోలె మంల్లెబొర్లుతా, మాసిన పేలుకలు కడుతా గిసోంటి తాటాకు గుడిసెల్ల బత్తుకద్దే. దొరలొలె బతుకాలె అని నా ఆసె."

"ఆసెలకేంది మత్తుగుంటయ్. అందరు పల్లాకీలెక్కితే మోసె టోల్లెవ్వలు. అయినా పెద్దోడు సమవుతాండుకదా. ఈన్నే మనకు. మొదలే మోర్దోపోడు."

ఒప్పుకున్నాడు వెంకన్న. ఒప్పుకోక చేసేదీలేదు. ఆ తర్వాత ఆరంభమైనవి అసలు చిక్కులు. ఎక్కడెక్కడో జీతానికని కుదిరినా రాములు ఎక్కడా ఎక్కువకాలం నిలువకపోయేవాడు. చెయ్యాలనుకుంటే బండినైనా ఒక్కడు లాక్కరాగలడు. కొండనైనా పిండికొట్టగలడు. కాని, పనిచేయటంలో నిలుకడ లేదాతనికి. గల్ఫ్ దేశాలకు పోతే బాగా డబ్బు వస్తుందంటున్నారు. ఆఖరికి దేశంలోనే బొగ్గు బావులకు పనులకుపోయేనా.

"నేను దేశం బోతనే అయ్యా." అన్నాడు రాముడు.

"అద్దుర కొడుకా, అయితే సదువుకో, కాదంటే యిక్కన్నే మా కండ్లముందట యేదన్న పనిజేసుకుంట బతుకు. దేశంకాని దేశంల దిక్కు లేని పచ్చోలె ఎట్లుంటవ్ కొడుకా? మల్లా నిన్నిడిసిపెట్టి మాకు మంచి నీల్లెట్లా నోల్లెకు పోతయ్?" వెంకన్న అన్నాడు.

"నాకేమైందే ఏంటొ ఆడిదాన్ని జేసినట్టుగ జేత్తున్నరు. ఆడిది తిరిగి జెడె, మొగోడు తిరుగక సెడె. నన్ను పోనియ్యరనే. సూడుర్ని మల్లీదినం నాటికి ఎన్ని రూపాయలు సంపాదించుకత్తనో. దారి కర్సులిత్తే చాలు. అక్కడి తంటలెవ్వో నేనే బడుత."

"యాభై నూరన్నా చేతులలేంది యెట్లపోతవ్ కొడుకా. అయిదు రూపాయలన్నా లేవ్వాయె. మల్లా బొగ్గు బాయిల్ల మోటు కట్టంచేసే నౌకర్ల కయినా వెయ్యి పదియేను నూర్లు లంచాలు బోత్తున్నరట. గన్ని రూపాయలు మనకేన్నుంచ త్తయ్. ఇగ మిగిలింది దినం కూలి. అది ఇక్కడ మాత్రం దొరుకదా. ఆడ రెండు రూపాయ లెక్కువ రావచ్చు. అంతకు తగ్గట్టు కష్టలుండయ్‌రా. ఇక్కడ కుండలున్నది తిని మా కండ్లముందట తిరుగుతవ్ కాదు కొడుకా."

"రెక్కలచ్చేదాకనే పిల్లలెట్ల బతుకుతరో అని అనుకోవన్నే. రెక్కలచ్చిన పిట్టలు ఎటన్న ఎగిరిపోతయ్. ఆటికి తల్లిపిట్ట మేత పెడుతన్నాదీ? ఏమో రంది పడుతవ్. అడ్డమాటలంటవ్." అన్నాడు రాములు.

"గన్ని యిచారాలు నీకున్నంక నేను జెప్పితే యింటావు కొడుకా. నువ్వు నా అంతోనివయితివి. నాకంటె తెలివిగల ఆలోచనల్నే ఉంటివి. నీయిష్టం, ఉండు. పో. యేమన్న కా. నాదగ్గిర మాత్రం చిల్లికొత్త సుతెం లేమి. నీ యిష్టం రా" ఖచ్చితంగా తెగేసి చెప్పాడు వెంకన్న. రాములుకు తండ్రిమీద కోపం వచ్చింది. అంతకు మిక్కిలి తన చేతగానితనంమీద బాధేసింది. ఎట్లాగైనా వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని. డబ్బు! డబ్బెట్లా మరి?

దొరనడుగుదామంటే "నీ కొడుకును నాకే జీతం ఉంచురా" అని పోరు పెడుతుండె అయ్యతో ఇస్తాడు? షావుకార్లయో రెండు మూడిండ్లున్నయ్. ఒక్కడు చిప్పలు నాకిన పైపూట కొపూటకు ఎట్లాగో వెళ్ళదీసు కొస్తున్నడు ఆరుగురు బిడ్డల్తోటి. ఇంకిద్దరు గట్టిగానే ఉన్నారు. మందికి వెయిలకొద్ది వడ్డీల కిస్తారు. వాళ్ళు పచ్చినెత్తురుతాగే రాతిగుండె మనుషులు. పని: పోతున్నానయ్యా అంటే బతికి బాగుపడు కొడుకా అని పది రూపాయిలు బయలిస్తారు. కానిపని.

రాములు దినం కూలిపనికే పోతుండేవాడు. రోజుకొక్క రూపాయన్నా వెనుకేసుకోవాలని ఆతని తలంపు. ఒక్క వంద రూపాయలు జమ కాగానే ఎట్లైనా వెళ్ళిపోవాలని అనుకున్నాడు.

ఆ పూరి పెద్దిశెట్టి కన్ను రాములు మీద పడింది. ఇతడు ఒళ్ళు దాచుకోక పనిచేసేవాడు.

కట్టెలు కొట్టటానికి, గోడలు పెటటానికి, ధాన్యం బస్తాల కెత్తటానికి రాములునే పిలిచేవాడు శెట్టి. "నెలజీతంమీదఉండురాదురా రాములూ మందికన్నా కుంచెడు ఎక్కువనే ఇస్తా." అన్నాడు శెట్టి రాములు పనితీరు జూసి.

"ఊహు, నౌకరిల పడితే కాళ్ల రెక్కలు కట్టిపడేసినట్టుగుంటది. ఇట్లనే దినం కూలిచేసుకుంటా. సేతనయిన నాడు చేసుకోవచ్చు. లేని నాడు లేదు. ఇష్టం వచ్చిన కాడికి తిరిగి రావచ్చు. ఎవ్వలు అనెటోల్లుండరు. సతంత్రం సర్గలోకం." రాములు మాటలు విని నిజమే అనిపించినా పెద్దిశెట్టి "నువ్వు యిచిత్రమైన మనిసివిరా"అని అన్నాడు.

నిండుగా నవ్వాడు రాములు. అతని రూపమే గంభీరమైంది. నిగనిగలాడే లేత నలుపులో కండలు తిరిగిన దేహం, గుబురుగావచ్చే మీసాలు, నవ్వితే గుండ్రంగా మారే చెక్కిళ్లు, ఎత్తైన రొమ్ముభాగంతో కొదమ ఆబోతులా కనిపించేవాడు రాములు.

అతన్ని చూస్తే మనసు మెత్తని పడుచులకు ఆశగా ఉండేది. పెద్దపులి వలె పక్కచూపులు లేకుండా ఎత్తిన తల దించకుండా గంభీరంగా పొయేవాడతడు. కాని అతని తలను వంచింది పెద్దిశెట్టి విధవ కూతురు వరమ్మ.

వరమ్మ చిన్ననాడు పెద్దిశెట్టికి పొట్టకు గడవటమే కష్టంగాఉండేది. ఎక్కడో ఓ పేదింటి పిల్లను అయిదు నూర్లు పిల్లతండ్రికిచ్చి కొని తెచ్చి పెళ్ళి చేసుకున్నాడు. ఏ ఆకర్షణ లేకున్నా ఆమె స్త్రీ. అది చాలు లతనికి. అతని పుణ్యంపండి వరుసగా ముగ్గురు ఆడపిల్లలే పుట్టారు. తన దారిద్ర్యం తొలగిపోతుందని అతడు తెగ సంబరపడ్డాడు. నాలుగవ కాన్పు కొడుకే కాని వెడ్డి నాగన్న.

మాయింట యెద్దీనిందోయ్ నాగన్నా. అంటే నాను జున్నుపాలు పొయ్యవా? అంటాడు కాని, ఎద్దు ఈనుతుందా లేదా అనే ఆలోచన రాదతనికి. అన్నిటికి మించిన వింత అతన్ని యెవరైనా వెడ్డి వానివంటే ఊరోక్కడు.

నువ్వు వెడ్డి, మీ నాన్న వెడ్డి. మీ తాత వెడ్డి అంటూ, వినేవాడుంటే అలా గంటల కాలం గడిపేయగలడు. అతనికి పెండ్లయింది. ఓ

అభాగ్యుడైన ఆడబిడ్డల తండ్రి ఈ వెడ్డి నాగన్నకో కూతురునిచ్చి కన్యా దాతననిపించుకున్నాడు, కొంత భారాన్ని దించేసుకున్నాడు. ఈ నాగన్న పెళ్ళివరకు పెద్దిశెట్టి యిల్లూ పెరిగిపోయింది. పల్లెటూరి బేపారం. కూలినాలి జనం దగ్గర దినుసు కొన్నా లాభమే. అమ్మినా లాభమే. వాళ్ళకు కొలతలూ, తూనికలూ సరిగా తెలువవు. మెత్తని మాటల్తో నవ్వుతూనే నెత్తురు పిండుకుంటారు వీళ్ళు. వాళ్ళకా కొనక తప్పదు. కాదంటే గడవదు. వీన్ని కాదని మరోని దగ్గరికి పోయినా వాడూ బేపారపోడేనాయే. అట్లా మెల్ల మెల్లగా పెరిగి పెద్దిశెట్టి చుట్టు నాలుగూళ్ళకు లెక్కపెట్టగల పెద్దశెట్టి అయినాడు.

ఆయన కూతుళ్ళ వివాహాలే మూడూ మూడు రకాలుగా జరిగినై. మొదటి బిడ్డ పెండ్లికి ఇతడు ఆశించినట్టుగానే కన్యాశుల్కం లభించింది. రెండవ కూతురు కల్యాణ సమయం వచ్చేసరికి కాలం ఎట్లాగనో మారసాగింది. కన్యాశుల్కాలకు బదులుగా వరకట్నాలు చోటుచేసుకోసాగినై. వాళ్ళ కులంలో కూడా ఇదెక్కడి బాధరా భగవంతుడా అనుకుని 'మీరేం ఇవ్వకండి మేమేమివ్వం' అని గంతకు దగిన బొంతగా ఏదో అందివచ్చిన సంబంధంతో ఆ పెండ్లి అయిందనిపించాడు.

మూడవ కూతురే ముదనష్టదయింది. ఆ కాలంలోనూ అయిదు పది వేలు కట్నం పోయందే పిల్ల పెళ్ళి కాని పరిస్థితి వచ్చింది. డబ్బు సంపాదన ఓ మోస్తరుగానూ ఉండేది కాని ఖర్చు జాస్తి అయ్యేది. ఒక్కరెక్క సంపాదనకు నలుగురైదుగురు కూచుండి తినేవాళ్ళయిరి. అందులో ఆయన భార్య కదేమి రోగమోకాని తీర్థయాత్రలకు మందుమాకులకు బోలెడంత ఖర్చయ్యేది.

చిన్న అమ్మాయి పెళ్ళి కష్టమై పెద్దిశెట్టి పెళ్ళాం ఒంటిమీది బంగారం తీసి బిడ్డమీద పెడదామనుకుంటే "నువ్వుపోతే నా గతెట్లా" అంది ఆ ఇల్లాలు.

"కొన్న భూమి అమ్ముతా"నంటే "ఒక్కడు కొడుకు వాడు. వెర్రి నాగన్న. వాని బతుకెట్లా?" అంది ఆ కన్నతల్లి.

ఏం చేయటానికీ పాలుపోలేదు షాహుకారికి. కాని అన్ని కార్యాలనూ కడతేర్చగలవాడు సర్వేశ్వరుడు లేడూ. ఆ ఆపద్బాంధవుడు ఆయనకూ ఒకదారి చూపించాడు!

పెండ్లాం చచ్చినా వయసు హెచ్చినా పుచ్చే ధనమున్నదని ఓ షాహుకారి యితని మూడవ కూతురికి రాయబారం పంపించాడు. విధిలేక పెద్దిశెట్టి సరే అన్నాడు. వరమ్మకూ అలా ధనికుడైన వరుడు లభించాడు. కాని, రెండేండ్లు తిరగకముందే హరీ అన్నాడు. ముండమోసినా మువ్వయి తులాల బంగారంతో వచ్చిన కూతురిని ఆదరంగా చూశారు అమ్మానాన్న. వాళ్ళ పరిస్థితి మెరుగయింది. ఇంటి చాకిరి చేస్తుంది. ఇంత తిని ఉంటుంది వరమ్మ.

అన్నీ సరె దేనికీ చింతలేదు. కాని, వయసో? అదే చిక్కు తెచ్చి పెట్టింది. నిద్రపట్టేది కాదు. మనసు నిలిచేదికాదు. తనకు మళ్ళీ పెళ్ళిచేస్తే బాగుండుననుకుంది. తనవాళ్ళకు ఆ ధ్యాసలేదు, తానడిగితే "ఛీ ఎంత మాట" అని అంటారని భయపడింది. అడుగలేదు. కోరికలూ అణగలేదు.

ఆమె కంటికి రాములు ఆనేడు. ఆపదలో వున్న తనను ఆదుకోవటానికి వేంచేసిన దేవునిలా కనిపించాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలనుకుంది.

అదేమిటో అనుకున్నట్లుగా అతడీమెకు ఒంటిగా చిక్కేవాడు మాట కలిపింది. మనసు విచ్చింది. వనిత తనంత తా వలచివస్తే కాదనే జితేంద్రియుడు కాడతడు. వయసు పరువంలో ఉన్నవాడు. ఇది పాపం అనే భయం లేనివాడు. ఆమె పున్నెం ఫలించింది. చాటుమాటుగా చిరుతిండ్లు దాచి అతనికి తినబెట్టేది. ఇద్దరికీ బాగానే వుంది ఆ స్థితి.

ఆమె తల్లిదండ్రీకీ విషయం పూర్తిగా తెలువదనడానికి వీల్లేదు. అదేమిటో చూసీ చూడనట్లుగా వుండేవారు. సరిగా తెలియదో, తెలిసి కూతురు ఆ విధంగానైనా సుఖపడని అనుకున్నారో, బిడ్డ ఆశపడ్డ వాడు అడ్డమైన చాకిరంతా చేస్తాడనే భావనేనో తెలియదు.

ఒకనాటి రాత్రి తెల్లవారటానికి ముందు మసక చీకటివేళ వరమ్మ తమింటి వెనుక రాములుతో ముచ్చటిస్తున్నది. ఆ చుట్టూ పెద్ద ప్రహరి వుంది. నల్లులో దోమలో కుట్టి నిద్ర సరిగా పట్టని పెద్దిశెట్టికి మెలకువ వచ్చి ఆ మాటలు వినవచ్చినై. కళ్ళు మూసుకొని పడుకోవాలనుకున్నాడు కాని ఆ మాటల్లో బంగారం అనే శబ్దం వినబడింది. అంతే. టకీమని లేచి కూర్చున్నాడు. వాడే ఎక్కడైనా ఏ నగైనా తెచ్చి ఎత్తుకొచ్చి శఃమెక్కిస్తు

న్నాడేమో అని ఆశ పడ్డాడు. ఉత్కంఠ నాపుకోలేక పిల్లి నడకతో వెళ్ళి తీసి వున్న తలుపుచాటుగా నిలిచి తొంగిచూశాడు. ప్రాణం పోయినంత పనయింది. వరమ్మ తనచేతి బంగారు గాజులు రెండు రాములుకిస్తున్నది.

దొంగ దొంగ అని కేకలేస్తూ ఉరికి పెద్దిశెట్టి రాములును అందుకో బోయాడు. అతడు ఇతన్నినెట్టి పరుగెత్తాడు. ఏమీ చేయలేక యితను బిడ్డను తిట్టాడు. ఆమె ఏమీ అనక వెళ్ళి చేదబావిలో దుమికింది. తండ్రి అల్లరికి వాళ్ళు వీళ్ళు వచ్చి తీసేసరికి ఆమె ఆయుపు అంతరించిండి. ఆ నేరం రాములుమీదకి నెట్టాడు శెటి. కాని అతడు అప్పటికే ఊరు విడిచాడు.

ఈ కథ యింత వివరంగా కాకున్నా సూచాయగా రాజుకు తెల్సు. వానిమీద కేసు లేపన్నా మనిషి పత్తాలేడు. వెర్రినన్నాసి అనుకున్నాడు.

# 8

'కొక్కొరొక్కో' కాళ్ళమీద నిక్కి మెడవంచి గొంతు నిండుగా కూసింది వెంకన్న గుడిసె కొప్పుమీద నిలబడి కోడిపుంజు. దాని బంగారు రంగు ఈకెలు తళతళ మెరుస్తున్నయ్ ఉదయ సూర్యకాంతికి.

"కోడిపుంజు పెద్దగుందికదనే" రాజు అన్నాడు వేపపుల్ల నోట్లో వేసుకుని నముల్తూ గుడిసెముందు నులకమంచంలో కూర్చుని.

"దేవుని పుంజు కొడుకా" తల్లి అన్నది.

"ఏం చేపుదే అమ్మకపోయినారా పది, పదిహేను రూపాయ లొచ్చును."

"అచ్చినయన్ని ఉన్నయే. ఇయ్యింటాయి. మాంకాలవ్వకు కోత పని మొక్కిన. అక్కచ్చినప్పుడు గట్లనే అంది మంచిగుంది పుంజు కోసు కుందామని. ఆగుబిడ్డా పట్నంనించి తమ్ముడు రానియ్యి కోతనన్న. రేపొద్దుగాల నువ్వన్న అయ్యన్న పొయ్యి అక్కనెంట పెట్టుకరాండి" అంది దుర్గమ్మ.

"నేను పంపుబావి దగ్గరికి పోయి స్నానం చేసొస్తా" అని రాజు తువ్వాల భుజంమీద వేసుకుని తోటవైపు బయల్దేరాడు.

ఆ పరిసర వాతావరణం అతనికి ఆహ్లాదకరంగా ఉంది. బాల్యంలో జీవించిన పరిసరాలు మన మనసుల్లో మధురస్మృతులుగా నిలిచి ఉంటాయి. మళ్ళీ అతడు బస్సీ రద్దీ జీవితంనుంచి వచ్చినవాడు కాబట్టి పల్లెటూరి ప్రశాంతత తప్పక ఆకట్టుకుంటుంది. స్నానాదికాలు ముగించుకుని అలా తిరుగుతూ ఇంటికి చేరవచ్చేసరికి రెండుమూడుగంటల సమయం గడిచింది. ఉదయం పదిగంటల కాలం అయింది. ఆకలిగా వుంది. అక్కడ కాలేజీ హాస్టల్‌లోనైతే ఉదయం బ్రేక్‌ఫాస్ట్ ఈసరికి ఎప్పుడో అయ్యేది. ఇక్కడ టీ కూడా లేదు. లేదనే విచారమూ లేదు. కాని ఎందుకు లేదు? కొందరి బ్రతుకులిట్లా ఎందుకు కూటికి గుడ్డకు నోచుకోకుండా అధ్వాన్నంగా ఉన్నాయి అనే ఆలోచన మాత్రం వచ్చింది.

అందుకు కారణంగా కొందరు చెప్పుకునే ఈ కథ అతని స్మృతిలో మెదిలింది.

అనగా అనగా ఓ రాజు. ఆయనగారికి పెద్ద విచారం పట్టేసుకుంది. ఈ లోకంలో ఇంతదుఃఖం ఎందుకుందీ అని. ఆ రాజుగారుమాత్రం దారిద్ర్యంవల్లనే యిన్ని కష్టాలూ వస్తున్నాయనుకున్నాడు. అందరూ ధనవంతులైతే ఇంకే బాధలూ ఉండవనుకున్నాడు.

తపస్సు నారంభించాడు. అడవులకు వెళ్ళకాదు అంతఃపురమందుండే. దేవుడు కనిపించాడు

"భక్తుడా ! ఏం కావాలి, నీ తపస్సుకు మెచ్చాను." అన్నాడు

"నా రాజ్యంలోని ప్రజలంతా ధనవంతులు కావాలి." అన్నాడు రాజు.

దేవుడాలోచనలో పడియిలాగన్నాడు: "వద్దు. అందరు ధనవంతులైతే పనులెవ్వరు చెయ్యాలి. డబ్బుంటే చాలు వళ్ళువంచి పనులుచెయ్యరు; తేరగా కూర్చుని తినాలనుకుంటారు. తినగా తినగా వాళ్ళ శరీరాల్లో క్రొవ్వు పేరుకుపోయి, బాగా వాతం బలిసి లేవటం, కూర్చోవటం, నాలుగడుగులు నడవటమే కష్టమౌతుంది. ఇంకా పనులేం చేస్తారు."

పైగా పనులు చేయడం నామర్దాగామారి పనిమనుషులతో చేయించుకోవటం అలవాటుగా మారిపోతుంది. ఇంటి నుండి బయటకు కదలరు. ఇట్లా ఇంకెన్నో ఘరానా లక్షణాలు ఏర్పడుతాయనీ చెప్పి ఉండవచ్చు.

"కూడదు రాజా ! జనులంతా ధనవంతులు కావాలనుకోవటం అవివేకం. అది మనకు ప్రమాదాన్ని కొని తెచ్చుకోవటం" అన్నాడు.

రాజు విన్నాడు తన పట్టు వదలలేదు. రాజు దైవాంశసంభూతుడే నయ్యె. దైవం ప్రేమతో అతని మేలుకోరిచేసిన అయాచిత ఉపదేశాన్ని సైతం కాదన్నాడు.

"సరి నీ యిష్టం," అని ఆ దేవుడు మాయమైపోయి ఆ రాజు నగరంపై, రాజ్యంపై ఏడు ఘడియలకాలం రత్నాలవాన కురిపించాడు. ఇళ్ళ ముందు, వెనక, పైన వీధుల్లో ఎక్కడ చూసినా రతనాలేరతనాలు! ఇంకేం ప్రజలందరూ వాటిని రాసులుపోసి ఎత్తి గాదెలు గరిసెలు నింపుకున్నారు. ఎటుచూసినా వారి వదనాల్లో ఆనందం వెల్లివిరుస్తున్నది.

రాజుకు పరమానందమైంది రాజు తపశ్శక్తి వల్లనే దైవం కరుణించి ఆ రత్నాలవర్షం కురుపించినట్లు జనానికి తెల్సిఉండొచ్చుననుకున్నారు. అయితే ఆ వానకు రాజుగారి కోట సింహద్వారం ఒక మూలవిరిగి పడింది.

పర్వాలేదు పాతగోడేకదా అనుకున్నాడు రాజు. ఈ వర్షంవల్ల ఎంతో ప్రజోపయోగం జరిగింది తనకు ఆ మాత్రం నష్టం జరిగితేనేం, అయినా అదెంత పాటిది. రేపీపాటికి పూర్వపు దానికంటే అందంగా మరో సరికొత్త ద్వార గోపురనిర్మాణం కావించుకోగలడు.

భటుల్ని పిలిచి సుతారివాళ్ళ పిలువ నంపాడు.

భటులు వినయంగా తిరిగివచ్చి రామన్నారన్నారు.

"మేము ఆజ్ఞాపించినట్లు చెప్పితిరా?"

"చిత్తం!"

"అయినా వినలేదా ?"

"చిత్తం,"

"రెట్టింపు కూలీ ఇస్తామని చెప్పక పోయితిరా ?"

"అన్నాం ప్రభూ !"

"మరి ?"

"మేము అంతకు నాలుగంతలు కూలీ ఇస్తాం. మీ రాజుగారిని వచ్చి మా యిండ్లకప్పుపని పూర్తిచేసి పొమ్మనండి, అన్నారు ప్రభూ."

అసలు రహస్యం అర్థమయింది రాజుగారికి. తాను నరపాలుడనే కాదు నరపతిననీ గుర్తుకు తెచ్చుకున్నాడు. ధనం మనుషులకు ఎంతటి ధైర్యాన్ని, దర్పాన్ని కలిగిస్తుందో తెల్సుకున్నాడు. దారిద్ర్యం లేకపోతే ఈ బడుద్దాయి జనం తన మాట వినరని గ్రహించుకున్నాడు. పనులు చేసేవాళ్ళే లేకపోతే తనకూ, తనవంటి ధనవంతులకూ పనులు చేసుకోలేక, పడుతున్నచోటికి భోజనాలు సమకూర్చుకోలేక ఎంత ఇబ్బంది కలుగుతుందో పసాయించుకున్నాడు. ఎంత తప్పు తాను చేసింది. దైవం బుద్ధిమాట చెపితే కాదని బుద్ధిహీనుడై అతనిమాట వినలేదు.

'అన్నన్నా దేవుడూ! నువ్వన్న మాట నిజం. నేనన్నది అనుకున్నది నేరం. నా కళ్ళు తెరపించారు. బుద్ధిగడ్డితిని మీరు హితము చెప్పినా వినకుండా కానికోరిక కోరాను. నన్ను మన్నించు. లేకపోతే నేనూ నావాళ్ళూ మావంటివాళ్ళందరూ గడ్డిమేయవల్సి వస్తుంది. నా దేశప్రజలను ఎప్పటి వలె మార్చెయ్యి' అని మొరపెట్టుకున్నాడు.

దేవుడు తాను చెప్పినజోస్యం ఫలించినందుకు, తన అంశసంభవుడైన రాజుకు జ్ఞానోదయం కలిగినందుకు సంతసించాడు. ఆ రత్నాల రాళ్ళు అన్నింటినీ గులకరాళ్ళుగా మార్చేశాడు. జనం మొత్తుకుంటూ వాటినెత్తి బయట పారబోశారు. అంతవరకిచ్చే కూలీలో సగమిచ్చినా పనులు చేస్తామంటూ బయల్దేరారు.

ఆశ్రిత ఐశ్వర్యజన పక్షపాతి పరమాత్ముడు! కనుక, పెద్దా చిన్నా తారతమ్యాలుంటేనే ఈ లోకం నడుస్తుందంటారు.

ఆ కథ జ్ఞాపకంతో నవ్వు వచ్చింది రాజుకు.

అల్లంత దూరాన గుడిసె కన్పిస్తున్నది. మామిడిచెట్ల క్రిందుగా ఎండుటాకులమీదుగా నడిచివస్తున్నాడు. అక్కడక్కడ పిచ్చిగా పెరిగిన అడవి మొక్కల పూలు వాటి వాసనలు తమవంటి పేదబతుకులను స్మరింపజేస్తున్నవి.

అతడు గుడిసెను సమీపించేసరికి ఏడుస్తూ కూర్చుంది తల్లి—
"దేవునికని మొక్కిన పుంజు నాయినో నాయినా
బిడ్డ కొయ్యిమన్నా కొయ్యలేదుర నాయినో నాయినా
కొడుకచ్చినంక కోసుకుందామన్న నా ॥ నా ॥

కొడుకియాళ్ళే పుంజు మంచిగుందన్నాడు నా ॥ నా ॥
ఎంతల ఎంత పనాయె
నా యెంత పాపపు చేతులాయె
నా పొలగాళ్లకు తిన బెట్టుకోకపోతి."

"ఏమిచే అమ్మా యేడుస్తున్నవ్" రాజడిగాడు.

"నేనేం జెప్పుదు కొడుకో నా కొడుకో"

"ఊర్కో, యేమైంది?"

"ఎంతల మాయమాయె కుంపటంతపుంజు కొడుకో నాకొడుకో!"

"పోతేపోయిందిలే పిల్లి పట్టిందా, కుక్కా?"

పిల్లోకుక్కో పడితే నే నెందుకేడ్తు కొడుకో నా కొడుకో."

"ఊకుండు మంచె యేందే నీ లెల్లెపాట" కసురుకున్నాడు వెంకన్న.

"దొరోని కన్నువడ్డదిరో నా కొడుకా. నా పిల్లల నోటికాడి బుక్కెత్తుకు పోయిండ్రురో కొడుకా." రాజు ఆలోచన పాలైనాడు.

"మల్లెవ్వలైనా యినగల్రు. నువ్వు నోరుమూసుకోయే, పోయింది పోనేపోయెగని, మల్లా యిదోటి లేనిపీడ."

"యించె యిననియ్యి. యింకేం జేత్తరు నాయ్యో నాయ్యా. ఆల్ల కండ్లముందట ప్యాదోడు బతుకద్దు నాయినో నాయినా."

"ఊకుంటవా రెండెయ్యాన్నా మల్లా."

"ఏమైందయ్యా?"

"ఏం లేదురా. దొరమనిసి పట్నం బోతన్నడట. కొడుక్కు టిఫిని పంపుత్తరట. మన కోడిపుంజును దొర చూసిండట. మంచిగుంది పట్టుకరా పోండిరా అని పనిమనుసుల తోలిండు."

"వద్దనద్దా మీరు?"

"దొర జెప్పినంక ఆ మనుసులింటారు కొడుకో నాకొడుకా. అంబోతు లోలై రంకెలేసుకుంటచ్చిరి కొడుకో నాకొడుకా." తల్లి ఏడుస్తూనేఅంది.

"ఆల్ల నీడనపడి బతుక్కుంట ఆరిని కాదంటే బతుకుతం బిడ్డా?" అన్నాడు తండ్రి.

"ఎందుకే వీళ్లిట్లా?" అన్నాడు రాజు.

"అల్లకు సాగుతున్నది కొడుకా" నిట్టూర్చాడు వెంకన్న.
"ఎన్నాళ్ళిట్టా?" తనలో తాననుకున్నట్లన్నాడు.
"ఆ మీదోనికి దయపుట్టేదాకరా."
"కాదే ఆ మీదోనికి కాదు, ఈ కిందోనికి తెలివిపచ్చేదాక" అన్నాడు రాజు తండ్రిమాటకు సవరణగా.

# 9

స్టీల్‌ది టిఫిన్ క్యారియర్ పట్టుకొని మల్లి గునగున గుడిసెలోపలికి ఉరికి వచ్చింది.
"ఏందే ఏమొచ్చె. ఏమొ గద్దమిడుతోలే్న ఉరికత్తివి" దుర్గమ్మ విసుగ్గా అంది.
"ఇదుగో" చేతుల్లో దొంతుల గిన్నెను చూపింది మల్లమ్మ.
"ఎక్కడిది యాన్నన్న ఎత్తుకత్తివా?" తల్లి ప్రశ్న.
"ఛ!" అంది కూతురు కాదన్నట్లు.
"దొరికిందా?"
"అంత బాగెంవా మనకు."
"ఎక్కడిదే?"
"సిందొరసా నిచ్చింది."
"ఇదెందుకిచ్చె?"
"దీన్లె టిపినుంది. నువ్వూ మీ అన్నా తినుండి అన్నదే" అని ఆ పిల్లే తిరిగి ఇలా అడిగింది.
"ఓవ్వా! నూ తనే ఇండ్ల యేముందో?" తల్లి ఏ జవాబు ఇవ్వక ముందే గిన్నెమూత లేసింది. పెద్దవాళ్ళ ముఖకవళికలబట్టి మెదలటం పిల్లల కలవాటే. వాళ్ళు ఏమనరని భావించినప్పుడు వీళ్ళు ఏమైనా చేస్తారు.
రెండు గిన్నెల్లో ఒక దాని నిండుగా పూరీలున్నవి. ఒక గిన్నెలో ఎర్రగా వేపిన కోడిమాంసపు ముక్కలున్నవి.

"కమ్మగ ఆసన త్తందే. ఎంత మంచి మసాలేసండిగ్రో!"

"ఆల్లకేందే దొరలు."

"అవ్వా! నేనొక్క పూరి తింటనే."

ఆ ముక్కలు చూసేసరికి కోడిపుంజు కండ్లముందు మెదిలింది దుర్గమ్మకు. కన్నుల్లో నీరు నిలిచింది.

"మాంసం చిప్పలు కమ్మగున్నయే. ఒత్తితె నూనెల్లుతుంది" పూరీకి అనుమతి తీసుకొని కూరముక్కలు కూడా తీసుకుంది. రెండు ముక్కలు తిని మూడోది చేతిలో పట్టుకుంది.

"అన్నకు ఉండనియ్యే, అన్ని తినెటట్లు గున్నవ్ నువ్వు."

"నేనేం తిన, నాకు సాలు. నువ్వు ఒక్క వక్కటి తినే. ఎంత కమ్మగుందో సూడు."

"అద్దు. అయ్యకుండనియ్యి. మాంసమంటె సత్తడు ముసలోడు."

"ఆల్లకు ఉన్నదే, నువ్విది తిను."

"నాకెందుకు, అద్దుబిడ్డా."

"ఓవ్వా! నీ బాంచెను. తినే, తినకుంటే నామీద ఒట్టు. నన్ను పోడగొట్టుకున్నట్టె."

"ఎంత శెంకిని ముండవే. గుద్దేలుగు పట్టుగదనే నీది" అంది దుర్గమ్మ. తల్లి నవ్వు చూసి ఆ ముక్కనామె నోటిన బెట్టింది మల్లమ్మ.

"ఎంత మంచిగుందే," బిడ్డంది.

"ఆల్లకేందె ఉన్న మారాజులు. అన్నితీర్ల కమ్మగ చేసుకతింటరు. సుకపడ్తరు."

"ఇంకొక్కటి తినే ఓవ్వా."

"అద్దుబిడ్డా ఆల్లకుండనియ్యి." నిజంగానే వారించింది దుర్గమ్మ.

"చిన్న దొరసాని మంచిదే." బిడ్డ మాట నిజమే అనిపించింది దుర్గమ్మకు. దయగల తల్లి ఇంత పంపింది. కోడిపోయినా తన కొడుకు, బిడ్డా ఇంత తిన్న తృప్తి దక్కింది. తాను ఇట్లా వండేదా? ఏదో ఉప్పు కారమేసి ఉడికించేది. ఎల్లిగడ్డ ధనియాల పొడివేస్తే అదే ఘనమాయె. కొంది గంపెడు తినేకంటే అయింది కంకెడు చాలు, అనుకుంది.

వాకిట్లోకి అన్నరావటం చూసి లేచి ఎదురుగా పరుగెత్తు కెళ్ళింది

మల్లమ్మ.

"రా అన్నా-ఇట్లా కూకో మంచంమీన. నీకు మంచి టిఫిని పెడుత."

నవ్వొస్తున్నది రాజుకు చెల్లెలి మాట వింటుంటే.

"ఎక్కడిది మీ వదిన పెట్టిందా?" మేనవదిన రాజమ్మ విషయంగా అన్నాడు.

"వదినా?" అంటూ నిలబడింది లోపలికెళ్ళి పట్టుకొచ్చిన మల్లమ్మ.

"ఎక్కడివే?" ఆ పాత్రలు చూస్తూ అన్నాడు రాజు.

"సిందొరసాని...."

"ఓహో" ఏదో అర్థమైనట్టయిందతనికి.

"తిను."

"ఎవరు తెచ్చింది దీన్ని?"

"నేనే."

"ఎందుకు తెచ్చావ్?"

"ఆమే ఇచ్చింది."

"తీసుకెళ్ళి ఇచ్చిరా-"

"తిన్నం గదా ఇంత-"

"ఊ, మళ్ళీ ఎప్పుడిట్లాంటి పనులు చెయ్యకు-"

"తినవా?"

"నాకు వద్దు-"

"తినన్నా!"

"నువ్వవి లోపలికి తీసుకెళ్ళు," కోపంగా అని అతడు లేచి తోట వైపు నడిచాడు.

కన్నీటితో గిన్నెలు తీసుకొని లోపలికెళ్ళింది మల్లమ్మ, తల్లి ఈ మాటలన్నీ వింటూనే ఉంది. కాని ఆమెకు విషయమేమీ బోధపడలేదు. కొడుకు కోపానికి కారణమేమిటో తెలియలేదు.

రాజుకు మనసంతా బాధగా ఉంది. ఆ వంటకాన్ని తీసుకెళ్ళి సునంద ముందు విసిరిపడెయ్యాలని పించింది. ఇంట్లోవాళ్ళు ఆ పదార్థాన్నే ఆశగా తినటం బాగా అనిపించలేదు. వాళ్ళేం చేస్తారు. అపురూపంగా దొరికే పదార్థాలు. ఓ తీరుగా చూస్తే వాళ్ళకు దొరకనివవి. దొరలింట ఏపైనా శుభ

కార్యానికి పనిపాటల వెట్టి గొట్టం వాళ్ళకు తిండిబెట్టినా ఆ వంటలు వేరు. దొరలు తినే వంటలు వేరు. ఇంకా ఓ గొర్రెపోతు, నాలుగైదు కుంచాల బియ్యం ఇతర సామాను ఇస్తే వీళ్ళే వంట చేసుకుని సామూహిక భోజనాలు చేస్తుంటారు కూడా.

సాధారణంగా పెళ్ళికో, శ్రాద్ధానికో వారం పదిరోజులు వెట్టిచాకిరీ, చేయించుకుని నూరో యాభయో రూపాయలు ఇస్తారు పెద్దింటివాళ్ళు. అది ఈ దరిద్రులకు ఓపూట తాగుడువిందుకు అయిపోతుంది. అన్నాళ్ళ శ్రమను ఆ పూటకు మరచి తమ ఆ అదృష్టానికి మురిసి దొరల మంచితనాన్ని నెమరు వేసుకుంటుంటారు వీళ్ళు.

ఈ దొరకూతురు తాముతినే రుచికల వంటకాలను తమకని పంపింది తమకంటే నిజానికి తనకే! తన నాకట్టుకోవటానికి ఇదో మార్గం. అందుకు ముందుగా తన వాళ్ళను మంచిచేసుకోవచ్చునని ఈ నాటకం ఆడొచ్చు.

ఇంతకూ ఆ కోడి తమదే. దోచుకుపోయిన కోడి. ఆ లెక్కన చూస్తే ఏది కాదు తమది. శ్రమ తమది. పంటలు తీసేది తాము, అనుభవిస్తున్నది వాళ్ళు.

భూమి వాళ్ళది కదా అంటే, ఎవడిది యీ భూమి? ఈ భూమి కూడా ఒకడి సొత్తా? ఇది యీ నేలపై జన్మించిన వారికందరికీ చెందేది, చెందాలి!

భూమి దున్నే వానిది కావాలి.

భుక్తి పనిచేసే వానిది కావాలి.

కాని, అదే జరుగుతూ లేదే. శ్రామికులు పస్తులుంటే పనిదొంగలు మస్తుగా తింటూ సుఖపడుతున్నారు? ఎందుకిలా? ఎవరో పాడిన పాట. జ్ఞాపకానికి వచ్చింది.

నేల మనది గాలి మనదీ
నీరు మనదీ నింగి మనదీ
దొరా యెవడురో వొరా
జులుం యేందిరో, ఎన్నాళ్ళిలా?

ఈ సునంద పట్టెడు కూటితో తనవాళ్ళ అభిమానాన్ని చూరగొంది. తమ వాళ్ళ చెమటలు కారగా కష్టించి పుట్ల ధాన్యం పండించి ధారవోసినా

పైవాళ్ళ అభిమానాన్ని పొందలేక పోతున్నారు.

వాళ్ళది ఏనుగుల జన్మ. ఎంతమేసినా గాంభీర్యాన్ని వదలుకోరు. తమ వాళ్ళది కుక్కల జన్మ. పట్టెడు కూడు పడేస్తే వారికాళ్ళ కడ విశ్వాసంగా పడిఉంటారు.

సునంద చేసిందదే, "నేను శునకాన్ని మాత్రం కాకూడదు." అనుకుంటూ రాజు ముందుకు కదిలాడు.

# 10

ఎవరో పంపినట్లు సునందే ఎదురయింది.

"హల్లో రాజూ !"

"ఓహో ! చిన్న దొరసానిగారా ?"

"ఏమిటామాట ?"

"ఉన్నదే !"

"అట్లా అంటే నాకు బాగుండదు."

"ఉంటే ఏంలేదు కాని, అంటేనే బాగుండదా ?"

"ఉన్న పొరపాట్లను తొలగించుకోవాలి కాని, వాటిని తలచుకుంటూ ఇంకా విభేదాలను పెంచుకుంటే మంచిదా ?"

"ఎలా తొలగించమంటారు. మీరు కూలీపని చేయగలరా ? నేను దొరతనం చలాయించగలనా ?"

"నేను కూలీని కాకపోయినా మీరు దొర కాగలరు."

"అవును కాగలను మీ దృష్టి ప్రకారం. నిజమే, కాని ఈ శ్రామికులు ?"

"ఏమిటి శ్రామికులు?"

"పనులు చేస్తూ బాధలు పడుతూ ఉండవల్సిందేనా ?"

"ఇదిమరీ బాగుంది. పనులు చేయంది తిండెలా వస్తుంది?"

"మీకో మరి ?"

"ఎవరికోసం వాళ్ళం ఏదో ఒక పని చేస్తూనే ఉన్నాం. కానయితే

ధనవంతుల పిల్లలకు వాళ్ళ పెద్దవాళ్ళు కొంత సంపాదించి ఉంచారను కోండి."

"శ్రమచేసి?"

"మీ పరిభాషలో శారీరకశ్రమే తప్ప మానసికశ్రమ శ్రమ కాదులా వుంది."

"శ్రమకు నిర్వచనం తెలుసుకోలేని వాన్నికాదు నేను సునంద గారూ. ఏది వస్తూత్పాదనకు పనికివస్తుందో అది శ్రమ."

"మావాళ్ళ శ్రమ వస్తూత్పాదనకు పనికివస్తూ లేదా ?"

"లేదు. వస్తూత్పాదన కావించే పనివాళ్ళ శ్రమశక్తిని దోచుకోవటా నికి దాచుకోవటానికి ఉపకరిస్తున్నది."

"ఏమో బాబూ ! నాకదంతా తెలువదు. పెద్దవాడేకాదు పేదవాడూ దోపిడీ చేస్తూనే ఉన్నాడు ఆలోచిస్తే "

"పెద్దవాన్ని ?"

"పేదవాన్నే కావచ్చును. ఒక మనిషి మరో మనిషిని దోపిడీ చేస్తూనే బతుకుతున్నారు. పిల్ల తల్లిని, భర్త భార్యని."

"అది సహకారమా? దోపిడా ?"

"హృదయ విశాలత ఉంటే అది, లేకపోతే ఇది."

"కుటుంబ వ్యవహారాలను సాంఘిక సమస్యలతో ముడిపెడు తున్నారా ?"

"అన్నీ ఒకటేనండీ. అనుకోవటంలో తేడాతప్ప సహజీవనంలో ఈ అవస్థలు తప్పవు."

"సాంఘిక దోపిడీని మీరు సహజీవనంగా సమర్థించుతున్నారా ?"

"సహజీవనం ఉందికాబట్టే ఏదైనా సాగుతున్నవి. విడివిడిగా మానవులు అడవుల్లో జీవిస్తే ఈ అవస్థలు, ఆలోచనలు ఉండేవి కావేమో! ఆటవికులంకాక నాగరిక జీవితాలకు అలవాటుపడటంతోనే మనకీ బాధలన్నీ సంప్రాప్తమైనవి" అన్నది సునంద.

"సామాజిక అవస్థలకు ఈ ఆర్థిక అసమానతలు కారణం. కాని, దానికీ నాగరిక జీవితాన్ని హేతువుగా చూపి ఆటవికులంగానే ఉండిపోతే బాగుండేదనుకోవటం భావ్యంకాదు. దోపిడీ విధానాన్ని సంఘ సహజీవన

సూత్రంగా భావించడమూ సరికాదు."

"దోచేవాడికి తాను దోస్తున్నాననికాని, దోపిడీ పాలవుతున్నవాడికి తాను దోచబడుతున్నాననికానీ తెలుస్తూలేదు. వాళ్ళ సాంఘిక కట్టుబాటుల్లో వాళ్ళు మెదలుతున్నారు. వాళ్ళ స్థితిగతులకు రంగులుపూసి చూపుతూ ప్రచారం కావిస్తున్నది మీరు."

"దోచేవానికి తెలుసు, దోచబడేవానికీ తెలుసు తమ పరిస్థితులు. వాడు ఆశకోసం దోస్తున్నాడు. వీడు ఆకలి కోసం దోచబడుతున్నాడు. ఇద్దరి పరిస్థితులు ఒక్కటికావు."

"కావు, వాళ్ళలా జీవిస్తున్నప్పుడు మీకెందుకంటీ బాధ?"

"అది మీకర్థంకాదు. మీది పైవర్గం. నాది క్రింది వర్గం. మన యిద్దరి మానసిక స్థితిగతులు ఒకేరీతిగా ఎలా ఉంటాయి?"

"వర్గ విభేదాలు సృష్టించుకుని మిమ్మల్ని మీరే కించపరచుకుంటు న్నారు."

"ఉన్న వాస్తవాన్నే చెప్తున్నా. పరిస్థితులే వంచించుతుండగా నేను వేరే కించపరచుకునేదేమీలేదు."

"పరిస్థితులు ఎప్పటికీ ఒకేలా ఉండవండి. ఇప్పుడున్న విధంగా పూర్వంలో లేవు. ఇకముందూ ఇట్లాగే ఉండవు. కాలప్రభావాన్నిబట్టి సాంఘిక ధర్మాలూ మారుతుంటాయి."

"కాల ధర్మాలంటే ?"

"అంతటి సూక్ష్మపరిశీలన నాసుంచికాదు."

"అంతేలే, కడుపులోని చల్ల కదలకుండా జీవించగలుగుతున్న ప్పుడు కఠోరసత్యాల గూర్చిన ఆలోచనలు, ఆవేదనలు ఎందుకుంటాయి లెండి. కాలధర్మం ? అణగారినవారు పెత్తందారీతనానికి ఎదురు తిరిగిన కొద్దీ విధిలేక మారుతున్నదీ కాలధర్మం !"

"ప్రపంచ పరిజ్ఞానంవల్ల యాంత్రిక పురోగతివల్ల మారుటాలేదా అది ?"

"అదంతా దీనికి ప్రక్కతోడ్పాటు మాత్రమే. నిజమైన రాపిణముల్లా కష్టజీవికి జ్ఞానోదయం కాకపోవటం. తన దీనస్థితి మార్పునకు ప్రయ త్నించక పోవటం."

"సరే అందుకు ప్రయత్నించేవాళ్ళు ప్రయత్నించనీండి, మనకెందుకు బాధ చెప్పండి. ఆ విషయం పోనీండి. ఈ వేసవి సెలవులు మొత్తం ఇక్కడే గడుపుతారా ?"

"ఎందుకా విషయం ?"

"పట్నం వెళుతున్నారేమోనని."

"ఇంకా యేదీ నిర్ణయించుకోలేదు."

"పట్నంవెళ్తే మాత్రం చెప్పిపొండి."

"పనేమైనా ఉందా ?"

"ఇలా సాయంత్రాలో రావటం మానుకుంటానని."

"రాకండి. ఇప్పుడు నేనేం రమ్మనలేదే."

"ఇప్పుడుకాదు. మీరు బస్తీకివెళ్తే నేను వృథాగా వచ్చి బాధపడవలసొస్తుంది కదాని."

"ఓ ! అదా విషయం."

"ఊ. రాజూ ! ఎం.ఏ. చేద్దామని ఉందా ?"

"ఈ రిజల్ట్సురానీ."

"ఫెయిలవుతానని భయంగా ఉందా ?"

"లేదు."

"మరింకేం ? ఇద్దరం ఒకే సబ్జెక్టు తీసుకుని పోస్టు గ్రాజుయేషన్ పూర్తిచేద్దాం. రెండేండ్లు చాల హాపీగా గడిచిపోతుంది."

"బాగానే ఉంటుంది కాని, సునందగారూ ! నా పరిస్థితి ఇంకా నేను చదివే రీతిలో లేదు"

"స్కాలర్‌షిప్ వస్తుందికదా. అంతెందుకు మీ ఖర్చు నేను భరిస్తాను."

"మీ ఉదారతను స్వీకరించే హృదయ విశాలత నాకులేదు."

"సంకుచిత మనస్తత్వం."

"మీరింకేమని నిందించినా భరిస్తాను."

"మీ పట్టుదల మీదేనా రాజూ !"

"ఏ విషయంలో ?"

"మన పెళ్ళి విషయంలో."

"మళ్ళీ యెప్పుడు కూడా అమాట అనకండి అమ్మాయిగారూ. పిల్లికి చెరలాడటం ఎలుకకు ప్రాణసంకటమట. పెద్దోళ్ళ ప్రణయాలు పేదలపాలిటి ప్రళయాలు. మమ్మల్నిలా బ్రతకనీండి."

"అంటే?"

"ఆడవారి బ్రతుకు అరటాకు. మగాడు ముల్లు. ఎటు కదిలినా అర టాక్కే ప్రమాదం అంటారు కదూ!"

"అవును నిజం."

"కాని, ధనవంతుల విషయంలో ఆ మాట సరికాదు. ఆడవాళ్ళు కానీ మగవాళ్ళుకానీ డబ్బున్నవాళ్ళు ముళ్ళు, పేదలు ఆకులు. మీతో ఎట్లా మెదిలినా ప్రమాదం మాకే."

"రాజూ!"

"ఈమాట మళ్ళీ ఎప్పుడూ అనకండి.మీకునాకూ ఎక్కడా సాపత్యం లేదు. మనమధ్య ప్రేమ-పెళ్ళి అనేవి కుదరని పదాలు. మళ్ళీ ఎప్పుడు కానీ నన్ను కలిసే ప్రయత్నం చేయకండి."

"ఉత్త మొండిఘటం."

"ఇప్పటికైనా సత్యాన్ని తెల్సుకున్నందుకు సంతోషం."

"పరహింస మహాపాపం."

"అందుకే ఆత్మహింసను అనుభవిస్తున్న అదృష్టవంతుణ్ని."ఆమె మాటను ఇక వినకుండా చరచర నడిచి దూరంగా వెళ్ళాడు.

# 11

"తక్కెడికి ఓ రూపాయి ఎక్కువి త్తడటనే ఓవ్వా! పల్లికాయె అమ్మతవానే... కైలాసం సావుకారచ్చిండు" మల్లమ్మ తల్లి నడిగింది.

"యాపాటుందే? మీరేతింటరు కాదే. అనకాలం మునుదు వెడు తొంటె యేమన్న తినబుద్దయిందని మీరే అడుగుతరుకాదే?"

"మక్క ప్యాలాలేంచుకుందారి."

"అయ్య నముల్తాదే ప్యాలాలు?"

"మరి నూనె లేదంటివి, పసువాడిసిందంటివి, పప్పు కొనుక్కొత్త వంటివికాదే అన్న తొక్కతోని ఎట్ల తింటడని "

"తక్కెడంత ఇత్తాం రమ్మను"

"ఓ కైలాసం సవ్కారీ,,, ఇగో మా అవ్వ పల్లికాయె ఇత్తదట రమ్మంటుంది," కేకేసి పిలిసింది మల్లమ్మ. చంకలో తరాజుభుజాన జనుప సంచీ వేసుకొని అడ్డతోవగా వెళ్తున్న శెట్టి అక్కడే ఆగాడు ఈ మాటవిని. మల్లమ్మ అటుగా పరుగెత్తి మళ్ళీ రమ్మని పిలిచేసరికి ఇటుగా వచ్చిండు.

నులకమంచం మీద కూర్చోటానికి సైతం తటపటాయించి తన సంచినే నేలపైవేసి దానిమీదకూర్చున్నాడు. త్రాసుకున్న దారాలూ జనుపవే. నూలువైతే ముట్టడు. జనుము, గోంగడి, పట్టు వీటికైతే అంటూ.ముట్టు ఉండవు. అస్పృశ్యతా నిర్మూలనా శాసనం ప్రభుత్వం అమలు పరచినా సమాజంలో అది అంతగా అమలు జరుగుతూలేదు. విధిలేని తెలిసిరాని పరిస్థితులలోనే దాన్ని పాటించటం జరిగింది.

సరిగ్గా అతడు కాయజోకుతున్న సమయంలో రాజు చేరవచ్చి మంచంమీద కూర్చున్నాడు.

"కింద కూచున్నారేమండీ శెట్టిగారు. రండి. మంచంమీద కూచోండి" అని పిలిచాడు రాజు.

"ఆ ఎందుకులే,,, అయిపాయె. ఎంతసేపు,,,"అని తప్పించుకున్నాడాయన.

"తరాజు సిబ్బలతాళ్ళు ఒకటి అంత పొడుగ్గా ఇంకొకటి అంత పొట్టిగా వున్నావేమయ్యా?" రాజన్నాడు.

"తెగిపోయినయ్. మల్లా తాళ్లు కట్టననుకుంటనే వున్న. మంచి తాళ్లు దొరుకుత లేవు."

"గవర్నమెంట్ వాళ్లు ముద్రవేసిన ఇనపత్రాసు వాడాలికదా మీరు?"

"మావు ది, కొనంది ఇడిసి పెడుతున్నారు. అది తెత్తామంటె బరువు, మల్లా ఈ కాయదాన్లె యేంబట్టుద్ది. యెంతుంటయ్ దాని మూతుళ్లు నేరెడంత."

దుర్గమ్మ జోకుకు మిగిలినకాయ కుండలో ఎత్తుకుంటున్నది. పేదిళ్ళలో వంటకు నీళ్ళకేకాక ధాన్యాల నిలువలకూ కుండలే దిక్కు.

జోకిన కాయను తన సంచిలో పోసుకోబోతున్న శెట్టితో "ఏదీ ఒక్కసారి తక్కెడ మళ్ళీ ఎత్తు" అన్నాడు రాజు.

"మీ అమ్మ ముందటనే జోకితి. గిండ్ల అబద్దముంటాది? ఏ పాటి పెద్ద వ్యారమని, వేయిలా-నూరా-అంతా మూడు ముడికాన్ల ముచ్చట. అవునే దుర్గా నేనెప్పుడన్నా కిందిమీది లెక్కలు జేసిన్నా.."

"ఈ., నువ్వు గసోంటోనివి కావు. నీదగ్గెర లేదయ్యా ఆ గుణం. నల్ల మొకపోడు ఆ పొట్టి బొర్ర సావుకారిగాడత్తైతే, ఆనిమీద మన్ను బొయ్య, తియ్యగ అల్లం బెల్లంమాటలతోని తక్కెడికి సపసేరన్నా యెక్కువ జోకుతడు. పెద్దబోకెనోల మూడరుసోళ్ళది దెచ్చి ఇంక ఒత్తు కుంట కొలడు."

"ఎలకాలం బతుకచ్చినాం. నాలుగు రోజులు బతికి పొయ్యేటోళ్ళం, నియ్యతిగ మెదిలితేనే బర్కతుంటది. నరుడు మెచ్చుతడు నారాయణమూర్తి మెచ్చుతడు."

నీతిప్రసంగం ముగించి తన పని పూర్తిజేసుకోపోతున్నాడాయన.

"ఆగు" మని రాజుఅన్నా వినకుండా కాయను సంచిలో పోయబోతున్నాడు. త్వరగా ఆ సంచిని రాజు దూరం లాగాడు. కొన్నికాయలు అందులో పడనే పడినై.

"ఇక జోకు."

"ఏమో దొంగను జేసినట్టుగ చేత్తున్నవేమన్నా?"

"దొరవే. దొంగవని యెవరనిరి,..రాస్తచూడసేప్పు."

"ఆ! ఇట్లయితే ఇగ బతికినట్టె అవి తరాజులేపి." "ఇగోసూడు ఏమయె? సరిగా ఉంవాలేదా! నేనట్ల జేసెటోన్ని కాదంటే యినవ్."

"దండె యెటు పోతున్నది?" రాజడిగాడు.

"సిబ్బులు చూడు."

"దండాన్నా సిబ్బులాన్నా చూడవల్సింది శెట్టిగారూ?"

"కాటా తరాజయితే మీకు అనుమానం ఉండకపోయేది."

"తర్వాత ఇంటికి వెళ్ళి దాంతో జోకుకుందువు కాని, ఇప్పుడు ఆ దండం సరిగా ఉండేటట్లుగా కాయలు తీసెయ్యి."

గునుస్తూ అతడు రెండు మూడు పిడికిళ్ల (వేరుశెనగ) కాయలుతీసి తూచాడు.

"ఊ,,.ఇప్పుడు బాటు ఇటువేసి కాయ అటు పొయ్యి" త్రాసుల్లో ఒకవైపు ఎక్కువ ఒకవైపు తక్కువ బరువు వుంచుతారు. అమ్మేటప్పుడు బరువుభాగాన్ని వస్తువువైపు. కొనేటప్పుడు తూకంరాళ్ళవైపు వుంచుతారు.

"నా తరాజుల పొసంగం లేదయ్యా!"

"చూడనివ్వు."

రాజు త్రాసును తీసుకుని దండెమధ్య దారం చేతపట్టి లేపాడు. తేడా ఉంది. అట్లా దోసెడు కాయలు తీయవల్సి వచ్చింది.

తూకం రాళ్లు ఇనుపవే. గుట్టరాళ్ళ మోసం కాకపోయినా ఈ అచ్చు తూకాలలోనూ తేడాలుంటాయి. తూనికలు కొలతల తనిఖీ సిబ్బంది వచ్చి సరియైనవి గుర్తించి పోతూనే ఉంటారు. మళ్ళీ వీళ్లు మామూలుగా మారుస్తూనే ఉంటారు. వాళ్ళకు లంచాలిచ్చి తప్పుడు తూనికలనూ చలామణిలో ఉంచుతారు.

"మీరు కొన్నది ఎంతనయ్యా ఇక్కడ?"

"మణుగు." కోపంతో అన్నాడు శెట్టి.

"అంతకోప మెందుకు ?"

"మరేంది, ఏమో అమీన్‌సాబ్ కంటే యెక్కువ జేత్తున్నవ్. అంతా తక్కెడు బాగోతానికి ఇంతకత."

"ఈ తూకం బాటు తక్కెడా ?"

"అట్లనే కొంటున్నం."

"తక్కెడికి ఎన్ని కిలోలు ?"

"మావోలె నువ్వు తిరిగి బ్యారెం జేత్తే తెలిసేది."

"బాటెంతో తెల్సుకోవటానికి బేరంచేయవల్సిన అవసరంఉండదు. మోసం చెయ్యటానికి మాత్రం బేరం చెయ్యడం నేర్చుకోవాలె!" "ఎవలు ? ఎవల్ చేసిన్రు మోసం?"

"కొన్నరకు బదులు రెండు కిలోలు వేయటం మోసం కాదూ"? శెట్టి యేదో అనబోతున్నాడు. అంతలోకే దుర్గమ్మ అందుకుంది.

"ఓరి నీ బ్యారెం మీద మన్నుబొయ్య. తక్కెడు కాయకు మంది కంటే రూపాయి యెక్కువి తననన్న దిందుకా?రూపాయి ఆసె జూపి అరకిల యెక్కువ జోక్కని ముంచుతన్నావ్, ఏం మంచయిద్ది యిట్ల జేత్తె నీకు?"

"ఇంతవరకు నీతులెన్నో చెప్పివి కదనయ్యా షాపుకారీ. ఒక్క తక్కెడు బేరానికి తాళ్ళలోకొంత, దండెలో కొంత, బాటులోకొంత, ధరలో కొంత ఇంతదోపిడీ ఉండొచ్చునా ?" రాజడిగాడు.

"అంతే పోవయ్యా, మీ సరుకు మీరు తీసుకొని నా దారిన నన్ను పోనియ్యండి."

"పో. ఎవరుండుమన్నరు నిన్ను. నీ త్రాసు వాటు రేటు – రేపు గ్రామపంచాయితీ కొచ్చి తీసుకెళ్ళు"

"ఓ, ఈ బెదిరింపులకు నేనేం బెదుర. పట్నంల చదివిరాంగనే పెద్దమనిషినని బెదిరిస్తున్నవేమో. నీ అటువంటోళ్ళ మస్తుగా జూసినం. పోవయ్యా."

"ఏం కాదు కదా. ఇంకేం వెళ్ళు. సర్పంచ్‌కు, పోలీస్ పటేల్‌కు రిపోర్టిచ్చి పైకి పంపితే ఆ వచ్చేవాడు వచ్చి అడిగేది అడిగినప్పుడే అయిందేదో అయిందని తెల్సుకో."

"ఇదెక్కడి మాదిగ పీడరా దేవుడా."

"ఏయ్ మనిషీ ! ఏం మాట్లాడుతున్నవ్? సాటిమనిషిని కులం పేర దించేయటం మూర్ఖత్వం! మనిషి విలువకు కులం కాదు గుణం ప్రధానమని తెల్సుకో! ఈ కులవిభేదాలు కుళ్లబోతులు కల్పించినవి. నువ్విప్పుడు కులం పేర నిందించినావంటే ప్రభుత్వం ఎంత శిక్ష వేస్తుందో తెలుసా?"

"అయ్యా నీకు దండం బెడుతా. నాకవ్వన్నీ యేవీ తెలువదు. ఏదో బ్యారెం చేసుక బతికేటోన్ని. నన్ను పోనియ్యి. బుద్ధిగడ్డిదిని యిటొచ్చిన. పేదముండా కొడుకును."

మళ్ళీ అందుకున్నాడు. "అయిదు రూపాయలు తీసుకో. నానుంచి నీకు నష్టమైతే."

"నాకు నీ సొమ్మేమొద్దు."

"పది కావన్నా చెప్పు. ఇత్త యేం జెయ్యాలె."

"న్యాయంగా మెదిత్తే యేమిటి ఈ బాధకంటే."

"ఎవ్వలయ్యా న్యాయెంగ మెదిలెటోల్లు. అంతా ఒకరొన్నొకలు దోచుక బతుకుతునోన్లేల్లే. దొరికితే దొంగలు. దొరుకక పొతే దొరలు. ఈ లోకం తీరే అంత."

ఆలోచన పాలైనాడు రాజు. "సరే తీసుకుపో. నువ్వు అన్న ధర ప్రకారం రెండు కిలోల తూకానికి లెక్కించి సరిగా జోకి డబ్బిచ్చిపో."

"బంగారు గునం దుర్గమ్మా నీ కొడుకుది" అని, తూకం సరి చూసి డబ్బుచేతిలో పెట్టి బ్రతుకుజీవుడా అంటూ పరుగులాంటి నడకతో బయటపడ్డాడు కైలాసం.

"ఎంత షుంచుతున్నరు కొడుకా యీల్లు కూటికిలేని ప్యాదోల్ల."

"అందుకే కదమ్మా, వాళ్ళు పెళ్ళాలకు బంగారు నగలు చేయించు కుంటున్నారు, పెదపెద్ద బంగ్లాలు కట్టుకుంటున్నారు."

"నిబద్దే బిడ్డా, గిట్ల నమ్మినోల్లను ముంచుతారా?"

"నమ్మినోళ్ళను కాకపోతే నమ్మనోళ్ళ నెట్లా ముంచుతారే నీ పిచ్చిగాని."

ఆమెకు ఆమాట సరిగా అర్థంకాక నోరు తెరచి నిలబడింది.

"రాత బిడ్డా ఇదంతా."

"రాత ఎక్కడిదే, మనోళ్ళసేత. మనకు రాతపూత తెలిస్తే ఇంత అన్యాయం పాలు కాకపోదుము."

"నిజమేరా." అంది దుర్గమ్మ.

"అవ్వా, నేను కొన్ని పల్లికాయలు తీసుకుంటనే." అడిగింది మల్లమ్మ అక్కడికి వచ్చి.

"అదుబిడ్డా. పచ్చికాయెలు తింటె పెత్తానికొత్తది. పొయిమీన మంగలంబెట్టి దోసెడన్ని యేంచుకోపో. అన్నిన్ని నువ్విన్ని తిందురు. మాపటిల్లి ఊల్లెకు పోయినప్పుడు ఇంత బెల్లం కొనుక్కత్త."

"పల్లికాయలకు బెల్లమెతే మంచిగుంటదే."

"మా ఉంటదే మంచిగ. కొత్తలు కావద్దు. బుద్దులు బూములేల్త నందె రాతలు రాల్లు మొయ్యిమన్నయిట. ఏం సేతులాయె బిడ్డా నాయి. పిల్లగాళ్ళకు యేమన్న ఇంతజేసి కడుపునిండ తినబెట్టుకుందామన్నా యేం

లేకపాయె."

"మనకన్న లేనోల్లెందరులేరు పాయె. ఉండుటానికింత గుడిసెన్న ఉంది మనకు. ఈ యింతగూడా లేని బిచ్చెగాల్లు ఎందరులేరు దేశంల. ఏమొ పొలగాళ్ళ ముందల పానమెల్లిపోయినట్టుగ యేద్చ్వ పాట పాడు తున్నవే. పాయె పా. నాకింతేత్తువు పా" అప్పుడే వచ్చిన వెంకయ్య భార్యతో అని, తిరిగి కొడుకును "నువు తిన్నావురా మాయ్యా" అని ప్రశ్నించాడు.

"ఎక్కడ తినె. ఇప్పుడే అచ్చె" దుర్గమ్మ జవాబిచ్చింది.

"దా బిడ్డా. తిందాం పా."

"ఆగుండ్లి జెర. మా యెల్లెమె తొందరపడ్తవ్. ఇంటికత్తె అగడే పెద్దమనిషో ఎల్లగుర్రమెక్కచ్చినట్టు. పెద్ద అప్పురువని జేసెటోల్ల కన్నుండది గింతజోరు."

"ఆ నీయవ్వగాహోల్లందరు అప్పర్లు, రాజ్జాలేలుతర్రు. నేనేమొ పల్లకీలు మోత్తన్నాను. దరిద్రపుగొట్టు ముండ. నీయవ్వ. పుల్లిరుపు మాటలు యేదన్నొటి అంటది."

"ఏమిచ్చే నాన్న నువ్వూరుకో" రాజన్నాడు.

"సూద్రా యెట్ల మాట్లాడుతందో అది"

"యేంవన్న నేను?"

"నువ్వు వోయె అమ్మా. ఎందుకు జగడం పెట్టుకుంటవు. ఒకరికి కోపం వచ్చినప్పుడు మరొకరు ఓపికతో ఉండాలె పోటీపడి మాటలను కుంటూ జగడం పెంచుకుంటే మనసులు నొత్తయే తప్ప లాభమేముంది చెప్పు?"

"పోత బిడ్డా. ఈ ముసలాయినెతోటి నేనుగనుక. ఇంకెవ్వతయినా ఎన్నడో ఏ నూతిలోన్న పడు. ఇంటికత్తె సిరుతపులి జూసినట్టే"

"అగో సూద్రా మీ అవ్వ సంగతి."

"నువ్వూరుకుంటవా లేదా?"

"పోతన్న బిడ్డా యేమన్నా అంటే యినే మనిసిగనుకనా యేమ న్నానా. పల్ల నాలుగుతన్నుబ. సన్న పుట్టిచ్చిన ఆ దేవునిమీద, ఇటు దారవోసిన నా కన్నోల్లమీద యేడువాలెగని యెవ్వలనంటె యేముంది!"

లోపలికెళ్ళింది దుర్గమ్మ ముక్కెగజీస్తూ.

"పుల్సి మసులకముందే కంచుడు దించి మంగలం బెట్టినావె మల్లి ముండా. నీకు అగడు పెడుందేమే. నీకంటె యెక్కువ యెవలేం దిన్నరే? గౌసంత సేసాగితె నిన్ను పెద్దకుంట కట్టకు వెడుదురా, నీపేరు మాసునా. మీ అయ్యేమొ గట్లనాయె, మీరేమొ గిట్లనాయె. ఎట్ల నెగుల్దునే మీతోని. ఎందుకు దాపురించిన్నే నా గండాన. సావన్న రామగదనే నాకు."

దుర్గమ్మ మాటలకు వెంకన్న కట్టె తీసుకుని "నీయవ్వ యేంవా లా వొర్రుతున్నవ్. ఏమైందే నీకియ్యాల" అని గుడిసె లోపలికి పరుగెత్త సాగాడు. తన చేతిలోని కట్టెనందుకుని నవ్వుతూ తనవైపు చూస్తున్న కొడుకునుచూసి కొలాపి కట్టె వదలి బుసలుకొడుతూ తోటదిక్కు నడిచాడు.

రాజు మనసులో ఆలోచన.

వీళ్ళకు పరస్పరం ప్రేమ లేదా? ఉంది

మరి, ఈ పోట్లాటలకు కారణం ఏమిటి

# 12

ఆ యేడు ఎండలు మిక్కుటంగానే వున్నా కాలం తొందరగానే కలుపుకుంది. రోహిణి కార్తెలోనే పెద్దవాన కురిసేసరికి వాతావరణం చల్లబడింది. రైతులు దుక్కులు దున్నడం విత్తనాలు వేయటం మొదలు పెట్టారు. తొందరపడి పిరపు గింజలు బూమ్మీద పొయ్యకుండిరా ఈ ఆయిటి వానల నమ్మద్దు. నమ్మించి నట్టేట ముంచుతయ్. ఇంకోటి రెండు వానలు పడనియ్యి– అని కొందరు ఎదురుచూస్తున్నారు విత్తనాల అదను కోసం దుక్కులు పొతం జేసుకుంటూ. కొందరు విత్తనాలను వేస్తూనే ఉన్నారు. అవే దక్కితే మంచిపంట వస్తుందని వారి ఆశ. ఎండితే మరో పంట వేస్తారుకాని కాలం మించి పని అనువు దప్పి పంట మంచిగా రాదు. అయితే యేం జేస్తారు, వ్యవసాయం సైతం ఒకరకం లాటరేనాయె. వేసిన చేలన్నీ పండుతాయనే నమ్మకే వుంటే రైతులు యింత శ్రమ చేసేవారు కారు.

వెంకన్న దొరగారి వ్యవసాయంలో పనిచేస్తుంటాడు. ఈ విత్తనాల కాలంలో కూతురికి తోట కాపలా పనిని ఒప్పగించి తాను నాగలి దున్న టానికి పోతాడు. ఎడ్లు దొరగారివే. ఈ తోట భూమిలో చెట్లచుట్టూ ఉలవో పెసరో వేస్తారు. ఆ పంట ఇతనికే అనటంవరకే కాని, ఏనాడూ బస్తా గింజలు వచ్చిన పాపాన పోలేదు. గడ్డి తీయంది పంట రాదుకదా. గడ్డి కలుపు మాటలా ? కూలీలు ఇచ్చుకోగలడా అతడు. తానో, భార్యో ఆరంభ శూరత్వంగా రెండుమూడు కోన్రలు నేల గడ్డి తీసేవారు. అంతలోకే మిగతా చేనంతా గడ్డి బలిసేది. మంచి భూములన్నీ దున్నటం అయి పోయింతర్వాత భూమి పదను ఎత్తిపోయే సమయానికి ఇది అడ్డదిడ్డంగా దున్ని అయిందనిపించేవారు పాలేళ్లు. మంటిగడ్డల కింద పడ్డ గింజలు మొలవనే మొలవవ్. పులిపచ్చితనానికి మొలిసిన మొక్కలు అక్కడనే చింతపువ్వు వంకలు తిరిగి ఎఱ్ఱవడిపోతయ్. గరికలేవ చావదున్నితే కదా గడ్డి మల్లా బాగ పుట్టకపొయ్యేది?

అదీ వెంకన్న వ్యవసాయం.

"నేను దున్నుతనే" అని తండ్రి చేతి అరక తీసుకున్నాడు రాజు.

"అంతప్పటినుంచి ఇప్పటిదాక దున్ని దున్ని నేను రొండుసేతుల తింటన్న. ఇగ నువ్వు దున్ని నాలుగు సేతుల తింటవ్."

"కోటిద్దెలు కొండ్రను మించుతాయిరా యెంకటీ. లచ్చెల సిరిమంతు లయినా మనం దున్నంది పంటలు పండియ్యంది యేం తింటర్రా. అందరం తినేది మనం పండిత్తేనేనాయె. అల్లేం రూపాయలు తింటున్నరా బంగా రమా?" ఒక వృద్ధుడన్నాడు తాగే చుట్టతీసి చేత పట్టుకొని.

"అవునే పెద్దయ్యా. నువ్వన్నమాట నిజద్దేగని ఎండనక వాననక ఎండుతా నానుతా మంట్లె బొర్లుతా పనిజేసి సెంపుట దీసి పంటలు పండి తె మనకేం దక్కుతందే. మ్యాకె తోక బెత్తడన్నట్టుగ అరుగాలం కట్టం జేసినా మనకు అయిదేల్లు నోల్లెకు పోవాయె"

"ఏమోరా" తుపుక్కున ఉమ్మేసి మల్లా సుట్ట నోట పెట్టుకున్నాడు.

నాగలి తండ్రి కొప్పగించి ఇంటివైపుకొస్తున్నాడు రాజు. నాలుగు బారలు నడిచాడు.

"ఓ మరిదీ జెరాగు నే నత్తున్న" గంప నెత్తినపెట్టుకొని రాజమ్మ వస్తున్నది చేను నుంచి ఊరి వైపు. వంగపూరంగు చీర కాసెపూసి కట్టి కొంగును వీపు మీదుగాలాగి నడుం వద్ద చెక్కింది. నల్లరైక పిడికిగ నిండుగా అందంగా కనిపిస్తున్నది ముద్దబంతి పువ్వోలె.

"యెవుసాయం చేత్తున్నవా ?" దగ్గరికి వస్తూ అంది.

"నేర్చుకుంటున్న "అంటూ పైకి మలచికట్టుకున్న లుంగీ కిందికి వదిలాడు. కాలి పిక్కలు కప్పి పాదాల వరకు జీరాడుతున్నది గళ్ళపంచె.

"మాకష్టం కనిపిస్తలేదని నువ్వు నేర్సుకుంటున్నావ్ ?"

"దీన్ని మించిన పనేముంది చెప్పు ?"

"పనికేంది మంచిపనే. పది మందిని సాదేపనే. కాని. పాటుపడ్డోనికి పలంలేదు."

"కాయ – గడ్డా, కూరా - నారా, పాలు - పెరుగూ, అన్నీ మీ పల్లెల వాళ్ళకే తాజా దొరుకుతయ్ కదా. పట్నాల వాళ్ళకు పైసలెన్ని ఉన్నా వాడిపోయిన కూరకాయలు, నీళ్ళపాలే దిక్కుమరి."

"ఆ. అది యెనుకటి కాలం నాటిమాట ! ఇప్పుడు పండించుడు పల్లెల వంతు. మేసుడు పట్నాలవంతు. ఇక్కడ పండినయ్ ఇక్కడ ఉంచుతున్నారు. బేరగాళ్ళు లేరు బస్తీలకు చేరేసుటానికి. ఇంక, పండించి నోళ్లే తినక తాగక నోల్లు కట్టుకోని పైసలాసెకు పట్నాలకు బొయ్యి అమ్ముతున్నరు."

"అంత ఆశ వీళ్ళకెందుకు ?"

"ఆసెకు కాదు. ఎల్లక, అన్నిటికి రూపాయెలే కావన్నాయె. యెడ్లు, ఇత్తనాలు, మందులు, యెరువులు, కరెంటు బిల్లు, ఊకెనే అయితాది. యెవుసమంటే రూపాయలు బుక్కినట్టేనాయె. అండ్ల పండితే ఇంత సరె, ఎండితే అది రామగోస యేడాది దాకా. పట్నాలోల్లకేంది? నెలకు నూర్లు వెయిలు జీతాలు తీసుకుని అన్ని తీర్ల కొనుక్కొని మారాజుగ కమ్మగ తింటున్నరు. ఈలకు కాలమైతె ఆల్లకేంది కరువైతేంది ! అల్లు నోచుక పుట్టినోల్లు !" ఆమె మాటల్లో నత్యమున్నట్లు తోచిందతనికి.

"అయితే ?" అన్నాడు.

"నువ్వు యెవుసం చెయ్యద్దు. అంత సదుపు జదివి గీపని సేత్తవా!

ఏ సర్కారు నౌకరన్నా చేసుకుంటూ బంగారమోలె బతుకు. పలానాయినె మా సుట్టం అని చూసుక చెప్పుకనన్న మురుత్తం."

"మీరంతా కష్టపడుతులేరా ?"

"మా సంగతి యిడువ్. మేం అలవాటయి పోయినం. ఈ మంట్లె పుట్టి, యీ మంట్లె పెరిగినోల్లం. ఇప్పుడు యాడికి పోతం. నువ్వు ఇక్కడోనివైనా పట్నంల సదువుకుంటివి." అమాయకులైన గ్రామీణుల నిర్మల ప్రేమను గూర్చి ఆలోచిస్తున్నాడతడు.

"సూడు మరిదీ ! నీ నొసలంతా ఎంత చెమట పట్టిందో." అతడు కాస్తవెనుక కదుగేశాడు.

"ఆగు నన్ను తుడువనియ్యి." అని కొంగు చేతబట్టుకొని ఆమె ముందు కడుగేసింది.

"వద్దు వద్దు. " అంటూ అతడు దూరం జరుగబోయాడు. ఆమె ఎడమ చేయి అతని తలపై పడనే పడింది. కుడిచేత కొంగుతో అతని నొసటిని తుడిచింది.

"నీ చెంపలు ఎట్లా చతికి పోతున్నయో చూడు. మా తిండి తిని మాపని జేత్తే నాలుగు రోజుల్లో ఏనుగులు పీనుగులైతయ్ మరిదీ,"అంటూ అ. నిగరుకు గడ్డాన్ని వేళ్ళతో తాకుతూ ఆ స్పర్శానందాన్ని పొందుతున్నది.

మామిడిచెట్టు మీద పాలపిట్ట కిచ కిచ అరచింది. ఎవరైనా చూస్తూ లేరు కదా అని అతనికి భయంగా ఉంది. ఆమెకు ఆ భయమూ లేనట్లుంది.

"వదులు వదినా పోదాం." అంటూ ఆమె చేతులు తొలగించి వేశాడు.

"ఒదులకపోతే నిన్ను నా దగ్గిర కట్టేసుకుంటే ఉంటావయ్యా. పోదాం పా," అంది ఒక్క నిట్టూర్పు విడిచి.

"అన్నజాడ తెలుస్తా లేదా?"అన్నాడతడు కాలి బాటపై నడుస్తూ.

"దానితోనే ఉన్నడో, మరెవ్వతన్నా దొరికెనో!"

"ఇంత మంచిదాన్ని నిన్ను ఇంటిదగ్గర విడిచి ఏం రోగమతనికి?"

"ఏం జేత్తామయ్యా. మనిసికో రోగం. అదేంటిదో ఆ రోగం ఉన్నోల్లకు తెలువాలె, మనకెట్ల తెలుత్తది?" ఇంకా ఎక్కువగా మాట్లాడ

లేదు. గుడిసె దగ్గరికి చేరవచ్చారు.

"అత్తా! మరిదిని మా యింటికి బోజనానికి తీసుకపోతన్న.

"ఎందుకు ? కోడిపిల్లను కోసుకున్నారే?"

"ఎంతల, పొయినంక కోసుకుంటం."

"ఎందుకు తియ్యి. తిన్నంత బరాబరి. తింటె ఉంటాది మాటుండాలె."

"నిజంగనే తీసుకపోతన్న."

"ఈడ అండిన్నె. మాపటికి తీసుకపోదువు తియ్యి."

"మరిదీ మాపటికి నిన్ను మాయింటికే తీసుకపొమ్మంటంది మా అత్త. రావాలె మరి, కండ్లల్ల వత్తులేసుకుని కడుపల్ల కూసుని సూత్తుంటమల్లా!"

"నేను రాను."

"నేను ఊకోను."

రాజు నవ్వాడు. ఆమె నవ్వుతూనే వెళ్ళింది. పడుచుతనంలో ఒంటరి జీవితం ఎంతో కష్టం అనిపించింది రాజుకు ఆమెను చూస్తుంటే.

# 13

గంగాధర్ చిత్తుగా తన్నులు తిన్నాడు. మాధవరావుదొర తన్నాడు. పోలీస్ పటేల్ దగ్గరికి వెళ్ళాడతడు పోలీస్ రిపోర్టు యిద్దామని. అసల్ దార్ పోలీసు పటేల్ ఆ దొరగారే. వారి దగ్గర పనిచేస్తున్న గుమస్తా ఈ పటేల్. అతడు తన వాస్తవ పరిస్థితిని వివరించి తన నిస్సహాయతను వెల్లడించి తానాపని చేయజాలనన్నాడు.

సర్పంచ్ రెడ్డి దగ్గరికి న్యాయం కోసం వెళ్ళితే "పేరుకే నేను సర్పంచును. పెత్తనమంతా దొరదే. వారు తలుచుకుంటే సాయంత్రంవరకు మెంబర్లందరిని కూడగట్టుకుని అవిశ్వాస తీర్మానం జేపించి నా పదవి పీకి పారెయ్యగలరు. దొరగారికి ఎదురు మాట్లాడి బతికే దమ్ము మాకు లేదు. ఈ ఊరిన బతుకన్నంటె వారికెదురు తిరుగద్దు. అంతే." దొర పులయితే

వీళ్ళ తోడేళ్ళు. ఆయనకు చాటుగా తామే పుళ్ళమన్నట్టుగా వ్యవహరిస్తుంటారు. దొరముందు మాత్రం పిల్లులు. నక్కజిత్తుల నాయాళ్ళు - అనుకున్నాడు.

కరణం పంతులు దగ్గరికి పోతే "తహసీల్ వసూళ్ళ వరకే నాపని. భూమి కొలత లెక్కలు, గట్లు మార్చుడు, పంచాయితీలేవన్నా ఉంటే నా నుంచవుద్ది. తన్నులు తాకులు దొంగతనాలు హత్యలు అన్నీ పోలీసు పటేలే చూసుకుంటున్నరు. ఈ నడుమ సర్పంచులని వచ్చిరి. వారెనక వీరు పెత్తనాలు చెలాయించుతరు. మాదాక రానిస్తారు?" అన్నాడు.

ఏం చేయాలో తోచక వెనుదిరిగాడు గంగాధర్. ఇంతకూ అతడు చేసిన నేరం ఆ వూరిన బీడీల కంపెనీ పెట్టడం. దాంతో పిల్లా పెద్దా పేద స్త్రీలు మధ్యతరగతివాళ్ళు బీడీలు చుట్టటానికి ఎగబడ్డారు. నిడపట్టున కూర్చుంటే నాలుగైదు రూపాయలు సంపాదించే మార్గం కనబడింది.

వాళ్ళు డబ్బు సంపాదించుకుంటే కండ్ల వెర్రి పుట్టలేదు దొరకు. వాళ్ళెంత సంపాదిస్తే వీరి చేరువకు రాగలిగేది. కొన్ని తరాలవరకు ఊరి వాళ్ళ విషయంలో తనకా భయం లేదు. కాని అటు తేలిక పని, కూలి యెక్కువ అయ్యేసరికి యిటు వ్యవసాయ కూలీలు కరువైనారు. అదీ వారి గుండె మండుటానికి కారణం. "వద్దురా వారీ, మా వూళ్ళో బీడీల కంపనీ వద్దు. ఎత్తెయ్యి, మరే వూరిన్నన్నా పెట్టుకో" అని బుద్ధిగానే చెప్పినాడు దొరగారు. వింటేనా ఆ పొగరుబోతు మనిషి. "ఊరూరికి ఉంటున్నయ్ కాదు దొరా. వద్దంటెట్లా ? ఎవలకు నచ్చిన కష్టి వాళ్ళు జేసుకుంటరు. అందరికీ పొట్టతిప్పల ఉంటది కదా" అన్నాడు.

"నువ్వనే మాట నిజమేనోయ్. కాని యిక్కడ నీ కంపెని కారణంగా మా కూలీల రేట్లు పెరిగినయ్. పోనియ్ ఓ రూపాయి ఎక్కువైనా ఇత్తామంటే మనుసులు దొరుకుతులేరు. వ్యవసాయం కుంటుపడితే మాకే నష్టమని కాదు. దేశానికి నష్టం. ఆలోచించు. మీ బీడీలు లేకపోతే కొంప లేం మునుగవ్, జనం చావరు" అంటూ దొర యుక్తి సుపయోగించాడు.

'మీరు సిగరేట్లు తాగకుంటే యేమైపోతది దొరా, ఎందుకు తాగుతున్నరు మరి?' అని అందామనుకునీ అనలేదు కాని "మరి పొగాకుతోటలు పెట్టి పుట్లకొద్దీ మీరే పండిత్తున్నరు కాదు దొరా?" అన్నాడు. దాంతో మండుకొచ్చింది దొరకు.

గంగాధర్ కొంతకాలం బొంబాయి ప్రాంతంలో ఉండి వచ్చిన నేత పని యువకుడు. ఉత్సాహముండి యీ వ్యాపారంలో దిగాడు. దొరసేతకు ఉద్రేకం వస్తున్నది. కాని, తనకు సాయం చేయటం కాదు కదా సాక్ష్యం చెప్పటానికిఖూడా ఎవరూ వచ్చే సూచనలేదు. ఏం చేసేది? ఆలోచనలో పడ్డాడు.

ఇదివరకొకసారి ఒక బడిపంతులు గతి అంతే అయిందావూరిలో.

"నెలకోసారి వచ్చి జీతం తీసుకో. చదువు గిదువు అని చెప్పి పొలగాళ్ళను మాకు జీతాలకు దొరుకకుండా పాడుచెయ్యకు" అని దొర చెపితే పొగరుబోతుతనంతో 'ఉహూ' అన్నాడు. అంతే! దొర చేతి కట్టె విరిగింది. పంతులు పక్కటెముకలు రెండు విరిగినై. ముందటిపండ్లు నాలుగు రాలినై. లాంగ్‌లీవ్ పెట్టి వెళ్ళి పై ఆఫీసర్ పాదాలు బట్టుకొని బదిలీ చేయించుకున్నాడు. కాని మళ్లా ఆ వూరి దిక్కురాలేదు.

అంతకు ముందున్న పంతులుకు మాత్రం మంచిగానే గడిచింది. దొరగారింటనే తినేవాడు. దొర సేద్యం పనులు షేర్‌దార్‌గా చూసేవాడు. ఎండకాలం వానపలె ఎప్పుడో ఓసారి అట్లా బడిదిక్కు వెళ్ళేవాడు. నాలుగు రాళ్ళు వెనకేసుకుని పెళ్ళానికి బంగారు గొలుసు చేయించుకున్నాడు మహా రాజుగా.

అందుకే ఆ వూరికి సమానమైన జనాభాకల గ్రామాల్లో సెకండరీ పాఠశాలలు స్థాపించబడినా ఆవూరిలో మాత్రం ముద్దుగా ముగ్గురుపంతుళ్ళ ప్రాథమిక పాఠశాలేఉంది. అందులోఒక్కాయన రిటైర్‌మెంట్‌కు దగ్గరగా ఉన్న ఎనమండుగురు పిల్లల తండ్రి. కంయ్ కంయ్ మంటూ దగ్గుతూ కను గుడ్లు తేలేసి ఆపసోపాలు పడుతుంటే పరిచర్యలు చేయటం పిల్లల వంతు.

"అప్పుడప్పుడు వస్తుండండి సారూ. ఊర్లోవాళ్ళే కాదు. పై ఆఫీసు వాళ్ళు కూడా ఎవరూ ఏమనరు. ఈ వృద్ధాప్యంలో ఏం కష్టం మీకు" అని పంపించారు మిగతా ఇద్దరు టీచర్లు అతన్ని, అక్కడదిక్కులేని చావు చస్తాడేమోననే భయంతో.

మరో టీచర్ యువకుడు. కొత్తగా పెళ్ళయింది. పుట్టింది పెరిగింది బస్తీలో. ఉద్యోగం అయింది ఈ పల్లెలో. ఎప్పుడు వచ్చినా దినాలు లెక్క పెడుతూ ఉంటాడు ప్రయాణానికి. ఆయనకీ పల్లెగ్రామాన కాలు నిలువదు.

ఇంకా అతనికి మట్కా జూదం పిచ్చి ఉంది. మాధవరావే మన దొర వారి గుమస్తాగారు.

ఈ పరిస్థితిని మార్చాలనుకున్న కొత్త పెద్దపంచాయతీలయ్యే చిత్తుగా తన్నులు తిన్నది. పంతులెవ్వరో పాతాలేమిటో అట్లా నామకార్థంగా సాగుతున్నది. జీతాలు మాత్రం నెల నెలకు చక్కగా అందుతున్నవి.

గంగాధర్ సంగతి రాజుకు తెలిసింది.

"మా గూడెంలో పెట్టుకో నీ కంపెనీ. ఎవరు ఆపు చేస్తారో నేను చూస్తాను" అన్నాడు రాజుకు అతడు దారిలో కలిసినప్పుడు.

"దొరంటే ఊరందరికీ భయం" అన్నాడు గంగాధర్.

"అ బెదిరినాకొద్ది వీళ్ళట్లానే బెదిరిస్తారు లేవయ్యా. మనమే ఎదురు తిరిగి ధైర్యంగా నిలబడితే ఎవరేం చేయలేరు."

"మీ నాన్న వాళ్ళ పనిల ఉన్నాడు. నామూలాన నువ్వు కంటయితే ఆ పనికి ఉగ్గం వస్తది. ఎందుకులే-ఈవూరు కాకపోతే ఇంకో ఊరు."

"అ వూరోడు ఇట్లానే తంతే మళ్ళీ ఏ వూరికి పోతవ్? ఈ దౌర్జన్యానికి ఎన్నాళ్ళు భయపడుదాం? పనంటావ్ ఆ పనితో చాకిరి తప్ప పెద్దగ సంపాదించుకున్నదేం లేదు. మా వాళ్ళకు మరే దిక్కు తోచక ఎట్లాగో అట్లా బతుకుతున్నారు. కాని, ఈ పద్ధతే ఇంకా కొనసాగితే అర్థం లేదు. మనం యువతరం ఈ ఈ దోపిడీ విధానాన్ని ఎదిరించి మార్చాలి."

గంగాధర్‌కు రాజు మాటలు బాగానే అనిపించినా తన లాభంకూడా ఇతడు దోపిడీ అని అంటాడేమో అనే ఆలోచన కలిగింది. అయినాఅప్పటి వరకు చూడొచ్చు. ఇప్పుడైతే దొర మొగంమీద కొట్టినట్టుగా ఇక్కడ కంపెనీ తే నడిపించాలనుకున్నాడు. తనకు కలిగిన పరాభవానికి ప్రతీకార చర్యగా అతనికా కసి జనించింది.

# 14

పరాభవం సహించరానిదిగా ఉంది మాధవరావు దొరకు. ఇన్నాళ్ళకొకడు తన గ్రామాన తన కెదురు తిరగడమా? అందులో తన పాలేరు కొడుకు!

ఒకటి, తన నాశ్రయించుకొని ఉన్న శెట్టిని బెదిరించాడు. రెండు, తాను తన్ని మూపించిన బీడీల కంపెనీని తిరిగి తెరిపించాడు.

మూడు, ముగ్గురు పంతుళ్ల బడికి సక్రమంగా హాజర్ కాకపోతే జిల్లా బార్డర్ గ్రామాలు చూస్తరు జాగ్రత్త అని బెదిరించినాడు. ఇంకా క్షమించుట అవమానకరం.

వీన్ని తందామా, గోర్లతో పోయేపని గొడ్డలి వరకు తెచ్చుకున్నట్టు వుద్ది. ఇవ్వాళ రేపు కాలం ఎట్లాగనో ఉంది. ప్రభుత్వం హరిజనుల పక్షముంది. అభిమానం సంగతి యెట్లున్నా అలజడికోసమైనా ప్రతిపక్షాలు హరిజన భక్తిని చాటుతున్నవి.

తాను కూడా కాంగ్రెసు నాయకుడే. హరిజనుల దేవాలయ ప్రవేశం చేయించాడు. హరిజనుల సహపంక్తిని భోజనం (తాము వంట బ్రాహ్మలతో ప్రత్యేకంగా వండించిందే ననుకోండి) చేసి చుట్టూ పదూళ్ళకు గొప్ప సంఘ సంస్కర్తగా పేరుపొందాడు. అటువంటి తాను ఇప్పుడు వాళ్ళకు వ్యతిరేకంగా మెదలితే అప్రతిష్ట రాదూ! తన మంచితనమే గుర్తించుకోరేమి ఈ అలగా జాతి? అని బాధపడ్డాడు దొర.

రాజును ఏదో ఉపాయంగా మంచి చేసుకోవాలి. కాదా ఉద్యోగం నెపంమీద దూరం పంపించాలి. లేకపోతే వీడు, వీడిని చూసి మరొకడు ఇట్లా ఎదురు తిరిగితే తన విలువేముంటుంది? అనుకున్నాడు దొర.

తోట దగ్గరికి వెళ్ళినప్పుడు రాజును రమ్మని కబురు పంపితే లేడని జవాబు వచ్చింది. లేడో ఉన్నాడో తెలుసుకోవటానికి ఆ గుడిసె ముందుకు వెల్దామంటే నామర్దా అనిపించింది. కోపాన్ని పెదవులమధ్య నొక్కి పట్టుకుని ఇంటికి తిరిగివచ్చాడు దొర.

మరునాడుదయం ఇంటిముందు గద్దెపై కూర్చుని ఆ రాతిగద్దె క్రింద చేతులు కట్టుకుని నిలబడి ఉన్న రైతులతో మాధవరావు దొర మాట్లాడుతుండగా రాజు అటునుండి వెళుతున్నాడు.

"ఒరే పిలగా ఆగురా."

రాజు ఆ మాట పట్టించుకోకుండా వెళ్తున్నాడు.

"ఒరే రాజూ నిన్నేరా."

"నన్నా దొరగారూ! ఆ పిలుపు, ఎవరినో అనుకున్నా."

"బస్తే చదువులు మిమ్ముల పాడుజేస్తున్నయిరా. గురి మర్యాద లేకుంటా పోతంది. మంచి చెడ్డా మరచిపోయి తిన్నింటి వాసాలు లెక్కపెట్టెటోళ్లు అయితాంద్రు."

"ఏదో అగుమంటిరి కదా?" రాజడిగాడు.

"నీతో మాట్లాడాలె జరాగు." అని తన మాటల్లో పడ్డాడు. ఎంత సేపటికీ ఆ సంభాషణ తెగలేదు. ఇటు తనను నిర్లక్ష్యం చేస్తున్నట్లుగా తోచి రాజు వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని ఏమనుకున్నాడో కాని కాస్త ఎగిరి అదే గద్దెమీద కూర్చున్నాడు.

గద్దె పెద్దదిగానే ఉంది. సిమెంట్ గచ్చు చేయబడి ఉంది. అయినా దానిపై పరచిన ఈతచాపపై కూర్చున్నాడు దొర పద్మాసనంవలె కాళ్లు ముడుచుకొని. మరెవ్వరూ ఆ గద్దెమీద లేరు, ఉండరు. ఎప్పుడో వారి అనుమతితో సర్పంచో కరణమో గ్రామపెద్దలో తప్ప ఊరివారెవ్వరూ వారి ముందు ఆ గద్దెమీద కూర్చోరు. రాజు దూరాన్నే కూర్చున్నా కాస్త దూరం జరిగాడు దొర పనిమీద కదలినవానివలె. ఇంతకు తెగినవాడు ఇంకెంతకైనా తెగించగలడని భావించి కాబోలు ఏమీ అనలేదు.

"ఎందుకో అగుమంటిరి కదా." అన్నాడు రాజు.

"ఆ, ఏం లేదు. ఒకసారి మీ తండ్రిని నేను రమ్మన్నానని చెప్పు."

చిరునవ్వును పెదవుల మధ్య అదిమిపట్టుకొని "సరే" అంటూ దిగి వెళ్ళాడతడు.

"వినాశకాలానికి విపరీత బుద్ధులు" మాధవరావు వ్యాఖ్యానించాడు.

"కలికాలం! అయ్యా! తమరికి తెలువనిదేముంది? ఇట్లా కలిమాయలు జరుగుతయని బ్రహ్మంగారు ఎన్నడో చెప్పిండ్రు" ఒక వృద్ధుడన్నాడు.

తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో నవ్వుతూ అటు పైపు చూశాడు దొర.

# 15

"దొర దరుమరాజు. ఆకింటి సూరుకింద మనసొంటి బక్కపచ్చులు నూర్లమంది బతుకుతున్నరు. ఈడు గిట్ల సేత్తడా?" అని గుసగుసలాడేడు వెంకన్న, దొర పిలుపుని వెళ్ళి తిట్లుతిని వచ్చేక.

"ఆనికేమెరుక. పడుసు పొల్లగాడు. తప్పయింది బాంచెను, ఆనితో నేంది. మా మొకాలు జూసి మన్నించుండి,అనద్దా?" అంది దుర్గమ్మ పెని మిటి మాటలకు బదులుగా.

"మాన్న, దొరది పెద్దబుద్దే! ఎందుకురా యెంకా పిల్లగాన్ని ఇక్కడ గాలికిడ్సిపెట్టి ఆగం జేసుకుంటవ్. మీరే ఎట్లనో కాలం గడుపుతుంటిరి. ఆడు పట్నంల పెరిగినోడు ఇక్కడ మీతోని యేం బతుకుతడురా. మీతిండి ఎట్ల తింటడు. యేన్నన్న నౌకరి జూత్త. నేనింతల పట్నం పొయ్యేదుంది. నాతోని పంపియ్యి. అందాక మా సినిమ మీద టిక్కెట్లిచ్చే పనిచ్చుంత. మీకేందిరా అరిజనలంటే సర్కారోల్లు కండ్లకద్దుకుని ఉద్యోగమిత్తరు అన్నారు."

"దొర గట్లన్నంక మనం యెనుక ముందాడు డున్నాది?" అంది దుర్గమ్మ ఆతురతతో.

"తోల్దామే, ఆడో నౌకరిల పడితే మనకింత ఆసర ఉంటది."

"ఎవరికి నాన్నా, ఏదో నౌకరంటున్నరు?" రాజు వస్తూ అన్నాడు. గుడిసె ముందు తండ్రి కూచున్న మంచంలోనే కూర్చున్నాడు. గుట్టనీడ పారి చల్లగా ఉంది వాతావరణం.

"నీకేరా, దొర పట్నంల నౌకరి ఇప్పిత్తనన్నరు."

"ఉహు, పడ్డాది కన్న!"

"ఏందిరా నువ్వనేది?"

"ఎంమకంత కసురుకుంటవ్, ఇప్పుడు పొల్లగా దేమన్నడని?" దుర్గమ్మ మగన్ని మందలించింది.

"ఏమంటడో ఇనే ఇంకేను" అని అటు భార్యతో అని,ఇటు కొడుకు దిక్కు తిరిగి "చెప్పురా చెప్పు ఏమంటవో అను" అన్నాడు.

"నేను నౌకరీ చెయ్యను."

"ఇంత కష్టపడి సదివించిందెందుకురా నిన్ను?"తల్లి ఆవేదనపడింది.

"తెలివి రావన్నని."

"పెద్ద కొలువుజేసి బాగా సంపాదించన్ననిరా" వెంకన్న అన్నాడు.

"బాగా సంపాదించన్నంటే పెద్ద కొలువే అక్కరలేదు. అక్షరం ముక్క రానోళ్ళు కూడా సంపాదిస్తున్నరు. ఇక పెద్ద కొలువంటవా? అదే

గొప్పదని నేననుకుంటూలేను. పెద్ద పెద్ద ఉద్యోగాల్లో ఎందుకు పనికిరాని ఎదవలు ఎందరో ఉంటున్నారు. లంచాలతో ఉద్యోగాలు సంపాదించుకుని మంది పొట్టలుగొడుతూ పంది బతుకులు గడుపుతున్నారు."

"నువ్వు మంచి చెయ్యరాదా?"

"ఆ మంచి చేసుటానికి అక్కడిదాకా పోవాల్నా, ఇక్కడ నా ఉన్నారను కన్నోళ్ళను అందర్నీ విడిచి."

"తెల్లన్నాదె నీ కొడుకేమంటున్నడో?"

"నాకేం మనుసుల పడుతాలేదు."

"ఎట్లా సమజుకత్తది. ఇను తెలజెప్తన్న. ఆడు ఏ నౌకరు జెయ్యడట, ఎక్కడికి పోడట, ఇక్కన్నే ఉండి ఈ ఊరును బాగుజేత్తడట, నిన్ను ఉద్దరిత్తడట."

'ఇదేం మాయరోగమచ్చి పడె' తనలో అనుకుంది.

"ఈ కారంకూడు ఎట్లా తింటవ్ కొడుకా. నెలరోజులకే సగమైనవ్ సూడు. అచ్చినప్పుడెట్లుంటివి నిగనిగ అల్ల నేరేడు పండోలె. అద్దుబిడ్డ, నా మాటిను. అయ్య జెప్పినట్టుగ పట్నం పొయ్యి ఏదన్న కొలువుల జేరి సుకంగ బతుకు. మాకు నెలకు పదో యిరువయో పంపు అదే పదివెయిలను కుంటం. పంపకున్నా మానె, నువ్వన్న మంచిగ బతికితే సాలు" కొడుక్కు హితబోధ చేసింది.

"అమ్మా దొర యేసే ఎత్తులు మీకు తెలువదు."

"నీకేమొ తెలుత్తయ్?" తండ్రి విసురుగా అన్నాడు.

"తెల్సు కనుకనే ఎదురిస్తున్న."

"ఎదిరిస్తన్నావ్, దొరెక్కడ నువ్వెక్కడ?"

"ఆయనక్కడ, నేనిక్కడ."

"ఆయన ముందు నువ్వెంతరా అని అడుగుతున్న."

"ఎవరి విలువ వాళ్ళది."

"లచ్చెల ఆస్తి ఆమ్దాని ఉందిరా ఆరికి."

"అవ్వన్నీ మనం సంపాదించి ఇచ్చినయే."

"అన్ని అంకర టింకర యాసపెత్తెం మాటలు మాట్లాడకు మర్రా. ఆరి ముందట నువ్వు చిల్లిగవ్వకు గొరగావు" అన్నాడు వెంకన్న.

"వెనుకటి నుంచి వచ్చిన ఆస్తులు లేకపోతే వెట్టిచాకిరిచేసే మీవంటి కూలిజనం లేకపోతే తెలుస్తది ఆ దొరపస. నాకేమిటే? రాజును! మీ దొరకంటే యెక్కువ చదువుంది, ఒంట్లో బలముంది, పనిజేసే సత్తువుంది. ఎవ్వరే చెప్పు, చిల్లిగవ్వకు కొరగాంది మీదొరా మీ కొడుకా?" అని గర్వంగా చూసేసు రాజు తల్లివేపు.

"ఏందిరో ఎల్లెటనో మాటాడుతన్నవ్?" బియ్యం చెరుగుతున్న చేటను అట్లనే పట్టుకొని వింతగా చూస్తూ అంది దుర్గమ్మ.

"ఇంకేం జూసినవ్ నీ కొడుకు సంగతి. దొరకెదురుపడి మాట్లాడినమా యెన్నడన్నా మేం? దొర కూకుంటే తలెత్తి ఎదురంగ నిలబడ్డమా? మొకం వంచుకొని బచ్చోరకు నిలబడి ఆ అయ్య అడిగిందానికి అవుగాదని రెండు మాటలని బయంతోటి ఇవతల పడ్డం. గని, ఈడియ్యాల దొరపక్కపొన్న గద్దెమీద కూసున్నడటనే. ఎక్కడిదో అంత దమ్ము. ఏం జూసుకునో ఆ నిక్కు."

"దొరకు తలవంచుకొని వంగి నంగి ఉండటానికి నేనేం కాని పని చెయ్యలేదు. గద్దెమీద కూచున్నానంటే ఆయన నావంటి మనిషే అనుకున్నా కాని ఆయనో పులి నేనో కుందేలు ననుకోలేదు."

"ఇన్నవా దుర్గా నీ కొడుకు బాగోతం?"

"ఏందిరా యిది?"

"ఏంలేదే అమ్మా, మీరు దొరాయనకు తలొంచుకొని బతకొచ్చు ఇన్నాళ్ళు. అది నానుంచి కాదు."

"పగబడతదురా."

"అదీ చూస్త."

"నిన్న ఊరినుంచి పంపకపోతే గుడిసె ఖాలీజేసి పొమ్మన్నడురా" ఏడ్పుగొంతుతో అన్నాడు వెంకన్న.

"అదీ వాళ్ళ ఆయుధం. చూడు నాన్నా మి దొర గొప్ప గుణం. మీ తాతల కాలం నుంచి ఆ యింటిని నమ్ముకొని ఇంటిల్లిపాది పిల్లాజెల్లా ఆడా మగా అనకుండా చాకిరి చేసిరా. అందుకు వారికేమొ యిండ్లు మారి మేడలైనవి. ఇక్కడే కాక బస్తీలోనూ బంగ్లాలు లేచినై. బంగారు సొమ్ము లొచ్చినై. బ్యాంకుల్లో లక్షలు నిలువలున్నై.

"మీకో? ఆ స్తిపాస్తులు పోనీ, ఆకలికి అన్నం దొరకడం కూడా పోనియ్యి. కనీసం నువ్వున్న నాలుగు కమ్మల గుడిసె కూడా నీది కాదే. ఎన్నాళ్ళు ఒకరి మోచేతి నీళ్ళు తాగుతూ రోషంలేని బతుకులు బతుకుతరు. వందగా వందేండ్లు బతికేదానికంటే పౌరుషంగా పదేండ్లు బతికితే చాలు."

"ఏం జేత్తనంటవ్‌రా మరి?"

"మొదలు ఇది తేల్చుకో, నేకు దొర కావాలా్న? నేనా?"

"ఇదేం మాట కొడుకా, కడుపున బుట్టిన నిన్నెట్ల కాదంటం. ఇప వరకే చెట్టంత కొడుకు ఒగడు అడివిబట్టె. నిన్నెట్ల ఆగం జేసుకుంటం!" దుర్గమ్మ తేల్చింది.

"వింటున్నవా నాన్నా. కొడుకు కావన్నంటే ఈ గుడిసె విడిసి నడువ్."

"యాడికి పోదాంరా?" వెంకన్న అడిగాడు.

"మన గూడెంకు. పాత గుడిసెకు."

"సగం కూలింది అది."

"అన్నీ మంచిగా అవుతయ్ మనం పోతే."

ఇంక వృద్ధులేమీ అనలేదు.

# 16

గుడిసెను ఖాళీ చేయించితే గుడిసెలోని వాళ్ళు చేతులు జోడించు కొని యేడుస్తూ మన్నించుమని కాపాడుమని తన కాళ్ళమీద పడితే సగ ర్వంగా చూస్తూ మీసం మెలివేసుకోవాలనుకున్నాడు దొర. ఆ రాజుగానికి తన ప్రతాపమేమిటో చూపాలనుకున్నాడు. కాని, వాడే గుడిసెను ముందుగా ఖాళీ చేయించి తనకు నిరుత్సాహాన్ని కల్గించాడు దరిద్రుడు. అయినా దాన్ని వదిలేది లేదనుకున్నాడు.

వరండాలో ఊడుకుతున్న మనస్సుతో పచార్లు చేస్తున్నాడు దొర. ఉదయం ఏడున్నర సమయం. అప్పటికే మూడు సిగరెట్లు కాల్చేశాడు. టీ సేవనం అయింది. టిఫిన్ రెడీ అవుతున్నది.

అంతలో బర్ర్‌మంటూ స్కూటర్ వచ్చి ఆగింది.

దొరగారి ఏకైక పుత్రుడు శ్రీకాంత్‌రావు వేంచేశాడు. గులాబీరేకు, గుమ్మడిపూవు రంగుకు మధ్యగా ఉందాతని వర్ణం. నల్లని ఉంగరాల క్రాపు, చిత్తుగా పెరిగిన మీసాలు అందంగా పొందాగా ఉన్నాడు. నల్లది కొరియా పైంట్‌మీద ఇంపోర్టెడ్ బ్లూ బనీన్ షార్టుపొందున్నది వేసుకున్నాడతడు.

అతని వెనక సీటులో ఉంది పూజారి రామానుజయ్యగారి కొడుకు రంగనాథాచారి. రంగుకల మనిషే అయినా కాస్త సన్నగా ఉన్నాడు. సన్నటి ముక్కు, పొట్టి (తల)వెంట్రుకలతో. మీసాలుంచుకోడు. తెల్లని పైజామా లాల్చి వేసుకున్నాడు.

గుర్రం స్వారీ చేసినవాడు దిగి నడిచేరీతిగా కాపుదగ్గరికొచ్చాక మెల్ల మెల్లగా అడుగులువేస్తూ వస్తున్న కొడుకును చిరునవ్వుతో చూశాడు తండ్రి. కొడుకు కూడా నవ్వు ముఖంతో తండ్రివైపు చూశాడు.

రంగనాథ్ కూడా దొరకు నమస్కరించలేదు. అగ్రజాతి దర్పం అనుకున్నాడు దొర. ఆయన కూడా నమస్కారం చెప్పలేదతనికి. అధికార గర్వం అనుకున్నాడు రంగనాథ్. శ్రీకాంత్ లోపలికి వెళ్ళాడు "ఇప్పుడే వస్తా" అని రంగనాథ్‌తో చెప్పి.

రంగనాథ్ దొరగారున్న వరండాలోకి వెళ్ళాడు దొర తాను మంచం మీద కూర్చుంటూ ఆచార్య పుత్రునికి కూర్చొమ్మని కుర్చీ చూపాడు. కూర్చుని వరండా ముందున్న పందిరి తోరణాలను చూస్తున్నాడా యువకుడు. ఇద్దరే సంతానమయి శుభకార్యాలు అంతగా లేకున్నా ఏటా దీపావళికి ఇల్లు సున్నంవేయించి ద్వారాలకు రంగులు పూయించి పందిళ్లు సరి చేసి పచ్చనాకు తోరణాలు కడతారు. ఎండిన మామిడాకులు చిరుగాలికి కదలాడుతున్నాయి సులకతాళ్ళకు.

"మీ నాన్న లేరయ్యా ఊళ్ళో కనిపిస్తూలేరు?"

"ఉన్నారండీ కాస్త ఒళ్ళు వెచ్చచేసినట్లయింది. పడుకునేఉన్నారు."

"ఒకసారి ఇటు రమ్మన్నానని చెప్పు."

"మంచిదండీ."

పని కుర్రాడు టీ కప్పుతో వచ్చి రంగనాథ్‌కు అందిచ్చాడు. ఆ వెనకే సాసర్‌లో కప్పు ఉంచి సిప్ చేస్తూ వచ్చి శ్రీకాంత్ మిత్రుని ప్రక్క కుర్చీలో కూర్చున్నాడు.

రంగనాథ్‌కు అన్ని గుణాలు మంచివే కాని చదువులోనే మజ్జు. ధర్మకాలం కాబట్టి దగ్గర్లో సెంటర్ ఉండబట్టి ఎసెస్సి ప్యాసైనాడు. ఇంటర్‌లో రెండుసార్లు తప్పి ఇంటిపట్టునే ఉంటున్నాడు. అతని బుర్ర చురుకైందే. కాని, ఏమరైన నవలలు చదవటం, సినిమాలు చూడటంలో ఉన్న శ్రద్ధలో పావుభాగమైనా తరగతి పుస్తకాలు చదవటంలో ఉంటే బాగుండేది.

తండ్రి 'పౌరోహిత్యం నేర్చుకోరా' అన్నాడు.

"నాకు వాటి మీద విశ్వాసం లేదు" అన్నాడు కొడుకు. ఏం తోచని దిగా ఉందతనికి. రెండవ కుమాన్ని పౌరోహిత్యం నేర్చుకోరా అంటే అతదేమో "ఛ ఛ! నేను డాక్టరునో ఇంజనీర్‌నో కావాలి కాని ఈ తద్దినం మంత్రాలు చదువుతూ పిండాలు పెడుతూ బతుకుతానా-నా వల్లకాదు." అని నిక్కచ్చిగా అనేశాడు. మొన్ననే పదవ తరగతి పేపర్ రాశాడతడు.

"ఓరి నీ దుంప దెగ ఎంతకు తెగించావ్రా ? ఆ పిండాలు పెట్టేరా ఇన్నాళ్లు మీకు పిండాకూళ్లు పెట్టి పెంచింది." అని తిట్టాడు. కాని వినని వాళ్ళ నెవరేం చేయగలరు?

ఇది పనికాదురా అనుకుని రామానుజయ్య మూడవ కొడుకును అయిదవ తరగతిలోనే చదువు మాన్పించి ముద్దుగా పెళ్ళి మంత్రాలు నేర్పిస్తున్నాడు. కాదంటే వచ్చే ప్రమాదాన్ని గమనించి. రామానుజాచారి తండ్రి ఈ వూరి దొరగారి తాతకాలంలో రామాలయం పూజారిగా వచ్చాడు. ఆ వచ్చిన ఘడియ మంచిది కాబట్టి ఊరి పురోహితుడుగా ఉన్న ఏకైక బ్రాహ్మడు మరణించాడు. అతడు నిస్సంతు, అతని భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. ఇక ఊరి పౌరోహిత్యమంతా వీరి పాలబడింది. ఆచారం సంగతి యెట్లున్నా ఆర్జన విషయం కాబట్టి ఇతడు శివకేశవ భేదం పాటించే సంకుచితుడు కాలేదు.

పూజారితనంగా గుడి మాన్యం మూడెకరాలు చెరువుపారకం రెండు పంటలు పండే తూము దగ్గరి పొలం దొరికింది. పౌరోహిత్యం వల్ల పొట్ట గడుస్తున్నది. జీవితం సాఫీగానే సాగిపోతున్నది. ఇప్పుడేమో పిల్లలు ఆచార కర్మలకు సుముఖంగా లేరు. గుడి పూజారితనం నిర్వహించంది మరో పూజారిని పెట్టుకొని ఈ పొలం అతనికి ఇస్తారని రామానుజయ్య భయం. ఈ మాన్యాలుకూడా పూజారుల పేర పట్టాలై అమ్ముకోబడుతు న్నాయి అక్కడక్కడ. దేవుళ్ళు మడిమాన్యాలు లేకుండా దివాళా తీసి. దీపం పెట్టే దిక్కులేకుండా అయిపోతున్నారు. అది గమనించి ఈ దొర గారేమో ఆ భూమి పట్టా దేవునిపేరనే ఉండాలి కాని పూజారి పేర ఉండ కూడదని పట్టుపట్టి అట్లా సాగించుకున్నారు. సలహా సంప్రదింపులకు, అత్యా వసర పరిస్థితుల్లో వంటా వార్పులకు, అత్యానంద పరిస్థితుల్లో విందులు వేడ్కలకు హాజరవుతుంటాడు అయ్యగారు దొరగారింటికి.

మరి కొంతసేపటిలో శ్రీకాంత్ మిత్రునితో బయటకు వెళ్లాడు.

* * *

దొర వరండాలో రేడియో ప్రోగ్రాం వింటూ ఆ దినపు వార్తాపత్రిక చదువుకున్నాడు. రాజకీయపు అల్లర్ల కంటే భూకమతాల పరిమితులు వారిని ఆలోచనల పాలు చేసినై. అక్కడక్కడ పెత్తందార్లపై జరుగు తున్న తిరుగుబాట్లు అతన్ని ఆందోళన పరచినై.

రేడియో ప్రోగ్రాం అయిపోయి అతడు మీటరాపుచేసేసరికి చేర ... రామానుజయ్య.

"వచ్చిన్రా కూచోండి."

మంచం పక్కగా నాలుగైదు కుర్చీలున్నవి. అగ్రజాతివారికి అర్హు లైన పెద్దింటి వారి కోసమే అవి. మిగతావాళ్ళు షాహుకార్లు కూడా నిల బడే మాట్లాడి వెళ్తారు. చిన్న రైతులు అరుగుపైన్నే కూచుంటారు. కూలి నాలి జనం వాకిట్లోనే నిలబడుతారు. అరుగుపైకి అడుగుపెట్టే అర్హత వారి కుండదు. పనులు చేసేటప్పుడు మాత్రం అది మినహాయింపు.

"పగలు మా పెద్దబ్బాయి చెప్పినాడండీ. అయినా వొంట్లో నలతగా ఉండి రాలేకపోయిన. కాస యెండ చల్లబడినాక వెళ్ళితే మీరు కూడా ఓ కునుకు తీసి లేసుంటారు. విశ్రాంతిగా మాట్లాడుకో వచ్చునని పించింది."

"సరే—కాని ఊళ్ళో వ్యవహారం ఎట్లానో కనిపిస్తున్నది."

పాలేరు వెంకయ్య గూడెంలో తన స్వంత యింటికి మారడం గురించే మాట్లాడుతున్నాడని ఆచారి గ్రహించేడు.

"ఆ పాలపొంగు ఆరంభ శూరత్వం."

"ఎదురుతిరుగుతున్నారు కదా?"

దొరతో సమంగా గద్దెపై కూర్చున్న రాజు ఆచారి కళ్ళముందు కనిపించేడు. బస్సులో తన పక్కనే సీటు చూపినా కూర్చోక తాను నిలబడే ప్రయాణంచేసి తన కులాన్ని పెద్దరికాన్నీ నిలబెట్టుకొన్న ఘటన గుర్తు వచ్చింది ఆచారికి. అయితే ఆ గొప్పతనం చెప్పుకోడం దొరగారి చేతకానితనాన్ని చూపించినట్లవుతుంది.

"ఎదురు తిరిగి ఎవ్వడండీ బ్రతికేది. తమరి చూపుపడితే అగ్ని జ్వాలలో పడిన శలభాలవతుగా భస్మమైపోరూ!"

"నా మొగమెచ్చకం మాటల కయ్యా అయ్యగారు!"

"అఁ ఎంతమాట. నేను తమరి ముందు ఉత్తుత్తి మాటలంటానా? నా స్వభావం తమరికి తెలువదా?"

ఆ సంగతి పోని. ఏమిటి విశేషాలు?"

"ఆ! ఏమున్నయ్? మా పెద్ద కుర్రానితోనే బాధగా ఉంది."

"బుద్ధిమంతుడుగానే కనిపించుతాడు కదా."

"చూపులకేమిటండీ రామచిలుక. గుణమే వంకర. అంతా మేడి పండు వాలకం."

"ఈ కాలపు రకమే అంత. పదారేండ్లు వచ్చినాయంటే చాలు పుత్రున్నయినా మిత్రునిగా చూడాలట. పెత్తనం చెలాయించుతమంటే పాతకాలం కాదు వినుటానికి."

పెత్తనం చెలాయించుడా. వాళ్ల పెత్తనం చలాయించుకుంటే చాలు నని ఆ భగవంతునికి మొక్కాలె."

"అఁమంచి దినాలెప్పుడున్నాయ్?"

"దేనికి? ఏదైన వ్రతమా? యాత్రా?"

"పెండ్లికి."

"అబ్బాయికేనా?"

"అబ్బాయికేం తొందర, అమ్మాయికి."

"శుభం! వచ్చేనెలలో నాలుగైదు ముహూర్తాలున్నయ్. మన వీలుకొద్ది ఏదో ఒకటి నిర్ణయించుకోవచ్చు."

"జ్యేష్ఠ మాసం కదా."

"అవును అమ్మాయి గారు మీకు పెద్ద కూతురే. అటు అబ్బాయి గారు ఇంటికి పెద్దవారు కాకపోతే సరి. మూడు జ్యేష్ఠాలు పనికిరావని శాస్త్రం."

"చిన్నవారు లెండి."

"ఇంకేం నిరభ్యంతరంగా చేసుకోవచ్చు. ఏ వూరి సంబంధమో సెలవిచ్చినారు కాదు?"

వూరిపేరు చెప్పినాడు దొర.

"అమ్మమ్మా! వారింటికా! ఎన్నడూ అనలేము. వారికేమిటండి. లక్ష్మీ నివాసం వారి గృహం! ఇద్దరే కొడుకులు కదా. పెద్దాయన డాక్టర్. చిన్న దొరవారు ఇంజినియర్ చదువుతున్నారని విన్నా."

"ఆ చదువులు, వీళ్ల చదువులు ఉద్యోగాలని పొరుగూళ్ళవెంట పోతే ఇంటిదగ్గర వ్యవసాయాలు చెడుతున్నయ్. ఆస్తులు మంది పాలవుతున్నయ్."

"అబ్బాయిగారు పోలీసు ఇన్స్పెక్టరు అవుతున్నారుటకదా. రంగనాథానిక్కూడా చిన్న బాబు ఓదారి చూపితే బాగుండును."

"నా కిష్టంలేదు ఆచారి గారూ! ఇల్లు చక్కబెట్టుకుంటే చాలు."

"బాగనండి, పోలీసుద్యోగం మీద ఆశవుంటే ఇంట్లోవున్నదే పటేల్ గిరీ." అన్నాడు ఆచారి.

దొర వూరుకున్నాడు.

"అంతే ననుకోండి. ఆ సిపాస్తులు లేని బ్రతుకలేనోళ్ళకు ఉద్యోగాలు అవసరం కాని, తమవంటి వారికెందుకండీ. మహాప్రభువులు. మీకు పోగా పది కుటుంబాలు పోషించగల సంపదగలవారు-సమర్థులు." అని ఆగి తిరిగి "దివ్యమైన సంబంధం, శుభస్య శీఘ్రం. వివాహం శుభకార్యం, త్వరగా కానివ్వండి. పప్పన్నమన్నా దొరుకుతుంది మాకు."

"సరే లేవయ్యా."

"కట్నం ఎంతన్నరు అళారానికి చేరిందా?"

"అంతకు తక్కువ ఈ దినాల్లో మాయిండ్లల్లో ఇచ్చేవారెవ్వరు. పుచ్చుకునే వారెవ్వరు?"

"అవునులెండి. ఎంత చెట్టుకు అంతగాలి."

"ఏం గాలో ఆడపిల్లల తండ్రులకు అవస్థ."

"ఆస్తులు సంపాదనలు లేనోళ్ళకు కదండీ అది. తమరికేమిటండీ లక్ష్మీపుత్రులు!"

కాదనలేదు దొర.

# 17

అటు వరుని వాళ్ళు వచ్చి అమ్మాయిని చూసి నచ్చి కట్నం కానుకలను మెచ్చి వెళ్ళారు. పెళ్ళి ముహూర్తనిర్ణయం కూడా జరిగింది. దినం అంత దూరంలో లేదు కాబట్టి పెళ్ళి పనుల సందడి మొదలైంది.

సునందకిది వింతగా ఉంది. ఆమె ఎం.ఏ. చదువాలనుకుంది. ఇష్టమైనవాన్ని పెళ్ళాడాలనుకుంది. రెంటికీ అంతరాయం కలిగేసరికి బాధపడింది.

"నేను పెళ్ళి చేసుకోనిప్పుడు" అంది తల్లితో.

"ఆ సంగతి నాకు తెలువదు. మీ నాన్నగారికి చెప్పు." అంది శాంతమ్మ విసువుగా.

ధైర్యంచేసి సునంద తండ్రితో అదే మాట అంది.

"ఏం ఎందుకు?" అన్నాడాయన.

"చదువుకోవాలని ఉంది."

"చదివింది చాలు. ఇంకా చదివి నౌకర్లుచేసి సంపాదించేదేం లేదు. చదువులంటూ ఈడు గడిచిపోయి పెండ్లిళ్ళు కాక బాధపడేవాళ్ళను చూస్తున్నంలే."

"పెళ్ళి కాకపోతే పోనీ. నేను చదువుకుంటా."

"అవున్లే. మీకేం రంది మాకు కానీ. సరేలే. చదివించనోన్ల పెండ్లి చెయ్యనోన్ల మాకు తెల్సుకాని నువ్వు నోర్మూసుకుని ఇంట్లకు వెళ్ళు."

ఇక అక్కడ ఏమీ అనలేక వెళ్ళి తల్లి ముందు తన కోపాన్ని ప్రదర్శించింది సునంద.

"నాన్నమాట వినమ్మా, మంచి సంబంధం. అన్నివిధాలా అనువైన చుట్టరికాన్ని వదులుకుంటే ఆ తర్వాత కష్టమవుతది. వెనుకటి కాలంకాదు. ఇప్పుడు కన్యాదానం కంటే కాశికి వెళ్ళివచ్చుడు తేలిక."

"నా యిష్టంతో మీకక్కరలేదా?"

"మీ పిల్లల లగ్నాలను వారి యిష్టం ప్రకారమే చేసుకోండి."

"మీ పిల్లల లగ్నాలను మాత్రం మీ యిష్టం ప్రకారం చేస్తారు. అవునా?" అంది వెక్కిరింతగా సునంద.

"అంతే మరి." నెమ్మదిగానే జవాబిచ్చింది తల్లి.

అంత కోపంలోనూ నవ్వు వచ్చింది సునందకు.

"నీ యిష్టాన్నయినా అడిగారా నాన్నగారు?"

"ఇప్పుడు నాయిష్టం అడిగే దేమున్నది? వారికి తెలువదా మంచీ చెడూ, వారికంటే యెక్కువ నాకేం తెలుసని?"

"నన్నయినా అడగాలా వద్దా, ఇష్టమా కాదా అని?"

"ఇందులో అడిగేదేమున్నది.నీయిష్టం కానిపని చేస్తున్నదేమున్నది? నీ బాగు కోరే కదమ్మా నాన్నగారు ఈ సంబంధం చూసింది?"

"బాగు కోరా, చావు కోరా?"

"ఆ, ఏం మాటలవి? ఇప్పుదేమయిందని?"

"ఏమయింది? మీకు నచ్చితేసరి. పెళ్ళిచేసుకోబోయే నన్నడుగొద్దు. పశువుల సంత బేరం. ఇదే మనింటి తీరు."

"ఏమయిందే, చెప్పు. ఇంతకు మంచి సంబంధం ఎట్లుంటది? పిల్ల వాడు లక్షణంగా ఉండె. ఆస్తి పాస్తులుండె."

"నా కిష్టం లేదు."

"ఎందుకు ఏం తక్కువని?"

"ఏం తక్కువ లేదు. అన్నీ యెక్కువే. అందుకే నాకిష్టంలేదు."

"ఏమిటా తల తిక్కమాట. చెప్పు ఎందుకిష్టం కాదో?"

"నేను వేరే ఒకతన్ని ప్రేమించిన."

"ఆఁ?"

"ఆ!"

"పెళ్ళికాక ముందే ప్రేమించినవా?"

"పెళ్ళయిన తర్వాత ప్రేమించుటానికి మీ కాలపు గంగెద్దులం కాము."

"కావు, కాని యేమన్నా అయితే?"

"ఏం కాదు. అంత ఉరుకులాటలో ఏం లేం, మనసువిచ్చి మాట్లాడు కుంటా మంతే."

"ఎవరే అతను? ఎంత పెద్ద ఆస్తిపరుడు?"

"ఆస్తిలేని వాడు."

"అయితే అట్లాంటోనికి నిన్నెట్లా ఇస్తామనుకున్నవ్?"

"ఒకరిచ్చేదేమిటి? నా పెళ్ళి,నాయిష్టంగానే చేసుకుందామనుకున్నా."

"ఆ దరిద్రున్ని?"

"ధనవంతులమే కదమ్మా మనం."

"అయితే?"

"మన ఆస్తిలో సగం నాకు రాదా?"

"బాగుంది వరుస. ఆసి పాసి అంతస్తు ఏదీ చూడంది ఎవనికో మొకం మాసినోనికి నిన్ను ధారవోసి సగంఆస్తి పంచిస్తారమ్మా మీ నాన్న గారు? సరే కాని. ఏవూరే అతంది?"

"ఈ వూరు."

"ఈ వూళ్ళో మన కులపు ఇల్లు మరొకటి లేదు. ఎవరే?"

"మన తోటకాపరి వెంకన్న కొడుకు రాజు."

"ఛ ఛ! ఏం పిచ్చి లేచిందా నీకు?"

"చిన్నప్పటి నుంచి ఎరిగినవాడు. మంచివాడు. చదువుకున్నవాడు." అంటూ రాజులో తాను ఎంచుకున్న మంచినిచెప్తూ "నాకు అతడు నచ్చాడు" అంది.

నిజంగానే సునందకింకా అతని మీది వ్యామోహం తొలగిపోలేదు. అతడు ఈ సంబంధం కూడదన్నాడు. అయితే తనవాళ్ళు అందుకు అంగీకరిస్తే అతడు తప్పక ఒప్పుకోవచ్చునని ఈమె విశ్వాసం.

కూతురు ధైర్యాన్ని సిగ్గు ఎగ్గులు లేకపోవడంగా మాత్రమే తీసుకుంది తల్లి. తన్ను ఆడించడానికి మాత్రమే ఈ సంభాషణగా భావించింది.

"ఏం బాగులేడా అల్లుడు?"

"అల్లుడు! ఎవడే అల్లుడు? దవడలు పగుల వాయిస్తా మల్లా. వాడి తాహ తెక్కడ, మనమెక్కడ? మురికి కాలువనీటితో దప్పి తీర్చుకుంట సన్నట్లుగా ఉంది నీవాలకం చూస్తే."

"మనసుకు నచ్చితే గంజయినా పాయసంతో సమానం."

"పందయినా నందితో సమానం." వెక్కిరింత తల్లివంతయింది.

"అంతే మరి" కూతురు స్థిరచిత్తం ముందు తల్లి ఓడినట్లయింది.

"ఏ జేష్టక్క వచ్చి కూర్చున్నదే నీ నెత్తిమీద" బాధగా అంది కాంతమ్మ.

"అదృష్టదేవత." సునంద తల్లి మాటను సవరించింది.

"మీ నాన్నతోటి అనలేదు కదా."

"లేదు."

"మేలయింది. అనేవు సుమా."

"అంటే?"

"అంటే తోలు వొలిచి తోరణాలు కడుతరు."

"ఆపై శవానికి కల్యాణం చేస్తారు, అవునా అమ్మా?"

"నీ దయనే తల్లీ. నామాట విను. మీ నాన్నగారు తెచ్చిన సంబంధం కాదనకు. బుద్ధిగా ఒప్పేసుకో. పిచ్చిమాటలన్నీ విడిచిపెట్టు" అంటూ బ్రతిమిలాడ సాగింది తల్లి.

"అంతకు మిక్కిలి యేమనగలవులే." అని అక్కడినుంచి లేచి వెళ్ళింది సునంద.

అన్న కలిసినప్పుడు మెల్లగా తన మనసు సంగతి అతనికి వివరించింది. తమ పెళ్ళికి తోడ్పడుమని ప్రాధేయపడింది. ఆమె అన్నవన్నీ

విని అతడు అవునుకాదనక ఏమాత్రం వాదు పెంచక 'సరే'అని బయటకు వెళ్ళాడు.

# 18

రంగనాథ్‌తో కలిసి కొండప్రక్కగా యేటిఒడ్డున నడుస్తున్నాడు శ్రీకాంత్. "ఈ వింతవిను," అని చెల్లెలి మాటలు వినిపించాడు.

"వెల్‌డన్, ఆమె ధైర్యాన్ని నేను అభినందిస్తున్నా. గొప్పసంఘ సంస్కారం. దీనికి మనం తోడ్పడి మీనాన్నగారిని ఒప్పించి. కాకపోతే ఎదిరించయినా ఈ వివాహం జరిపించాలి." రంగనాథ్ అన్నాడు ఉత్సాహంతో.

ఆశ్చర్యంతో నోరు తెరవటం దొరబాబు వంతయింది. అతడు తన మాటకు వంతపాట పాడుతాడనుకున్నాడు. కాని, ఇట్లా వింత తప్పెట వాయిస్తాడనుకోలేదు.

"నీ బొంద సంస్కారం. ఆ వెధవకు నా చెల్లెను పెళ్ళి చేసుకునే అర్హత ఉందా?"

"మీ చెల్లెకు ఉందికదయ్యా అతన్ని చేసుకునే సంస్కారం."

"ఆ వెధవను."

"వెధవెట్లవుతాడు ఇంత చక్కని స్త్రీ అనురాగాన్ని పొందినోడు?"

"అయ్యగారూ,అనురాగం గినురాగం అని పైత్యపు మాటలు మాట్లాడకు. ఆ మాలకు మాకు ఎక్కడి సాపత్యం?"

"కులవిభేదాలు ఉత్తవి మిత్రమా."

"మీ బ్రాహ్మలకేం పనిలేదు. అచారాలోహో అని కులాల మతాల సంరక్షించాలని అరచేది మీరే.అవి వద్దొహో అని నాస్తికులై అరచేది మీరే. నాకు చూడ పొట్టకూటికి అటు కొందరు ఇటు కొందరు చేరి ఈ నాటకాలన్నీ ఆడుతున్నారనిపిస్తున్నది."

"మన దొరలు అన్ని పార్టీల్లో తామే చేరి తామే నాయకులు కావాలని కుమ్మలాడుకున్నట్లా?"

"అట్లాగే అనుకో. ఏ పార్టీ గెలిచినా అప్పుడు చిక్కుండదు కదా. ధనవంతుడు గద్దెమీద కొస్తాడు చాలు."

"మాటలతో పేదల్ని మభ్యపెట్టి ధనికులు పబ్బం గడుపుకోవచ్చు."

"అంటే మేం! మరి మీ వాళ్ళవీ అంతేనా?"

"సంఘ సంస్కర్తలను, త్యాగశీలంకల ఉత్తములను, ఈ పొట్ట నింపుడు వినాయకులతో పోలుస్తావయ్యా. వీళ్ళు ఉత్త స్వార్థులు. వాళ్ళు సమాజ శ్రేయస్సును కాంక్షించే స్వార్థత్యాగులు."

"అనకేం జేస్తవ్లే ఆ పైత్యం తలకెక్కింతర్వాత."

"ఎన్నయినా అను. కాని, మీ చెల్లె చేసేపని మంచిది. మనం చదువుకుంటున్నవాళ్ళం పరిజ్ఞానం కలవాళ్ళం. ప్రపంచంలో ఏదేశంలోనూ లేని ఈ మనదేశపు వర్ణవిభేదాల్ని నిరసించాలి."

"కిరస్తానీలు, ముస్లింలవలె."

"ఎందుకు? ఆర్య సమాజీయులు కూడా కులవిభేదాల నంగీకరిస్తూ రేదు."

"ఏది ఏమైనా మా ఆత్మగౌరవం మాకు ముఖ్యం. మా అంతస్థును బట్టి మేం మెసలుకుంటాం."

"సరే మీ యిష్టం" అన్నాడు రంగనాథ్.

చెల్లెలి కోరిక విన్న క్షణంనుంచీ శ్రీకాంత్ ఏదోవిధంగా రాజుతో పేచీ పెట్టుకోవాలని చూస్తున్నాడు. 'ఖబడ్దార్' చెప్పాలని తహతహపడు తున్నాడు.

మరునాడే ఆ అవకాశందొరికింది. కాలువగట్టుమీద రాజు ఒంటరిగా దొరికేడు.

"మేమెవరమో తెల్సా?" అదీ అతని మొదటి మాట.

"తెల్సు."

"మా అంతస్థేమిటో తెల్సా?"

"తెలుసు."

"నీ అంతస్థు స్థాయి తెలుసా?"

"తెలుసు."

"మరి యేమిటి నీ వ్యవహారం?"

"ఏమిటి ?"

"మా చెల్లెలితో పెళ్ళి కావల్సివచ్చిందా ?"

"అసలు నాకు పెళ్ళే కావల్సిరాలేదు."

"ప్రేమ పెళ్ళి అంటూ అమ్మాయిని మభ్యపెట్టలేమా ?"

"ఏదైనా అనగలరు. పెద్దింటివాళ్ళు మీరు."

"కాబట్టే చెప్తున్నా. మళ్ళీ మా చెల్లెతో కల్సి మాట్లాడే ప్రయత్నం చేస్తే సున్నంలోకి ఎముక ఓగులదు జాగ్రత్త."

"ఆ విషయం మీ సోదరికి చెప్పుకోవటం మంచిది."

"ఆత్మగౌరవం కాపాడుకోవటం మాకు పరులు నేర్పవల్సిందేం లేదు."

"ఆత్మ నిగ్రహం అవసరం."

"అర్హతలేని కలలుమాత్రం కనకు."

"అదే చెప్తున్నా. నా అర్హత నెరిగి నేను మెదలగలను. మీరూ అట్లా మెదలటమే మంచిది. అనవసర భ్రమలు పెంచుకొని మమ్మల్ని బదనామీ చెయ్యకండి మీరు కాకండి."

"మేమే కలలు కంటున్నామా. ఇంత పెద్ద ఐశ్వర్యవంతుడు దొరికడని?"

"ఒక మనిషి మరో మనిషిని కోరుకునేది మనసునుబట్టి. మానసిక బంధాలముందు ఐశ్వర్యం అడ్డురాదు. అవన్నీ ఎందుకుకాని, నేను మీమీది ఆశతో లేను. మీరు అట్లాగే నాకు దూరంగావుండే ప్రయత్నమే చెయ్యండి. అదే ఉభయులకూ మంచిది."

"ఏం పొగరు ?" అనుకున్నాడు శ్రీకాంత్ తన జవాబునాశించకుండా తనను ఆదేశించి వెళ్ళిపోతున్న రాజును చూసి.

# 19

శ్రీకాంత్ వెళ్ళి చెల్లెను గట్టిగా మందలించాడు. "వాడు ఎన్నిమాటలన్నాడో తెల్సా ! నేను మీమీది ఆశతో లేను. మీ చెల్లెను అదుపులో ఉంచుకోండి, అది ఉభయులకూ మంచిది అన్నాడు. వాడెంత? వాని అర్హతెంత ? ఆ లేబర్‌గానితో నీమూలంగా మాట పడవల్సివచ్చింది. కొంచెం

జాగ్రత్తగా ఆలోచించి ఇంటి గౌరవం నిలుపు."

అన్నమాటలకు మరేమనలేదు సునంద.

ఎటు ఒకవైపు అనుకూలంగావున్నా మరోదిక్కు వారిని సాను కూల పరచుకునేందుకు యత్నించేది. ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లుంది. అవివేకంగా కలలుగని తానే అనవసరంగా బాధను పెంచు కున్నాననుకుంది. చివరికి ప్రాప్తానికి తలవంచింది.

ఆర్భాటంగా పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నవి. అయినా ఆమెకు ఆనందంగా లేదు. అన్నివిధాలా యోగ్యమైన వియ్యం దొరికిందని అంటు న్నారు. ఆమెకలా అనిపించడంలేదు. అందంగా ఉన్నాడు వరుడంటు న్నారు. అయినా ఆమెకతనిపై ఆసక్తిగాలేదు.

ఆమె కన్న పగటి కలల ఫలితమిది.

ఆమె పెళ్ళయింది. అత్తవారింటికి వెళుతూ తమ తోటలోని కూలి పోయిన గుడిసెవంక చూసి తల వంచుకుంది. ఆమె కనులు చెమర్చాయి.

పెళ్ళి వేడుకనుకాని, పెళ్ళికూతురునుకాని చూడ వెళ్ళలేదు రాజు. పెళ్ళి పనులకు సైతం తనింటివారిని వెళ్ళనీయలేదు.

బాజాల చప్పుడు దూరంగా వినపస్తుంటే ఏటి ఇసుకలో పిచ్చి గీతలు గీస్తూ కూర్చున్న రాజు ఒక నిట్టూర్పు విడిచి ఎదురుగావున్న కొండవైపు చూసేడు తదేకంగా.

ఆ సంఘటన ఒక స్వప్నంలా తోచింది అతనికి. లేకపోతే రాకుమారిలాంటి ఆ అమ్మాయి తనను ప్రేమించటేమిటి? తాను అలాంటి అవకాశాలకొరకు ఎదురుచూడలేదు,కలలు కనలేదు. తన ధ్యాసంతా చదువు మీదుండేది. క్లాసులో ప్యాసయి ఏదైనా మంచి ఉద్యోగం సంపాదించుకుని తన ఇంటి పరిస్థితిని బాగుచేసుకోవాలని ఉండె. అనుకోకుండా ఆమె ప్రణయ గాథ ఒకటి ఆరంభమైంది. తాను అవునంటే ఆమె సంతసించేది. ఆ ఇంటి తీరు చూస్తే ఇద్దర్నూ బాధపడేవాళ్ళు. తమ యింటిలోనైతే ఆమె సుఖ పడుదు కాదు కదా కనీససౌకర్యాలతోనైనా జీవితాన్ని వెళ్ళబుచ్చకపోయేది. ఆ తండ్రిగారికెంత అహం? అన్న పొగరుబోతు. ఆమె? సౌమ్య సౌందర్య రాశి! ఓ అదృష్టవంతునికి అర్ధాంగిగా మారింది. అదే మంచిపనైంది.

దొరతో రగడా తప్పింది. తప్పిందా? ఆ కారణంగా కాకున్నా మరో కారణంగానైనా జగడం తప్పలేదు.

ఇది వేరు. బ్రతుకు పోరాటం. అది ప్రేమ వ్యవహారం. రెంటిని ఒకటిగా భావించటానికి వీల్లేదు. ప్రేమ స్వార్థానికి సంబంధించినది. ఈ బానిసత్వ నిర్మూలనం తన కుటుంబానికి ఇంకా దళిత సమాజానికి సంబంధించిన వ్యవహారం.

రాజు తన దృష్టి తమ పల్లెవైపు కేంద్రీకరించాడు. దాన్నొక పరిశుభ్రమైన ఆశ్రమంలా మార్చాలనే సంకల్పం బలపడింది.

బుద్ధునివలె జ్ఞానాన్ని, ధర్మాన్ని ఆలోచించేవాడు. గాంధీవలె నిరాడంబరతని, సేవాభావాన్ని స్వీకరించేవాడు. మార్క్స్‌వలె శ్రామికజన సముద్ధరణం ధ్యేయంగా భావించేవాడు కావాలి. తాను చేయగలడా? తనతో కబుర్లు చెప్పే గూడెంవాళ్ళలో ఒక్కడికీ అక్షరాలన్నా రావే.

తమ్ముడు గుర్తువచ్చేడు.

"బండమొండి ఆయినా వాడిక్కడవుంటే బాగుండేది" అనుకున్నాడు. వానిమీద కేసు లేదనన్నా తెలుసునో లేదో అనుకున్నాడు.

తెలిసినా, తెలియకపోయినా అసలు మనిషి అక్కడ లేడు. ఒక్క నిట్టూర్పు విడిచేడు.

# 20

ఆ యేడు వర్షాలు బాగా కురిసినై. చెర్లు నిండినై. ఆ వూరి ప్రక్క యేరు నిండుగా పారుతున్నది. చెట్టు, చేమ, పంటచేలు గ్రామపరిసరాలు పచ్చగా, రమ్యంగా ఉన్నయ్. అటుగా విలాసంగా వెళుతున్న యువకునికి సన్నని రాగంతో పాట వినవచ్చి కాలాపాడు. ఆ గొంతు స్త్రీది. జానపద గీతం.

కట్టూ కట్టూ బండీ, కాడెండ్లాబండీ, జోడెడ్లాబండీ ఓ నాయుడుబావా
ఎర్రాజీరే కట్టీ ఎర్రారైకే తొడిగి ఏడూగంటలకత్తే
టికాక్కటందకపాయే గాడెల్లీపాయే ॥కట్టూ॥

తెల్లాచీరే కట్టి తెల్లారె కే దొడిగి తెల్లారంగా వత్తే
టీక్కొటందకపాయే గాడెల్లీ పాయే ॥కట్టూ॥....

ధ్వనినిబట్టి అటు దెస నాలుగైదడుగులు నడిచేసరికి పొలం గట్టు మీద గడ్డి కోస్తూ పాట పాడుతున్న యువతి కనిపించింది. పల్లెపాటకన్నా ఆ పడుచు బాగుంది. నిండైన పరువం, పసందైన రూపం.

ఒంటరిగా వుండికాబట్టి చీరకొంగు నడుంచుట్టూ తిప్పి వంగి గడ్డి కోస్తున్నది.

అలాగే చెట్లచాటుగా నిలిచి ఆమె సౌందర్యామృతాన్ని కన్నుల దోసిళ్ళతో త్రాగసాగాడు. ఆ యువతి రాజమ్మ. ఆ యువకుడు-? రాజమ్మ గడ్డిమోపు నెత్తికెత్తుకొని వస్తూ అక్కడ నిలిచివున్న అతన్ని చూసి తల వంచుకొని ముందుకు సాగిపోయింది. ఆమె వెనుక నడువసాగాడు. కాలి బాటగుండా పోతున్నారు. ఆమెకు ఇతని అడుగుల సవ్వడి వినవస్తున్నదో లేదోకాని అలాగే వెనుదిరిగి చూడకుండా ముందుకి ఊరివైపు పోతున్నది.

వెనుక వస్తున్న యువకునికి ఆమె నడుము, భుజాల వొంపులు చూసి ఉద్రేకం చోటుచేసుకుంది. చుట్టూ చూశాడు. జనసంచారం లేదు. అక్కడ చెట్లు పొదలు కొంత చాటుగా ఉన్నాయ్. మాట మంతీ ఏదీ లేదు. హఠాత్తుగా వెనగ్గా వెళ్ళి ఆ నడుంచుట్టూ రెండు చేతులు వేశాడు.

ఆమె విషయాన్ని అర్థంచేసుకునే లోపుగనే చేతులు బిగుసుకున్నాయ్. ఆమెను బలంగా దారిప్రక్కకు పొదల చాటుకు లాక్కుపో సాగినై. ఆమె గడ్డిమోపును పడవేసి గిరుక్కున వెనక్కు తిరిగి చూసింది. ఆ వూపుతో అతని చేతులు పట్టుతప్పినై. మహారౌద్రంతో బుసలుకొడుతూ నడికట్టులో చెక్కివున్న కొడవలిని తీసింది.

"ఏమనుకున్నావ్‌రా, ఏదీ ఇప్పుడు ముందుకురా. నీ నెత్తురు కండ్ల జూడందె యిడువ?"

శ్రీకాంత్ భయంతో వెనుక కడుగులు వేస్తున్నాడు. ఆమె అలాగే ముందుకు వస్తున్నది.

అంతలో చెంప చెళ్ళుమంది. ఏం జరిగిందో తెలుసుకునేసరికి ఎగిరి అల్లంత దూరాన పడ్డాడు దొర కొడుకు.

'నీయమ్మ'—అంటూ లేచేడు శ్రీకాంత్.

"నీకూ ఉందిరా అమ్మ. చక్కగా మాట్లాడు." అని రాజు అతని దగ్గరికివెళ్ళి షర్టు కాలర్ కొనలు పట్టి గొంతుకు బిగించసాగాడు.

"ఇడిసిపెట్టు సత్తదు నల్లమొకపోడు. ఆ పెబ్బసాలు అయ్యా తాతలు యీదికి రావచ్చు. ఇంక నా జోలికత్తాడు! సచ్చినోడు" అంటూ రాజమ్మ ఇతన్ని దూరం లాగుతూ పెనుగులాడింది.

రాజుతల రాజమ్మ వక్షస్థలానికి అదుముకుని వుంది. ఎలాగో కాసాగిందతనికి. కోపం తావున ఏదో గిలిగింత చేరి నవ్వుముఖంతో లేచాడు. ఆ దృశ్యం చూసిన శ్రీకాంత్‌బాబుకు పరాభవానికి తోడుగా అసూయ చేరింది.

అతడు లేచి బట్టలదుమ్ము దులుపుకుంటూ వెళ్ళినకొద్ది వీళ్ల నవ్వుతూ చూశారు.

అటుగా వస్తున్న ముసలాయన వీరివైపు చూసి "ఆ పోతున్నాయినె ఎవలు?" అన్నాడు.

"మన దొర కొడుకు" రాజన్నాడు.

"ఏమో పిర్రలు దులుపుకుంటు పోతడు?"

"మనక్కె లిగిత్త కుమ్మితే దుబ్బల అడ్డం పడ్డాడు పాపం!" రాజమ్మ అంది వలాకిగా.

"ఏది ఎటుపాయె కోడె?"

"ఇటు దిక్కు ఉరికింది" అన్నాడు రాజు.

# 21

విషయం మెల్లమెల్లగా ఊళ్ళోపొక్కింది. ఇట్లనట కదా అని ఎవరో చెవిదగ్గర మెల్లగా ఊదేసరికి పరుగునవచ్చి "ఇంత అన్యాయమా?" అన్నాడు రామానుజయ్య దొర దగ్గరికి వచ్చి.

ఎవరిది ? అనలేదు కాని "దిన దినం న్యాయం నశించి పోతున్నది." అని మాత్రం అన్నాడు దొర.

"అయ్యొయ్యో - ఇంకంటారు, కలియుగాన ధర్మం పాదమాత్రంగానే నిలిచి వుంటుందని పురాణాలు ఘోషిస్తున్నయ్. అందుకే మర్యాదస్తులం ఈ మాత్రమైనా గాలి పీల్చుకో గలుగుతున్నాం!"

"కావరం పట్టింది గాడిది కొడుక్కు."

"ఆడకూతురు మీద చెయ్యేసుకుంటదా?" అన్నాడు రామానుజయ్య. మాలదే అయితే మాత్రం?

"అదేంపనిరా' అంటే లంజ కొడపలి తీసిందట- వాడు చెయ్యే విసిరేడు. మరీ మీరిపోతున్నారు" అన్నాడు దొర తనకొడుకునుంచి విన్న కథను.

"అపచారం అపచారం కొడుకు మీద చెయ్యేసుకుంటడా?"

చిన్నబాబు వచ్చి అక్కడే అయ్యగారి ప్రక్కకుర్చీలో కూర్చున్నాడు ఎడమచేత దస్తీని చెంపకు అడ్డుగా పెట్టుకుని. అటు పరీక్షగా చూస్తున్నవాడల్లా దొర తనవైపు చూస్తున్నది గమనించి చూపులు త్రిప్పుకున్నాడు.

పనిపిల్లవాడు రావటంతో "ము డుబ్బాయీలు తీసుకురారా" అని చెప్పి, మాధవరావు లఘుశంకకోసం బాగా వెనుకవైపు పెరట్లోకి వెళ్ళాడు.

రామానుజాచారి తాను వీధిలో విన్నకథ అంతు తేల్చుకోవాలనే ప్రయత్నంలో, "దెబ్బ బాగా తాకిందా బాబూ?" సానుభూతిగా అన్నాడు శ్రీకాంత్ వైపు తిరిగి రామానుజాచారి. చెయ్యి తీశాడు దొర కొడుకు

"వీడి చేతులు పడిపోను. వీడి శ్రాద్ధం పెట్టా. అయిదేళ్ళు అట్లనే దద్దులు తేలినయ్. ఎంతదెబ్బ కొట్టిండు దౌర్భాగ్యుడు!"

"కానియ్! దీని ఫలితం అనుభవించకపోడు. పులినోటనే తల పెట్టిండు వాడు!"

"ఏమిటిది! అల్లాటప్పా మనుషులనుకున్నాడా దరిద్రుడు? ఇంత పెద్ద దొరవారి పుత్రుడు. అంత దుడుసు తనంతో మెదలుతాడా తలకుమాసినోడు?"

"చూపిస్తా నా తడాఖా వానికి. డరీ రోగ్!"

"సాయంత్రం అయిదుగంటల వేళకే కదండీ మీరటు వెళ్ళింది-"

"అయిదున్నర."

"అయ్యో. ఎంత పనయిందండి, ఒక గంట ఇటయినా అటయినా కార్యభంగం కాకుండేది. అప్పుడు శనిగ్రహం మీకు వక్రించి ఇంత పని జరిగింది-" పెదవి విరుస్తూ వేళ్లు లెక్కిస్తూ విచారంగా అన్నాడు.

"ఇందుకన్నాడా ముహూర్తాలుంటాయా?"

"లక్షణంగా. ప్రతికూలగ్రహాల అనుకూలత కొరకు శాంతిపూజలు అభిషేకాలు చేయవల్సి వుంటుంది తామీరు తలచుకుంటే అదో పెద్ద ఖర్చు కాదులెండి వందా రెండువందలు అంతే. తమలాటి లక్ష్మీపుత్రులకు ఒక దినం జేబుఖర్చు."

"సరే–అట్లాగేకానివ్వండి, డబ్బు ఇస్తాకాని ఒక మంచి ముహూర్తం చూడండి–"

"ఎందుకు ?"

"దవడలు పగులకొట్టుకునేందుకు మాత్రం కాదు"

"రామ రామ! ఎంతమాట! నాకు తెలువదా చిన్నదొరగారూ! తమ రిని అంతప్పటినుంచి చూసినవాణ్ని."

"సరే కార్యవిజయానికి తిరుగుండకూడదు."

"అవశ్యం. కాని, అందుకేనా ?"

"అదంతా మీ కెందుకండీ, ముహూర్తం చూసుకోటానికి?"

"కార్యాన్నిబట్టి కదండి చూసేది, ఆ! అయితే ఓ వారం దినాలు ఓపిక పట్టండి."

నవ్వుతూ షర్టు పాకిట్ నుంచి తీసి అతడిచ్చిన నోటును తీసుకుని కళ్ళకద్దుకుని మలచి రొండిలో దోపుకున్నాడు అయ్యగారు.

ఇంతలో వీరా చేరవచ్చాడు. అక్కడ వరండాలో అరుగు చివరగా ఉంచిన సైజులో వున్న ముంతంలోంచి పలుచెంబులో నీరు తీసుకుని కాళ్ళపై పోసుకుని వచ్చి కుర్చీపై కూర్చున్నాడు.

టీ త్రాగింతర్వాత అయ్యగారు ఆకు పక్క అడిగి వేసుకుని సెలవు తీసుకున్నాడు.

# 22

హరిజనగూడెం వున్న స్థలమంతా దొరగారిదట. అందరినీ ఖాళీ చేయించుతారట! తెల్లారేసరికి ఈ వార్త గుప్పుమని గుగ్గిళ్ళం పొగవలె ఊరంతా వ్యాపించింది. ఎటు చూసినా గూడెంలో గుసగుసలు చోటు చేసుకున్నవి.

ఎట్ల బతుకుతం, దొర కన్నుపడ్డది. ఆరి దగ్గరికిపోయి కాల్లమీద పడంది చెప్పుతోటి చీమల నలిచినట్టుగ చేత్తడు మనల-అనేమాట పలువురి నోళ్ళనుండి వెలువడింది.

ఊరిలోని ముసలిళ్ళమాత్రం గూడానికి మూడిందిరా ముప్పు, అనుకున్నారు.

కుర్రకారుకు చూడాలిరా భాగోతం. అన్నట్లు హుషారుగా ఉంది.

అక్కడికిక్కడికి రాయబారం నడిపేవాళ్ళు కొందరు తయారైనారు.

ఏనాడో దొర తాత కాలం నాడు అడవిలో ఈ వూరు పొందించి ఆ వూరికి భూకామందయి వతన్‌దారయి పనిపాటల జనాన్ని ప్రక్కగ్రామాల వాళ్ళను పిలిచి అందరికీ గుడిసెలేసుకునుటానికి తలా రెండు గుంటల స్థల మిచ్చాడట. అది ఇంచుమించు నూరేండ్ల క్రితపు సంగతి. అందుకు యేండ్లు తరబడి వారింటి చాకిరిలోనే వీరు గడిపారు.

"ఈ జాగ మాదే" గూడెం వాళ్ళన్నారు.

"మీదయితే మీరు భూమిని కొన్న పట్టా కాగితాలు చూపించండి" అని చెప్పంపాడు దొర.

"మాది కాక మీదే అయితే మి దగ్గరే ఉద్దెరగా ఈ భూమి తీసుకుంటే మీకు మేం రాసిచ్చిన అప్పుకాయిదాలు చూపుండి మీరే" అన్నారు వీళ్ళు.

"అప్పుడు మర్యాదకోసం ఊరకే వేసుకోనిచ్చినం. ఇప్పుడు మర్యాద తప్పింది కాబట్టి మా స్థలాలు మేం తీసుకుంటం."

"ఇచ్చినవాడు లేడు. తీసుకునోళ్ళు లేరు. అప్పుడు పైకానికిచ్చిరో ఉత్తగనేనో, అడివినమీరు ఇల్లు కట్టుకున్నట్టుగ మావోళ్ళు సర్కారు

భూమిన ఉత్తగనే ఇండ్లేసుకున్నరో. ఇప్పుడా సంగతులన్నీ యెందుకు."

"మేం సర్కారి దగ్గర ఈ భూమంతా కొని పట్టాలు చేయించుకున్నం. మా దగ్గర పట్టా కాయిదాలున్నయి. మీ దగ్గరుంటే చూపుండి."

"పట్టాలు మీయే అయితే, మా యిండ్ల జాగ మీదే అయితే, ఇచ్చినాయిన మల్లా తీసుకోవన్ననుకున్నా ఆ లెక్కంతా ఆయిన కండ్లముందు జరుగాలె. ఆయన చచ్చె, ఆయిన కొడుకు కూడా చచ్చె. యిప్పుడు మూడు తరాల తర్వాత పాత కతలు తవ్వుడు పనికిరాని మాటలు."

"అదంతా మాకు తెలువదు. మేం భూమిని వదులం. గుడిసెలు లేపుకొని వెళ్ళండి. లేదా బలవంతంగా ఖాలీ చేయిస్తం. కోర్టునుంచి అర్డర్లు తెస్తం."

"కక్కింది గతుకుడు కుక్కజాతి గుణం. మనుసులైతే ఆ పని చెయ్యరు" అన్నారు వీళ్లు ఆఖరికి ఉక్రోషంగా, వాళ్ళు దానమిచ్చిందయినా తిరిగి తీసుకుంటామని అనొద్దనే ఉద్దేశ్యంతో. దీనితో సిగ్గుపడి వాళ్ళ ఆవేశం చల్లారలేదు. నెయ్యిపడ్డ అగ్గి వలె భగున మండిపోసాగాడు దొర.

ఈ మాటల తతంగంతో రెండు మూడు రోజులు గడిచినై. దీనికంతటికీ కారణమేమిటో ఊరివాళ్ళకు తెల్సు. గూడానికి తెల్సు.

ఊరి పెద్దలు కరణం, పటేలు, సర్పంచు, పూజారి వెళ్ళి మాట వరుసకు మంచికోరి చెప్తున్నట్లుగా నటించి, గూడెం ముసలాళ్ళతో దొర దగ్గరికి పొయ్యి కాళ్ళమీదపడి తప్పయిందని చెంపలేసుకొమ్మన్నారు. "లేకుంటే మీరు బతికి బట్టకట్టేది కల్లరా" అన్నారు.

"అదెట్ల? తప్పు చేసింది వారైతే – తప్పు మాదని పోయి కాళ్ళ పట్టుకోవాల్నా! ఇదేం నీతి?" వీరి ప్రశ్న."

తప్పో ఒప్పో. జరిగిందేదో జరిగిపోయింది. ఆ విషయాలన్నీ ఎందుకు? తప్పుకున్నా కొద్ది పెంకరేగ్గే పెళ్ళుతయ్ పంచాయితి తెగన్నంటే ఇదొక్కటే మార్గం. కాదంటే బతికే చప్పుకులేదు మికేలాదు మాహాలేదు. మీరు ఈ ఊరిన ఉంటలో ఊమతరా మీ యిష్టం. మాకేంది పదుము"

గూడెం ముసలోళ్ళ కిద్దరికి ఆ మాటలు నిజమనిపించినయ్. వారి ముందు వంగి నడవటంతో వీళ్ళ నడుములు వంగినై. ఇప్పుడు దినాలు లెక్కిస్తూ కాటి కోసం ఎదురు చూస్తున్నవాళ్ళు. వాళ్ళకు తమపిల్లలు ఎట్లా

గైనా బతికి బాగుపడాలని ఉంది. కాని పంతాలకు పోయి పాడుకావాలని లేదు.

రాజుకు ఈ మాట చెప్తే వినడు. ఆ మాటలు అన్నవాన్ని విన్న వాన్నీ నాలుగు దులుపందే విడువడు. అందుకని రాజమ్మ తండ్రిని పిలిచి నెమ్మదిగా విషయమంతా వినిపించారు. గ్రామ పెద్దల ముందే అడిగారు. రాజమ్మ అన్న వీరమల్లు నిజంగా భీముడు. తండ్రితో వాళ్ళన్న మాటలన్నీ వెంటఉండి విన్నాడు.

"సరెనయ్యా అట్లనే అంటం పోండి." అన్నాడు.

గ్రామ పెద్దలు తమ యుక్తి పారినందుకు సంతోషంతో వెళ్ళి దొరతో చెప్పారు.

మీసం మీద చెయ్యి వేసుకున్నాడు దొర వాళ్లు తెచ్చిన వార్తవిని.

వీరమల్లు తండ్రితోపాటు చేర వచ్చినాడక్కడికి. దొరలో మరింత దర్జా చోటు చేసుకుంది. కొదమ సింగంలా తండ్రి ప్రక్క నిలబడ్డాడు దొర బాబు.

"ఏందిరా ఎందుకో వ సిరి?"

"ఎందుకు వచ్చింది తమరికి తెలువదా." ముసలి వాడన్నాడు?

"మిరచ్చింది నాకేమెరుకరా. ఏమొ గమ్మత్తిగ మాట్లాడుత వేంరో?" దొర నవ్వుతూ అన్నాడు.

"గమ్మతే మల్ల, నీ కొడుకు మాయింటి ఆడిమనిషిని గుంజుతడు. మీదికెల్లి మీరే తిరుగబడుతరు. గుడిసెలు కాలి జెయ్యమంటరు, లేకుంటే బాగుండదంటరు. కాకుంటే అచ్చి కాల్లు పట్టుకొమ్మంటరు. గమ్మతి కాదా మల్ల?"

"ఎవలన్నరా అవన్నీ?"

"ఆల్లను నీ ప్రక్కపొన్న కూసునోల్లను అడుగయ్యా ఎవల న్నరో?"

దొర అటు చూశాడు, నేనన మన్నానని చెప్పారా కొంపదీసి? అన్నట్లుగా.

"దొర కామరా, మేమే అన్నం, తప్పా? ఏమొ ఎట్లనో మాట్లాడు తున్నవ్? ఆయ్!" పోలీసు పటేలన్నాడు.-

"పెద్దాచిన్నా, గురీ మర్యాద చూసి మాట్లాడుతే మంచయిద్దరా వార్కి. "

"ధర్మ ప్రభువులు మన దొరవారు చుట్టు నాలుగూళ్ళకు వారిపేరె ళ్ళంది. అటువంటి వారిని నిందిస్తే రౌరవాది నరకమేగతి."

"యేందయ్యా యెమ్మె లావు సుద్దులు చెప్తన్నరు." వీరమల్లు అడిగాడు.

"దొర కొడుకు మీద చెయ్యిచేసుకుంటార్రా వారీ?" సర్పంచ్ అన్నాడు.

"చెయ్యి చేసుకునుడా ! ఇంకా యెక్కడికక్కడికి నరుకుడా నీ యమ్మ ! నా సెల్లెమీద చెయ్యేసుటానికి ఎన్ని గుండెలు! అదే మొగడు దేశంబోతే సీతమ్మ వారోలె పచ్చిలె బతుకుతాంది. ఆనికి అక్కా సెల్లెండ్లు లేరా ? అని అమ్మను ఎవడన్న గుంజితె ఊకుంటడా ? దొరట బెదిరిత్త న్నడట యీల్లేమొ దర్మరాజులోలె అచ్చి సుద్దులు జెప్తన్నరు.

పోంగ్రహి, ఏం జేసుకుంటరో చేసుకో పోంగ్రి. ఎవడ్రా మీకు బెదరేది ? నీయమ్మ పెత్తనాలకు నా పారేత్తె ! మేమేం గాజులు తొడుక్కోని లేం. పాయె అయ్యా పా."

పులి! పులివలె వీరమల్లు వెలువలికి పోతుంటే పిల్లులె చూస్తున్నారు వాళ్ళు, దొర ముఖం వెల వెల బోయింది. దొర కొడుకు నిశ్చేష్టితుడైనాడు.

గ్రామ పెద్దల ముఖాల్లో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. వంచిన తలలెత్తకుండా దొర ముఖం వైపు చూడకుండా మెల్లగా లేచి బయటకు జారుకున్నారు.

# 23

"అన్యాయపు ముండాకొడుకులు" ఇంట్లోకి చేరుటనే నిట్టూరుస్తూ అన్నాడు రామానుజయ్య.

"ఎవరు వాళ్ళు - మీరా?" పెద్దకొడుకు ఇంటిలోపలినుంచి అరుగు మీదికి వస్తూ అన్నాడు.

"మీ మెందుకైతాంరా?"

"రాయబారం వెళ్ళినందుకు."

"ఎవరు ?"

"దుష్టచతుష్టయం."

"ఎవర్రా దుష్ట చతుష్టయం ? పనీ పాటా లేక బలాదూరుగా తిని తిరిగేదిగోగా."

"పనీ పాటా లేక తిరిగింది మేలు మీవంటి వంకర టింకర పనులు చేసిందానికంటే."

"నోరు మూసుకోరా అప్రాచ్యుడా!"

"నేను ప్రాచ్యుడనే."

"చాలు తియ్యవోయ్" అంటూ లోపలికి వెళ్ళాడు రామానుజయ్య. ముసి ముసి నవ్వులతో చూస్తున్నాడు రంగనాథ్. రామానుజయ్యగారికి ఎదురుగా వచ్చింది భార్య అనసూయమ్మ.

"ఏమిటండీ ?"

"ఒక గ్లాసెడు మంచి తీర్థం తీసుకురా-"

ఆమె వంట గదికి వెళ్ళి తళతళ మెరిసే ఇత్తడి చెంబూ గ్లాసుతో వచ్చింది. నీళ్ళ గ్లాసు భర్త చేతి కిచ్చింది. అతడు త్రాగుతుంటే తిరిగి కావాలంటే నీరు వంచడానికి చెంబు పట్టుకొని సిద్ధంగా ఉంది. రెండు కాదు మూడు గ్లాసుల నీళ్ళు తాగి అక్కడే ఉన్న ఉయ్యాల మంచంలో కూచుని ముఖానికి పట్టిన చెమట పై పంచెతో తుడుచుకుంటున్నాడు.

"ఏం జరిగింది ?"

"కలికాలం."

"ఏం జరిగిందంటే చెప్పరేమయ్యా ?"

"ఎన్ని తిట్లు ?" భర్త విచారం.

"ఎవరిని?" భార్య ప్రశ్న.

"దొర వారిని !"

"మిమ్మల్లనో?" గోడచాటుకు కొడుకన్నాడు.

ఆ మాటకు ఉడుక్కున్నా ఏం అనలేదు ఆచారి.

"ఏవరయ్యా తిట్టింది ?" అనసూయమ్మ మళ్ళీ అడిగింది.

"మాలకాకులు."

"ఆ !" అనసూయమ్మ ఆశ్చర్యపడింది.

"తిట్టిన వదిలిత్రను కాని గట్టిగా తన్నినుండిరి" కొడుకన్నాడు.

"ఎవలనురా?"

"అందరినీ."

"అంటే ఎవర్ని ?"

"మీ దొర వారిని, వారి పుత్రరత్నాన్ని, వారికి సైడిచ్చే మిమ్మల నందరినీ."

"హరినీ దుంపదెగ ! ఎంతకు తెగించినవ్‌రా! నోటి కొచ్చినంత కూస్తున్నవ్ కదరా?"

"ఎందుకు బాబూ ! అట్లా నాన్నగారిని బాధిస్తవ్?" అనసూయమ్మ సుతున్ని వారించింది.

"బాధించుతూ లేనమ్మా నీతిని బోధిస్తున్న."

"బోధించు తావోయ్ వినేవాళ్ళుంటే. నీకేం నీతిశాస్త్రకారునివి."

"మీ వంటి అవినీతి పరున్ని మాత్రం కాను."

"ఊరుకున్నా కొద్ది మరో మాటంటున్నవ్-ఏమిరా నీ ఉద్దేశం?"

"ఏమిటి నాయనా ఊరుకో. బయటికి పద." తల్లి కొడుకును తీసుకెళ్ళింది.

"నాయనా అట నాయన. అడ్డమైన ముండాకొడుకు."

"ఇదుగో ముండాకొడుకంటే యేమన్నట్టు?" అసహ్యంతో అడిగింది అనసూయమ్మ కొలాపి.

"నేను చచ్చినాక నువ్వు వాన్ని కన్నట్టు" అసహనంగా జవాబిచ్చాడు రామానుజయ్య.

"మీ నోరు పడిపోను. ఎంత మాటంటిరి!"

"అనుడే కాదు. ఇట్లానే అయితే ఇంకా నాల్గుదినాల్లో నీ కొడుకు కారణంగా నేను చచ్చేది ఖాయం."

"అదే మంచిది ఉండి మందిని చంపేదాని కన్నా" ఉడికించాడు రంగనాథ్.

"విన్నావమ్మా నీ పుత్రుని మాట?"

"అట్లాగనకు కొడుకా. నాకీ పసుపు కుంకుమ ఉండనీ" ప్రాధేయ పడింది.

"అంటే నీ పసుపు కుంకుమ అలంకారానికి తప్ప నేనెందుకు పనికి రాని వాణ్ణన్నమాట! నేను చచ్చినా పర్వాలేదన్న మాట!"

"ఏమోనమ్మ. ఈ విపరీతార్థాలు నాకు తెలువవ్" విసుక్కుందామె.

"మీరనే మాటలు సలక్షణంగానే ఉన్నయ్‌కాని నావే విపరీతార్థాలా?"

"చావుమనగానే ఎవరూ చనిపోరు నాన్నగారూ. చావాలంటే ఒకటి, చావు రావాలి. రెండు, ఎవరైనా చంపాలి."

"ఎవరోకాదురా నన్ను చంపేది నువ్వే. నాకు తెలుసురా నువ్వంత పనిచేసవని."

"నేను కాదు చేసేది. మీ వ్యవహారం ఇట్లా నేఉంటే ఎవరో అంత పనీ చేసేది మాత్రం ఖాయం."

"చంపనీ, ఎలా రాసుంటే అలా జరుగుతుంది"

"ఎలా చేసుకుంటే అలా జరుగుతుందనండి."

"ఏమిటి బాబూ చేసుకుంది? అట్లాగనకు. నాన్నగారికి ఎదురు తిరిగి మాట్లాడొచ్చునా? తప్పు." తల్లి అంది.

"తప్పు! వీరు దొరగారికి మద్దతుగా వాళ్ళనెంత బాధపెట్టినా తప్పు కాదు."

"ఎవర్నిరా బాధపెట్టింది?"

"ఆ మాల యెధవల దిక్కు మాట్లాడుతున్నడమ్మా నీ సుపుత్రుడు. వాళ్ళల్లో కలిసి పోతాడేమో."

"కలిస్తేయేం. మంచియన్నది మాలయైతే మాలనేయౌదున్ అన లేదూ మహాకవి?"

"ఎవడో అన్నది అంట్ల వెధవ."

"కాదు. మన అగ్రజాతివాడే. గురజాడ."

"ఏజాడగాడో."

"మన జ్ఞానాన్ని బట్టికదా ఎవరైవారు అర్థమయ్యేది."

"ఊ ఇంకా?"

“మన జ్ఞానాన్నిబట్టి ఎదుటివారిని అంచనావేసేది.”

“పోరా ఫో. ఆ అంటరానివాళ్ళలోనే కలిసిపో.”

“అందుకు నాకేం విచారంలేదుకాని, అంటరానివాళ్ళంటే మాత్రం ఆరుమాసాలు మీకు శ్రీకృష్ణజన్మస్థానం సంప్రాప్తమౌతుందని విచారిస్తున్న.”

“కానీరా. అంటరానివాళ్ళుకారు వాళ్ళు హరిజనులు. దేవుని బిడ్డలు.”

“అందరిమూ మనుష్యులమే అని గుర్తించుకుంటే చాలు.”

“అవున్రా నువ్వూ వాళ్ళతోనే కలిసిపో. ఆ రాజుగాడికో చెల్లె ఉందేమో. ఆ తలమాసిందాన్నే పెళ్ళిచేసుకోపోరా.”

“మంచి సూచన. నాకింతవరకు ఆ ఆలోచనే రాలేదు, కాని ఇక ఆలోచించాలి.”

“చేసుకోపోరా.”

“ఏం మాటలండీ అవి?” అనసూయ అంది.

“చేసుకుంటే తప్పా. మల్లి కూడా బాగానే ఉంది. శుభ్రంగా ఉంటుదిప్పుడు. చదువుకుంటున్నది కూడా.”

“వర్ణభ్రష్టపు గాడిదకొడుకు.”

“గాడిద యెవడన్నట్టు?” అనసూయ అడిగింది.

“నీ మొగడు.”

“వశిష్టుడు అరుంధతిని చేసుకోగాలేంది నాకెక్కడిదినాన్న దోషం?”

“నువ్వు అంతకు గరిష్ఠుడివి.”

“అవునుమరి.”

# 24

దేశంలో సాధారణంగా కనిపిస్తున్న ప్రగతి చిహ్నాలు ఆ గ్రామంలో సైతం ఒకటో అరో కనిపించకపోలేదు. రోడ్డు సౌకర్యం ఏర్పడింది ఆ వూరికి తర్వాతి ఊరివాళ్ళ ప్రయత్నం కారణంగానైనా. హరిజనవాడలనీ ఒకటి యేర్పడింది. హరిజనులకు గ్రామకంఠంలో ఇండ్లను కేటాయించాలి

అనే సర్వోదయ నాయకుల అభ్యర్థనతో ఏర్పడిన ఆ కాలనీ సైతం ఇప్పటి గూడెం ప్రక్కనే నిర్మితమైంది.

కాలనీలోనివన్నీ చిన్నచిన్న ఇళ్లు. ఆ చిన్న ఇండ్లకే వేల రూపా యల వ్యయం ప్రభుత్వానికి అవుతుండె. కంట్రాక్టర్లు, ఇంజినీర్లు ఇంకా ఇంకా ఇతరులు వాటాలు పంచుకోగా మిగిలిన మొత్తాలతో నిర్మింపబడిన గృహాలు ఎంత పెద్దగా ఉంటాయి! ఎంత గట్టిగా ఉంటాయి!

రాజు యాజమాన్యంలో అ పూరిన హరిజన సంఘం ఒకటి చక్కగా యేర్పడింది. అందులో శ్రామిక జనమంతా స్త్రీ పురుష వివక్ష లేకుండా సభ్యులు. అనుభవజ్ఞులైన పెద్దలు సలహాదారులు. ఉత్సాహపరులైన యువతీ యువకులు కార్యనిర్వాహక సభ్యులు.

సంస్థ సభ్యులు సమాజంనుంచి స్వార్థంకోసం ఏ ప్రయోజనాన్నీ ఆశించకూడదు. సమాజ అభివృద్ధిని మాత్రం సమిష్టి కృషి ద్వారా సాధిం చాలి. నీ నా అనే వంతులు లేకుండా అందరూ అహమహమికతో సమాజ సేవకై పూనుకోవాలి.

వాళ్ళు మొదట సాధింప పూనుకుంది పరిశుభ్రత. అందుకు కావ ల్సింది మంచినీరు. సమితివారి డబ్బు శాంక్షన్ కోసం ఎదురు చూడకుండా ఒక బావి తవ్వుకున్నారు. సిమెంట్ పనికై అటు బ్లాకుకు అభ్యర్థన పత్రం పంపి ఇటు బావిచుట్టు తాత్కాలికంగా మట్టిగోడలు లేపారు. నాలుగు గిల కలబావి నడిగూడెంలో సౌకర్యంగా ఉంది. మునుపు నీటికోసం అప్పుడ ప్పుడు ఏటివరకూ వెళ్ళిన సందర్భాలున్నయ్. వారి గూడెంలో ఒకటో రెండో ఉన్న చేదబావు లెండిపోతే, ఊరిలో మంచినీటి బావులున్నా వీరిని రానివ్వరు. అంటు ముట్టుళ్ళ పట్టింపులుంటవి. వీళ్ళు బావి తవ్వినప్పుడు లేని ముట్టుడు ఆ బావినీరు చేదుకోబోతే వస్తుంది. బావి తవ్వకం ముగిసిం తర్వాత అందులోని నీరంతా జలకడిగి వేదమూర్తులైన బ్రాహ్మణోత్త ములచేత పుణ్యాహవాచనం చేయించుతారు.

చెత్త చెదారం ప్రత్యేకమైన గుంటల్లో పోయడం, మురుగునీటి కాల్వలు చక్కగా పారేటట్లు ఏర్పాటు చేసుకోవటం వారు చేసుకున్న మరో సత్కార్యం.

ఊడ్చుట కసవు కుప్పలెత్తి పోసుట మొదలగు విషయాలు ఇంటింటికి వెళ్ళి వివరించి శ్రద్ధగా మెదిలేట్లు చేస్తున్నారు. ఎక్కడ అపరిశుభ్రంగా కనిపించినా సంఘ కార్యవర్గ సభ్యులు స్వయంగా శుభ్రపరుస్తున్నారు. హృదయపూర్వకంగా తమ బాధ్యతగా నిర్వహిస్తున్న సేవా కార్యక్రమం అది. వీళ్ళనుచూసి అశ్రద్ధగా ఉండేవాళ్ళు కూడా పరిశుభ్రత విషయంలో జాగ్రత్త వహిస్తున్నారు.

అన్నిటికంటే ముఖ్యమైన విషయం మరుగుదొడ్ల నిర్మాణం. మన దేశంలో ఈ విషయంలో అన్ని రాష్ట్రాలలోనూ అశ్రద్ధ కనిపిస్తున్నది.

అందుకే స్థలమున్నవాళ్ళు ఇళ్ళవెనుక స్థలాల్లో మిగతావారికి గ్రామ బాహ్య ప్రదేశాల్లో నవీన పద్ధతుల్లో తక్కువ ఖర్చుతో ప్రత్యేకరకమైన మరుగుదొడ్లు నిర్మించుకున్నారు. దీనితో వాళ్ళ జీవిత విధానమే మారింది.

పల్లెకు క్రొత్త అందం చేరింది. అందం శుభ్రతవల్ల వస్తుంది. శుభ్రత శ్రద్ధ వల్ల సమకూరుతుంది. అది సామూహికంగా శ్రమించితే సత్వరంగా సక్రమంగా సాధించుకోగలం.

స్నానాల విషయంలోను, ఉన్న దుస్తుల శుభ్రత విషయంలోనూ గణనీయమైన మార్పు వచ్చింది.

పిల్లలు గ్రామ పాఠశాలకు వెళ్తున్నారు. వచ్చేయేడు ఆరవతరగతి ప్రారంభించే సూచన వచ్చింది. పల్లెలో ఒక రాత్రి బడి యేర్పాటయింది. ఉత్సాహపరులైన గ్రామ యువకులు ఆ పల్లెలోని వారికేకాక ఊరినుండి వచ్చే వయోజనులకందరికీ అక్షరాస్యతతోపాటు అవసరమైన అన్ని విషయల్లో ప్రాథమిక పరిజ్ఞానం కలిగే విధంగా విద్యాబోధన కావిస్తున్నారు.

మాసాల్లోనే ఎంతో మార్పు కనిపించుతున్నది. ఏండ్లు గడిస్తే ఈ పట్టుదల ఇలాగే సాగితే ఎంత మార్పో, ఏ ప్రభుత్వం ఏ నాయకులు ఏ సేవాసంస్థలు చేయలేని సేవ, సాధించలేని ప్రగతి, ఆ పల్లెవాళ్ళు స్వయంగా సాధించుకోగల్గుతున్నారు.

రాజు తన మిత్రులతోపాటు నిరంతరం కృషిచేసి సాధించిన విజయాలు పల్లె వీధుల్లోకన్న పల్లెవారి మనస్సులో పెద్ద మార్పును తెచ్చిపెట్టేయి.

ఆ విజయాలు తమవిగానే వర్ణిస్తూ వారం వారం ఓ మంత్రో, ఓ ఆఫీసరో ఓనాయకుడో పల్లెవాళ్ళని ప్రశంసించిపోతూండడంకూడాపల్లెవాళ్ళ, మనస్సుల్లో పెద్దమార్పు తెచ్చింది. ఇదివరకు అసహ్యంఅనిపించని పనులు ఇప్పుడుఇష్టం కావడంలేదు. ఇష్టంగానే తిన్నవి ఇప్పుడు అసహ్యం అనిపించసాగేయి.

పల్లె ఆలోచనలలోనే మార్పు వచ్చింది.

# 25

సాధారణంగా తెలంగాణాలో దీపావళికి ఆంధ్రలో సంక్రాంతికి కొత్త అల్లుండ్రను తీసుకువచ్చి విందు భోజనాలు, కొత్త బట్టలు, కట్నం కానుకలతో సత్కరించి పంపిస్తుంటారు. దీపావళికి ముందే సునందను అల్లునితోపాటు తమింటికి తీసుకువచ్చారు మాధవరావుగారు.

సునంద తన నూతన జీవితానికి అలవడి పోయింది. ఎందులో కొరతలేకపోయినా ఏదోలోపం జరిగినట్లే ఆమె బాధపడసాగింది. అయినా ఆమె జీవితం సాఫీగానే గడిచిపోతున్నది.

అల్లుడు వచ్చినాడని ఏకంగా ఒక గొర్రెపోతునే కోయించారు దొర. వేపిన మాంసం రెండు మూడు రోజులువాడవచ్చు షోరువా మాంసం ఒక్కరోజే బాగుంటుంది. మరునాడు తినరు. అందుకు కోళ్ళున్నాయికదా. స్వతంత్రానికి పూర్వంలోనైతే ఊళ్ళోని చిల్లర మల్లర వాళ్ళంతా దొరకు ఏటా ఇంటికి రెండు కోళ్ళు ఇచ్చుకోవల్సి వచ్చేది. ఇప్పుడంత నిబంధన లేదు. అడపా దడపా అందుతుంటాయి. వాళ్ళే కొట్టంలో కోళ్ళను పెంచు తున్నారు. కొన్ని తల్లి కోళ్ళను మందికి పెంచడానికిచ్చారు. పెరిగింతర్వాత వీళ్ళకు పిల్లలు సగం వస్తాయి.

అన్నీ బాగానే ఉన్నాయికాని, అల్లుడు వేంచేసిన వేళా విశేష మేమిటో కాని, దొరగారి పాడి బర్రెలో ఒకటి చనిపోయింది. అందుకు పేదవాళ్ళయితే అబో దిబో మనేవాళ్లు. పాడి పశువులు కాదుకదా పనిమను

షలు చచ్చినా పెద్దింటివాళ్లు పెద్దగా పట్టించుకోరు. అది మామూలు విషయమే. వాళ్ళ దైనందిన వ్యవహారాలు యథావిధిగా సాగిపోతూనే ఉంటాయి.

యమమహిషంవలె దొర మహిషం గేటుకెదురుగా పందిట్లో పడిఉంది. సుంకరి వాడు దొరగారి హుకుం వింటేనే చర్మకారుల గూడానికి పరుగెత్తాడు.

నాడయితే జీహుజూర్ అని గూడెం మనుషులు వచ్చి పొడగాటి వాసాలకు పశువుకాళ్ళను గుదిగుచ్చి కట్టి నలుగురు మనుష్యులు రెండు వాసాలు నాలుగు కొసలను భుజాలపై ఉంచుకొని మోస్తూ వెళ్ళేవారు. బరువైతే భుజాల మార్పిడి కోసం మరికొందరు ప్రక్కగా నడిచేవాళ్ళు. తల పెద్ద నెరపమీసాలు, భుజంపై పాత గొంగడి, పెద్దచేతి కర్రతో వాళ్ళ వెంట వెళ్ళేవాడు. ఊరిబయట ఈదుల ప్రక్క పరువు బండమీద ఆ మృత పశువు చర్మం వొలచి మాంసంకోసి బొమికెలు పారవేసేవారు. ఆ మాంసం వండుకు తినేవారు.

వీళ్ళ పశువును కోస్తున్నంత సేపు బక్కకుక్కలక్కడ కాపలా ఉండేవి. వీళ్లు కదలగానే అవి ఎముకలపై పడేవి కొట్లాడుకుంటూ. ఎట్లా పసికట్ట గలిగేవో కాని ఏనాడు ఊరి దరిదాపుల్లో కనిపించని రాబందులు ఆనాడు అడవి ప్రాంతం నుంచి గుంపులు గుంపులుగా వచ్చి వ్రాలేవి. వాటికి కుక్కలకు పోటీ. అది భయానక జుగుప్సావహ దృశ్యం. అది గతం. ప్రస్తుతం గూడెం వ్యవహారం చాల మారింది.

చచ్చిన జంతువుల మాంసం చెడిపోయి ఉంటుందని ఆ కుళ్ళ మాంసం తింటే రోగాలు వస్తాయని చెప్పి మాంసం వాడకాన్ని మాన్పించ గలిగాడు రాజు.

తురకలు ఇంగ్లీషోల్లు గొడ్డు మాంసం తింటారు కదా అనే ప్రస్తావన వచ్చింది. వాళ్ళు తినేది ఆరోగ్యవంతమైన పసులను. ఇష్టమై జీర్ణించుకో గలిగితే ఏ రకమైన జంతువుల మాంసం తిన్నా తప్పులేదు.

"అబ్బో ! మంచి గున్న గొడ్ల దర మామూలుగున్నాది. యెవ్వసాయానికే ఎయిబపోసి కొనబట్టిరి ఒక్కొక్క యెద్దును. తినటాని కత్తాయింకా" అన్నాడో వృద్ధుడు రాజు మాటలకు.

"మంచి మంచి కోడెల ఆవుల కోత్తన్నరట తినేటోల్లు. అందు కనే గొడ్డింత పిరమైనయి" అని ఒకరనే సరికి–

"గాటిని కొందరు తినపడి రెగని లాకపోతే అందరు గొర్రె మ్యాకలే కావన్నంటే ఇంకా అగ్గారి పొయ్యేది." ఇంకోకాయనన్నాడు.

గ్రామంలో వారికి గూడెం వాళ్ళలో వస్తున్న మార్పులు ఏవో పిల్లలాటగా నవ్వుకునేందుకు సాయపడ్డాయి. శుభ్రంగా ఉతుక్కోబోతే గుడ్డలకి చిరుగులు మరింతగా కనిపిస్తున్నాయి. నాగరికమైన మాటలు నేర్చిన కొద్దీ అలవాటుగా వస్తుండిన బూతుపూత పదాలు వికారంగా కనిపిస్తున్నాయి. ఎంగిలిదో పాసినదో తినకూడదనుకుంటే తినగలిగేవే తగ్గిపోతున్నాయి.

అయినా రాజు జంకలేదు. ఓ చవక దుకాణం తెరిపించేడు. దానిలో రోజూ నియ్యం వారికేందుకు తహశీల్దారు కచేరీచుట్టూ తిరిగేడు. కలక్టరును కలుసుకున్నాడు. మిల్లులవాళ్ళని మంచి చేసుకున్నాడు.

ఎంతశ్రమైనా వాళ్ళని ఒక్కమాట మీదకు తెచ్చాడు. అదీ వేళ పీక పట్టుకుందని దొర తెల్లబోయేము.

రాజు నిరంతరం బోధించి, వాదించి, చెప్పించి మొత్తంమీద ఆ గూడెం వారిని మృత పశు మాంసం తినకుండా చేయగలిగాడు. అదీవేళ దొరగారికి సమస్య అయింది.

దొరగారి దగ్గరికి తిరిగి వెళ్ళిన సుంకరి "రామన్నారు దొరా" అన్నాడు. ఆ మాట వారికి అవమానకరంగా తోచింది. అల్లుని ముందు వినేసరికి మరీ తల తీసినట్లయింది.

పోలీసు పటేలును పిలిచి చెప్తే వెళ్ళి ఉత్తగనే తిరిగి వచ్చాడు.

"వాళ్ళు వింటూ లేరండీ నా మాట," అన్నాడు.

"ఏమిటట ?"

"వాళ్ళు చచ్చిన పశువులను ముట్టుకోరట."

"మాయింటనేనా, ఊరంతటనా ?" దొర స్వాభిమానాన్ని వదలి అడిగాడు.

"ఇప్పుడైతే ఇక్కడ. మిగితా చోట్లా ఇప్పుడెట్లా తెలుస్తది ?"

"ఇదేం పొయ్యేకాలం !" అన్నాడు అక్కడికి వచ్చిన ఆచారి.

"ఏదీ మీరు వెళ్ళిరండి అయ్యగారూ," అని దొర ఆదేశించేసరికి అటు హరిజన గూడానికి బయల్దేరాడు హరి భక్తుడు!

నాకంటే మొనగాడివా అన్నట్టు పటేలు అటు చూశాడు.

ఆచార్యుల వారిని రాజు సాదరంగా ఆహ్వానించాడు. ఓ చెట్టుక్రింద బండమీద ఆచారి, చెట్టు వేరుమీద రాజు కూర్చున్నారు. చిరునవ్వుతో సంభాషణ కుపక్రమించాడు రామానుజయ్య. అక్కడ వారిద్దరినిచూసిన మరికొందరు గూడెం మనుష్యులు వచ్చి అక్కడ నిలబడి వాళ్ళ మాటలు వినసాగారు.

"దొరింటి బర్రె చచ్చింది."

"తెల్సింది."

"ఏమో అన్నరని విన్న."

"నిజమే."

"మీరు కాకుంటే యెవరు చేస్తరు బిడ్డా ఆ పని?

"ఎవరైనా చేసుక్రోవచ్చు."

"కులవృత్తులు ఎన్ని వేలేండ్ల క్రితమో ఏర్పడినవి. ఇప్పుడు వాటిని కాదంటే తప్పు. పూర్వంలో రాజులు వర్ణాశ్రమ ధర్మాలు సక్రమంగా పాలించేవారు."

"మేము ఆ ధర్మాలకు విలువీయ తలచుకోలేము."

"అట్లాగైతే సమాజం పాడైపోతది."

"మీరనేది ఏ సమాజమో మాకు తెలువదు, అయ్యగారూ! మీ బాగు కోసం మీరు చూసుకుంటున్నారు. మా బాగు కోసం మేం చూసుకోవాలి."

"ఈ కుమ్ములాట ఎక్కడివరకు ?"

"మీరు మారే వరకు."

"ఊఁ" అని కొంతసేపు మౌనం వహించి తిరిగి అయ్యగారు "ఈ పశువుల కోతవల్ల మీకు ఆదాయం వస్తుందికదా. కాదంటే నష్టంరాదూ?" అన్నాడు.

"ఆ పనేదో మీరే చేసుకుని ఆ లాభం మీరే పొందరాదా?"

"కోపం వచ్చినా అసహ్యం కలిగినా నిగ్రహించుకుని రాజుతో "మీరు పేదోళ్ళు కదా?" అన్నాడు రామానుజయ్య.

"అయితే అందుకు ఎంతగానైనా కష్టపడి నాలుగు రూపాయలు ఎక్కువగా సంపాదించుకుని మా పేదరికాన్ని పోగొట్టుకునే ప్రయత్నం చేస్తాం. కాని, ఎంత డబ్బు వచ్చేదయినా మా గౌరవాన్ని దెబ్బతీసేది, మమ్మల్ని సమాజం నుంచి వేరుపరచేది అయిన ఏ పనీ చేయం." డా॥ అంబేద్కర్ సిద్ధాంతాన్ని ఒప్పగించాడు.

ఆలోచన పాలైనాడు అయ్యగారు. చివరగా "అది మీ కిష్టమైతే అట్లాగనే కానిస్తురు. కాని ఈ దినం దొరవారింటి గేదెను మాత్రం తీసుకొచ్చుకోండి."

"దొరగారింటి ఈ పని కాదుకదా ఏ పనీ మేం చేయదలచుకోలేదు. మీకు తెలుసుకదా మావాళ్ళెవరూ దొరకమతంలో పాలేరుతనంలో లేరని."

"తెలుసు."

అపజయంతో తిరిగి వచ్చిన అయ్యగారిని చూసి వీధిలోనే ఫక్కున నవ్వాడు వచ్చేలు. ఆచారి సిగ్గుచచ్చి దొరముందు తలవంచుకుని తన అసమర్థతను ఒప్పుకున్నాడు.

ముస్లిం కటికివాన్ని పిలువ పంపితే "మేం చచ్చిన వాటిని ముట్టుకోం" అని జవాబు పంపాడు.

"పకూరోళ్ళను పిలుద్దాం కాని, దీన్నయితే గుంజి యింటెనుక పడెయ్యండిరా" అన్నాడు దొర పాలేళ్ళతో.

ప్రొద్దటికి మాపటికి ఉబ్బిందది. ఏనుగుగున్నవలె పడి ఉంది ఇంటి వెనుగా. గునుస్తూ దాన్ని లాక్కుపెళ్ళారు పాలేళ్ళు. అది లాగబడినంత దూరం నేల పొక్కులయింది. దాని చర్మం గీచుకుపోయిన గులకరాళ్ళకు రక్తం మరకలయింది.

పగటి భోజనంలోని మాంసం ముక్కలు గుర్తుకు వచ్చి కడుపు తిప్పినట్లయి అటువైపునుంచి చూపులు తిప్పుకొని దొరగారి అల్లుడు లోపలికి వెళ్ళి పట్టె మంచం పరుపుపై మేనువాల్చాడు. సునంద అతని రాకను గమ

నించి చదువుతున్న పుస్తకం అలాగే పేజీల మధ్య వేలునుంచి పుస్తకంతో పాటుగా వచ్చి ఆ మంచానికి తెర సర్దింది.

మగడు ఆ పగటిపూటనే మోటు సరసమాడబోతే తప్పించుకొని లోపలికి వెళ్ళింది.

దొరగారి బర్రె మాపటివరకు మరీ వాచింది. వాసనపట్టింది. "చర్మం మీరే తీసుకోండిరా నాకు ఇవ్వకున్నా మానె" అని కబురుచేసినా ఎవరు రాలేదు. ఈ వూరివారూరుకోరని బొందుగూరివాళ్ళ రాలేదు.

"దొరగారున్నరు గదా. మిమ్మెందుకు భయం?" అని వాళ్ళని పిలువ వెళ్ళిన వాళ్ళంటే –

"ఈ పనికి ఆ వూరినుంచి ఈ వూరిదాకా ఎప్పుడు చూస్తేనే మీ దొర బలమెంతో తెలుస్తుంది" అన్నారు వాళ్ళు.

వచ్చినట్టుగా తిరిగి వచ్చారు వీళ్ళు. వచ్చి దొరకేమి చెప్పలేదు. దొర వాళ్ళనేమీ అడగలేదు. విషయం పసికడితేనే "దాన్ని బండిమీద తీసుక పోయి ఏ పాత బాయి బొందలనన్నా పడెయ్యండి" అన్నాడు గట్టిగా.

ఆ ఆదేశానికి తలవంచుక వెళ్ళారు వాళ్ళు.

తవ్వేడిచ్చే యజమాని తంగెళ్ళు పీకుమన్నా కూలీలు ఒప్పుకోవాలె.

# 26

రాజమ్మ మనసు రాజుమీద పడింది.

పెండ్లయినదాన్ని గనుక వదినా అని పిలుస్తున్నాడు కాని. రాజు కంటె తాను వయసులో చిన్న అని ఆమెకు తెలుసు. ఆ విషయం నికరంగా తెలుసుకోవాలనుకుని ఒకనాడు దుర్గమ్మ నడిగింది "అత్తా నేను పెద్దనా మీ రాజా?" అని.

"ఏమే ఎందుకో ఎన్నడురాని అనుమానమొచ్చింది?" అంది దుర్గమ్మ.

"ఉత్తగనే" అంది రాజమ్మ.

"ఇద్దరు ఒక్కనాడే పుట్టిండ్లు. మాపటేళ బాయిమీన యేసరు పెట్టంగ మావోడు పుడితే, బువ్వార పెట్టంగ నువ్వు పుట్టినవే కోడలుపిల్ల. మా

యింటికొన్నుంచి మంత్రసాని రంగవ్వ కాళ్లుసేతులన్న సక్కగ కడుక్కొక మీయింటికురికిందే మీ అయ్యచ్చి పిల్లే."
"అయితే యిద్దరి వయసులు ఒక్కంటే."
"గంతేగదా."
"ఇంక నేనే సిన్న."
"ఆ. ఎందుకు కోడలా ఏమొ లావు ఇశారాల్ల పడ్డవ్?"
"ఊరికనే" అని లేచివెళ్ళింది.
తర్వాత రాజును ఒంటిగా కల్సుకుంది.
"మాయింటికి భోజనానికి రావయ్యా రాజు బావా" అంది.
"వరస మారిందేమిటి విశేషం?" నవ్వుతూ అన్నాడు.
"వరుసేడమారె. వయసు మారింది."
"వయసు మారిందా? అదెట్లా. రోజుకింత నీ వయసు తగ్గిపోతున్నదా?"
"అది కాదుగని నేను నీకంటే సిన్నదాన్నేనట."
"యెవరన్నారట."
"చెప్తగని మొదాలు భోజనానికి నడు."
"ఉహూ, నేనురాను."
"రాకుంటే నను సంపుకున్నట్టే."
"చచ్చినా రాను."
"సరే, రానంటున్నావ్ గద. అయితే మానె. ఇగనేను నీతోని మాట్లాడ. ఆ, గంతే." ఏడుపుముఖంతో అంది. ఆమె యేడిస్తే అతనికేం? అదేమిటోకాని అతని మనసు మెత్తబడింది. కత్తికంటె ఎక్కువగా కోయగల శక్తి కన్నీరుకుంది. దానిముందు కఠినురాతి గుండెలు కూడా కరిగిపోతాయి. ఆమెవెంట వెళ్ళాడు రాజు.
ఆమె అన్న కుందేలును కొట్టుకొచ్చినాడట. తిని వెళ్ళాడతడెటో. తండ్రి చాలనాళ్ళకు తృప్తిగా తిని గుడిసెముందు గడిమంచెమీద కూర్చున్నాడు చుట్టచేసుకుంటూ.
"చుట్ట తాగద్దు మామా." అంటూ రాజు పలకరించాడు.

"ఏమో అల్లుడా, మంచో సెడ్డోగని పదేండ్ల పొల్లగానప్పుడు అలు వాటైంది. ఓపూట బువ్వలేకున్న ఓర్సుకుంటగని సుట్టపోతే పానమంత తల్లడం మల్లడం అయితది. దానిమీదికే కుతిపోద్ది."

"పొగ ఒంటికి మంచిదికాదు."

"ఏమో ఊరికి దూరమైతి. కాటికి దగ్గరైతి. ఇంకేం ఏండ్లు బతుకుతాను. యాడాదో ఆర్నెల్లో అయితే కతొడిసె."

పిల్లల మనస్సులను మార్చడం సులభం, వృద్ధులతో కష్టం.

"కూర మంచిగున్నదె అయ్యా."

"కమ్మంగుందే. ఉప్పుకారం ఏసుతాసులేకుంట బరాబరి ఎంతపడ్డవో అంత పడ్డది. శాన దినాల పట్టి కూర తినాన్ననుకో. బుద్ధిదీర తిన్న బిడ్డా."

నవ్వు ముఖంతో రాజమ్మ రాజు దిక్కుచూసి రమ్మన్నట్లుగా తలూపి లోపలికి నడిచింది.

సన్నపు చెక్కపీటవేసి దానిముందు కంచుతలె పెట్టి ఇత్తడి చెంబుతో నీళ్లు పెట్టింది.

ఆ గుడిసెకున్నది ఒకటే ద్వారం. కిటికీలులేవు. గదులులేవు. వంట చేసుకునే భాగానికి తడిక అడ్డం కట్టబడి ఉంది. పొయ్యి దగ్గర గోడకు చిన్న దిడ్డి ఉంది. దానికి కిటికీ కున్నట్లుగా కట్టె ఊచలున్నయ్. గోడ ప్రక్కగా నాలుగు కుండల దొంతులు. దండెంమీద నాలుగైదు బట్టలు. అదీ ఆ కుటీర కుటుంబ వాతావరణం.

ఆ చెంబు తీసుకుని గుడిసె బయటకు వాకిట్లోకి వెళ్ళి చేయి నోరు కడుక్కుని లోపలికి వచ్చాడు రాజు. అతనికి ఆ పీటమీద కూర్చోరాలేదు. అది తీసి తండ్రి గొంగడితెచ్చి మడచివేసింది రాజమ్మ.

కుండతెచ్చి అన్నం పెట్టింది చేత్తోతీసి. పులిసిన నీళ్ళ (ఐలి)తో వండి వార్చింది. అన్నం కాస్త పుల్లగాఉన్నా పొడిపొడిగా తెల్లగా మెరుస్తున్నది. రాతెండి గిన్నెలో వండిన కూరతెచ్చి గరిటె నిండుగాతీసి అతని కంచంలో వేసింది. మరో గరిటెడు వేయబోయేసరికి "ఆగు, చాలు" అన్నాడు రాజు.

"తిను. మత్తుగుంది" అని వేసింది.

"నా కడుపులో పట్టొద్దూ ?"

"అంత సిన్నదా ఆ కడుపు ?" నవ్వి అతడేమీ అనలేదు. తింటు న్నాడు. మాంసం మంచిదిగా ఉంది. వంటకారంగా ఉంది. రుచి మామూలు గా ఉంది.

"కింద కూచున్నావేం ఆ పీట వేసుకో."

"నాకెందుకుపీట." క్రిందనే కూర్చుందామె. కోక మాసిపోతుందనే చింత ఆమెకు లేనట్టుంది. ఆడవాళ్ళు మామూలు కుటుంబాల్లో సాధారణం గా క్రిందనే కూర్చుంటారు. అది మగాళ్ళను గౌరవించడం.

మరింత కూరవేయబోతే వారించాడు.

"మంచిగలేదా ?"

"బాగుంది."

"అయితే తినవు మరి."

"తింటున్నాకద."

"అదాతినుడు. ఏరుకుంట చిన్నపిల్లగానోలె.మాఅన్నయితే నాలుగు బుక్కల్ల ఆ అన్నమంత వోడజేసును."

"కాయకష్టం చేసేవాళ్లు తింటారట్లానే."

"నువ్వేంపని చేస్తలేవులే ?"

"వాళ్ళంత చేస్తులేనుకదా."

"పసిపిల్లగానివి పాపం !"

ఆ మాటకు ఈ మాటకు సమన్వయం ఎక్కడుందో అతనికి బోధ పడలేదు.

అతనికి హాస్టల్ తిండి జ్ఞాపకానికొచ్చింది. వాళ్ళ తిండి నుంచి డబ్బు మిగిల్చుకునే వార్డెన్ స్మృతికి వచ్చాడు. ఒకనాడు అతి తెలివిని ప్రదర్శించి కుర్రాళ్ళతో చావుదెబ్బలు తిన్నాడు దుర్మార్గుడు. అప్పటికయినా అక్కడ ఓపూటకో రెండుమూడు వ్యంజనాలుండేవి.మాంసంవండిననాడు నిమ్మకాయ ముక్కలు ఉల్లిపాయలు ఉండేవి. సాంబారు, పెరుగు ఏనాడూ తప్పేవి కావు. పెద్ద హోటళ్ళలోనైతే ఎంత చక్కని వంటలు. ఇంకా తాను 'ఏ' క్లాసు హోటలుకు వెళ్ళనేలేదు.

"ఏమో సోచాయిస్తున్నవ్. తినేదుందా లేదా? నేనింకా తినిలేదు. ఆకలైతంది!"

"తినుమరి."

"బాగనే ఉంది బాగోతం. అంతకు నోసుకున్నాను." ఆమెవైపు చూశాడు రాజు. కిరోసిన్ దీపం వెల్తురులో ఆమె అపదువాల హొందిక అందంగా కనిపించింది. ముఖం నుంచి అతని చూపులు క్రిందికి జారాయి. సగానికి పైగా కొంగు జారి ఉంది. అతని చూపులు నేలపడ్డ చేపలవలె ఉక్కిరి బిక్కిరై క్రిందికి వాలినై. ఆనాడు తనను హఁపకపోయిందామె. ఆమె దృఢమైన కండరాల స్పర్శతో అదోలా అయిపోయాడు. సంపూర్ణ యౌవనంలో ఉన్నది. ఒంటరి జీవితం ఎంత కష్టం.

"అన్న ఎక్కడుంది తెలువలేదా?"

"అన్నా? వాని నాము నరుక. నష్టేటముంచిపాయె" అని కొంచెం సేపాగి "ఏమొ గటుపోయింది ధ్యాస?" అంది.

"నిన్ను చూస్తుంటే."

"ఆ సూత్తుంటే?"

"ఎట్లా విడిచిపోయిండా అని."

"అంత బాగున్నానా?"

"లేవా?"

"నాకేమెరుక."

"రాడా యిక?"

"ఏమో."

"ఎన్నాళ్ళుంటా విట్లా?"

"ఏం చేయాలె మరి?"

"పెళ్ళి చేసుకోవాలె."

"నాకు చేసుకోవన్ననే ఉంది గాని మా అయ్యకు పుట్టాలె ఆ బుద్ధి."

"అడుగాలె."

"అడుగుతా. మరి నువ్వు చేసుకుంటవా నన్ను?"

"నేనా?" ఒక్క నిమిషం ఇద్దరూ అలాగే ఆగారు.

"అన్నం పెట్టన్నా."

"వద్దు."

"చెయ్యేండి పోద్ది. ఇగో నీల్లు, కడుక్కో" అతడు లేచాడు.

అతడు వెళ్తున్నప్పుడు అతని ప్రక్కగా నడుస్తున్న రాజమ్మ "బయపడకు, నేను నిన్నేం జెయ్య. నన్ను పెండ్లి జేసుకుంటె నిన్ను దేవునోలె జూసుకుంట. తొందరేంలేదు. ఈ నాత్రంతా ఆలోసించుకొని రేపు జెప్పు. నేనిట్లడిగిన్నని నీ మనసు కస్టపెట్టుకోకు. నువ్వెట్లంటే నేనట్ల యింట" అని ఆగింది.

ముసలోడు కుక్కి మంచంలో నిద్రపోతున్నాడు.

"ఎవలె రాజూ ఆయినె?" పెద్దమ మైసమ్మ అడిగింది ప్రక్కగుడిసె ముందునుంచి.

"మా యెంకమూవోల్ల రాజు వావ."

"అంహా, నేను మా అల్లుడచ్చిండేమో అనుకున్న."

"ఇంక మొకం బెట్టుకోని యిటు మొకానత్తాడు దిక్కుమాసినోడు."

రాజు అడుగులు త్వరత్వరగా ముందుకు పడసాగాయి.

# 27

స్నేహితుడితో చెడింతర్వాత రంగనాధాచారి తరుచు పల్లెకేసి పోవడం, గూడెం కుర్రాళ్ళతో పరిచయాలు పెంచుకున్నాడు. రాజు అతనిని నెమ్మదిగా ఏ కచేరీకన్నా పోతూ వెంట తీసుకుపోవడం ప్రారంభించేడు. ఇప్పుడతడు రోజులో హెచ్చు భాగం కాలనీలోనో, వాళ్ళ పనిమీదనేనో వుంటున్నాడు.

కసితోనో, అనాలోచితంగానేనో తండ్రి అనేసిన మాట యిప్పుడు అతన్ని తరుచు రెచ్చగొడుతూంది. రాజు చెల్లెలు మల్లి బాగానే వుంటుందని ఆరోజున తండ్రిని ఉడికించడానికే అన్నాడు. కాని పరిచయం పెరిగిన కొద్దీ ఆమె చక్కగానే ఉంటుందని నమ్మకం కలిగింది. ఆమెతో పెళ్ళి ఆలోచనలు తరుచయ్యాయి.

రంగనాథ్ ఒకసారి ఒంటరిగా రాజమ్మను కలుసుకున్నాడు. కొంత దూరంనుంచే "రాజమ్మా! ఆగు నీతో మాటుంది" అన్నాడు.

అతడు దగ్గరికి వచ్చేవరకు కాలాపింది. దగ్గరికి రాగానే" ఏం మాట. మీ దొరబాబు మాట్లాడిన మాటేనా?" అంది.

"ఛ! అదికాదు" చుట్టూ చూస్తూ. "ఎవరూ లేరు మేలయింది." అన్నాడు.

ఊరికిదగ్గరే జువ్విచెట్టు క్రింద నిలబడ్డారు. ఆ ప్రక్కన్నే బండి బాటుంది. సూర్యోదయమై బారెడు ప్రొద్దెక్కింది.

"నిజంగానా, బయమై మాట మార్చుతున్నవా?"

"నిజం."

"మంచోనివి సిన్నయ్యగారూ నువ్వు."

"శాన మంచోన్ని."

"దిల్లగి జేత్తున్నవ్."

"ఆ, ఇదిగో ఒక్కమాట."

"ఒక్కటి కాదు. రెండు చెప్పు యిప్పుడిగ."

"ఒక్క పని చేస్తేచాలు."

"చెప్పవయ్యా. ఏం పని చెయ్యనో్న?"

"మల్లమ్మ నొకసారి నా దగ్గరికి తీసుకురావాలె."

"ఏంది కత, మనసు పడ్డదా?"

"ఊ."

"నేను గసోంటి దాన్ని కాను. బలేవోనివయ్యా."

"నా మాటిను."

"యేందయ్యా ఇంక నీ మాటినేది ?"

"నేనామెను పెళ్ళిజేసుకుంటా."

"ఓరి నీ కైతుకాలు పాడుగాను."

"నిజంగా చెప్తున్న."

"బాపనయ్యవు మా యింటి పిల్లను లగ్గం జేసుకుంటవా ?"

"ఆ."

"అయితే రాజు నెందుకడుగలేదు?"

"మల్లమ్మ మనుసు తెలువాలికదా?"

"యేమను కుంటది. నీకేమైందయ్యా మల్లెవువ్వులోలె బట్టలు, సందమామోలె మొకం, ఎంతముద్దు గున్నవ్ !"

"ఒకవేళ తాను నన్ను చేసుకోనంటే నామాట దండుగై పోతది కదాని."

"మంచోనివే. ఇసోంటి నిన్ను అది అసలే కాదనది."

"ఎవరి మనసులేముందో యెట్లా తెలు సవి."

"సరే లేవయ్యా సోదె, బంగారమోలె కండ్ల కద్దుకుని చేసుకుంటది నిన్ను. పిల్సుడెందుకు పోదాంపా ఆల్లింటికి."

"ఇప్పుడా, వద్దు."

"ఇప్పుడింటి కాన్నే ఉన్నరందరు. నడువయ్యా దొంగేశాలెందుకు?"

రాజమ్మకు సంబరంగా ఉంది. పెళ్ళిపెద్దగా వెళ్ళి రాజుముందు పోజుపెట్టాలనుకుంది. ఇద్దరు కలిసి గూడెంలోకి వెళ్తున్నారు. నాలుగు గుడిసెలు దాటే సరికో విచిత్రం జరిగింది.

"అది ఎట్లిచ్చుక పడుతందో చూసినవా పోషక్కా! అయ్యగార్ల పిల్లగానితోటి పకపక నవ్వుకుంట పోతాంది." అంది మెల్లగా లింగమ్మ అక్కడే ఉన్న మరో స్త్రీతో.

రాజమ్మ చివ్వున వెనుకకు తిరిగి వచ్చి, "ఏమే లింగక్కా ! యేమో అంటివి ?" అంది. ఈమెకు తనమాట వినవస్తుందను కాలేదామె.

"ఈ నేనేమన్న. గోరం పాడుగాను." అంది.

"యే మనలే ?"

"యేమన్నే? కయ్య బెట్టుకోవుద్దయితున్నాదె తెల్లారక తులిగె?"

"నాకే వోరు గులగుల పెడుతాంది. పోషత్తా ఇదట యేమనలేదా?"

"యేమోనవ్వ, నాకే మెరుక యిపచారాల ముచ్చెట్లు యిచ్చెంతురాల మనుసులు, బవురూపులేశాలు," అని మూతి తిప్పుకుంటూ లోపలకెళ్ళింది పోషమ్మ.

"ఇగో లింగక్కా, మంది నాడిపోసుకుంటే మంచికాదే. నేను అసోంటి గిసోంటి దాన్ని కాను. అ? యేమనుకున్నవో? యేమన్న చెయ్య

దల్చుకున్ననాడు దొరతనంగనే సేత్తనే. దొంగతనంగ జెయ్యనీవోలె యున్నవా? నా తెరువుకత్తె మర్యాద గుండది, ఆ."

"దొంగతనంగ యేం జేసిన్నే నేను ?"

"నేను జూసినానె. నిరుడు నీ సికె వట్టి గిస్కి గిస్కి పిడిగుద్దులు ఎందుకు గుద్దిండో నీ మొగన్ని అడుగు పో."

"ఓసి నీ మీద మన్ను బొయ్యగదనే. ఎంత నోటిగామిడి దానివే!"

"బొయ్యి బుద్దయితే మన్నువొయ్యిగని ఉత్తనిందలెయ్యకు," అని నవ్వుకుంటూ వెనుకకు తిరిగింది. ఆశ్చర్యంగా ఆ మాటలు వింటూ నిలబడ్డ అయ్యగారితో "పావయ్యా." అంది.

నవ్వుతూ పలకరించి కూర్చోవటానికి, మరో మంచం వేయించాడు రాజు. రాజు మంచం మీదనే కూర్చున్నాడు రంగనాథ్.

రాజమ్మ గొప్పగా ఆ ముచ్చట చెప్పబోతే రాజు వారించాడు.

మంచినీరు కావాలన్నాడు రంగనాథ్.

చెల్లెతోనే తెప్పించాడు రాజు. మల్లి సిగ్గుపడుతూ తెచ్చిన నీటి గ్లాసును తీసుకున్నాడు రంగనాథ్. రాజమ్మ నవ్వు ముఖం పెట్టింది.

"అంత తొందరపడే విషయం కాదు ఇట్లాంటి పనులు ఆవేశంతో కావు. ఆలోచనతో సాగాలి."

"నేను తాత్కాలికావేశంతో కాదు. నిశ్చయాత్మతోనే అంటున్నా," అన్నాడు రంగనాథ్

"సరే చూద్దాం. నిజంగా మీకు మాపై అభిమానముంటే మొదట వయోజన పాఠశాలలో అధ్యాపకులుగా చేరండి. మీ పరిచయాలు పెరిగి మనసులు తెలిసి సరే అనుకుంటే మంచిదే. మేం కాదనేదేం లేదు."

"మంచిది," అంటూ లేచాడు రంగనాథ్.

రంగనాథ్‌ను సాగనంపి వెనుకకు తిరిగేసరికి రాజు ప్రక్కనేఉంది రాజమ్మ. ఆమె దెస చూసి తల వంచుకుని నడువబోయాడు.

"మన పెండ్లి మాటేమంటవ్?"

"నాకిప్పుడు పెండ్లి చేసుకోవాలని లేదు."

ఆమె మరోమాటనకుండా వెళ్ళిపోయింది.

# 28

రాములు సొంతూరికి తిరిగి వచ్చాడు పారిపోయిన రెండు మూడేళ్ళకు. మనిషి కొంత వయసు పెరిగినట్లు కన్పించినా బస్తీ నాజూకు తనం కొంత నేర్చుకున్నట్లున్నాడు.

ఊళ్ళోకి ప్రవేశిస్తేనే ఎదురుగా కన్పించింది శెట్టిగారిల్లు. ఆ యింటిని చూసేసరికి అతనిలో ఆవేశం పెరిగింది. అదే అతనికి ఆనంద విషాదాల నందించింది.

ఆ యింటి ముందుకు వెళ్ళేసరికి, పెద్ది నాగన్న పెండ్లాంతో లెక్కలు పడుతున్నాడు. ఆ లెక్కలేమిటంటే తాను భార్యతోపాటుగా తన బావమరిది యొక్క బావమరిది పెళ్ళికి వెళ్ళి నిన్నటిరోజే వచ్చినాడు. అయిన ఖర్చుకు వచ్చిన కట్నానికి పేరీజువేసి చూసి అక్కడికక్కడికి లాభంలేదు నష్టం లేదు అని తృప్తిపడుతున్నాడు.

ఇంతలోకే వాకిట్లో కొత్త మనిషిని చూసి కంగారుపడ్డాడు. రాములు అట్లాగే వీధి గద్దె ప్రక్క తొక్కుడు బండ మీద ఒక కాలుపెట్టి కొంత వంగి నిలబడ్డాడు. బూడిదరంగు లాగు, నలుపు తెలుపురంగు గళ్ళచొక్కా తొడిగి ఉడుత చారల మఫ్లర్ మెడకు చుట్టుకున్నాడు. పుక్కిట ఆకు, పెదవుల మధ్య సిగరెట్, చెదరిన క్రాఫుతో అటే చూస్తున్నాడు.

"నాయనోయ్ వచ్చిండు." అని కేకేసి లోపలికి ఉరికాడు నాగన్న. నాగన్న భార్య మెడహారాలు, జడ పువ్వు, చెవుల కమ్మలు, ఒకసారి తడిమి చూసుకుని లేచి దుకాణంగది లోపలి ద్వారం కడప పై నిలబడిచూస్తున్నది.

"ఎవర్లా వచ్చినోళ్ళు?" ఆయాసంగా లేచివస్తూ ఎదుటి మనిషిని చూసి అట్లాగే నోరు తెరిచాడు పెద్దసెట్టి. బొర్ర పైనుండి జారిన ధోతీ, జందెం, ఎర్రపంచె, బోడిగుండు, పిలక జుట్టు, అదీ అతని తీరు.

"ఎప్పుడచ్చినవ్‌రా మాయ్యా?" అన్నాడు సమయోచితయుక్తితో.

"నేను యెప్పుడత్తెందిగని నువ్వింకా సావలేదా?" అన్నాడు రాములు.

ఆతని తీరుకు ఆ మాట నిర్లక్ష్యానికి భయపడ్డా, నవ్వు తెచ్చిపెట్టు కున్న ముఖంతో "చావకుంచే ఎల్లకాలం ఉంచచ్చినమా. అందరం పొయ్యేటోల్లమే." అన్నాడు పెద్దిశెట్టి.

"మీరు ఎల్లెం బోతారు. ఎందరి పానాలు పోతే మీరు పొయ్యేది!"

"అందర్ని సాదెటోడు సంపెటోడు ఆ మీదోడు. ఏదో పనిలేక అనుకుంటం గని."

"మనం జేసే ఉచ్చ పనులన్నీ ఆ మీదోడే చేత్తున్నడంటవ్?"

"అది కాదుర మాయ్యా."

"ఎవడ్రా నీకయ్య. యాసమాటలంటే దవడ పండ్లూడుతయ్."

"నేనేమంటి?"

"ఏమనాలె. కన్నబిడ్డను సేతులారా సంపుకున్నది సాలదా?"

"ఎవల ఆయుసు తీరినప్పుడు వాల్లంబోతం బిడ్డా. ఏమనుకుంటే యేముంది? ఉత్త నిందలెందుకేత్తవ్?"

"నువ్వు నా మీదెయ్యలేదా?"

"కర్మ బిడ్డా. అంత రాత గ్రహచారం వాగుంటే అన్నీ మంచిగ నడుత్తయ్."

"అహ! అదొగటా."

"బీడి దాగుతవా, సిగరెటియ్యనా?"

"నా దగ్గర మా ఉన్నయ్."

"అయితే మానే తీసుకో."

"నాకేమద్దు."

"బాగం ఎక్క తీసుకో. ఇగో లవంగం."

"లఫంగా యేశాలన్నీ నాముందెయ్యకు" అని ఏదీ తీసుకోక ముందుకు నడిచాడు రాములు.

నాగన్న పెద్ద చెంబు తీసుకొని దొడ్లోకి పరుగెడితే పెద్దిశెట్టి జారిన ధోతీ బిగించుకుంటూ సర్పంచు దగ్గరికి వెళ్ళాడు.

తోట దిక్కు వెళుతున్నాడు రాములు.

"అక్కడెవలున్నరని పోతున్నవ్ కొడుకా. ఎన్నడో ఆ గుడిసె ఇడిసి పెట్టిన్రు. ఇప్పుడు మీ పాతింట్లనే ఉంటన్రు. మీ అన్నికక్కన్నే

ఉన్నడు. ఊరికి పెద్ద లీడరైందనుకో. గూడెం మునుపటోలెలేదు కొడుకా. బాగ మారింది." సుంకరి యాదయ్య రాములును ఆపి ముచ్చట సాగించాడు. రాములు దారి మార్చాడు అతనికో రూపాయిచ్చి.

దుర్గమ్మ కొడుకును చూస్తూనే రాగాలు తీస్తూ ఏడ్చింది. వెంకన్న గుంభనంగా కూర్చున్నాడు. కొడుకును పలుకరించలేదు. ఇరుగు పొరుగు వాళ్ళొచ్చి చుట్టూ నిలబడి ఆ చోద్యం చూస్తూ గుసగుసలు పోసాగారు. అతడొచ్చిన వేళకు రాజు ఇంట్లో లేదు. మల్లమ్మను రాములు ఏర్పాటే చేయలేదు.

# 29

రాజోయ్ రాజూ బాయికాడి రాజూ
బాయికాడిరాజూ బంగరి రాజూ

బాజాలోని బమల బడితివి రాజూ
వానీ మోసంల నువ్వు పడితివి రాజూ

నిన్నూ చూసిన్నుంచీ కన్నూ మూయనెలేదు
కన్నూ మలిగిందంటే కలల నువ్వేరాజు
సన్నా చీరెలు దెత్తా వన్నె రైకలు దెత్తా
నిన్నే కోరితి నేనూ నన్నూ చేరే రాజు
రాజొయ్ రాజూ........

నిన్న రానేలేదు ఈరోజు పాడ మొదలుపెట్టాడు రాములు. రాజమ్మను జూసి అతడా పాట పాడుతున్నాడు.

"ఏం యానప్పె త్తెం బాగానే లేఃనట్టుగుంది మరిదీః"

"సక్కఁగ పసిగట్టినవ్ వొదినా నువ్వు."

"పడుసోనివై నవ్."

"పట్నం నీల్లు."

"సక్కఁదనమెగని ఇసోంటి పాటలు నా దగ్గెర పాడకు."

"మరేం జెయ్యాలె, ఆటలాడన్నాః"

"నాకేమెరుక. ఆడుకో పాడుకో నాకేంది?"

"నువ్వే అవునంటలేవయితివి."

"నీ నాలిక తెగిపోను. ఎంతమాటంటివి!"

"వదినప్ గద. వదున!"

"వదునా ? పెండ్లయిందానితోటి?"

"వాడిడిసే పాయె."

"పోతే?"

"వీడు సేరవచ్చె."

"నీకంటె పెద్దదాన్నిరా. కండ్లు పోతయ్."

"వరమ్మకంటె పెద్దదానివా ?"

"నేనసోంటిదాన్నికాదు."

"నాకెరుకలేదా ఆ సంగతి?"

"ఎందుకచ్చినప్ మల్లా నా దగెరికి?"

"అసోంటిదానివి కాదుగనుకనే."

"అంటే?"

"నిన్నిడిసి బతకలేనొదినా!"

"మొగడు లేందాన్ని జూత్తె అందరికి అలుసేకదరా."

"మొగడానెవాడు నీకు, ఆడేమొ నిన్నిడిసి ఆబోతోలె రంకేసి ఇంకొకతని పట్టుకొనిపోతే, నువ్వేమొ ఇంకా పిచ్చిదానివయి మొగడో అంట ఎదిరి సూత్తున్నవ్."

"చేసుకున్నోడుకద."

"చేసుకున్నోడు నిజమే మొదాలు. ఇప్పుడు ఇడిచేసుకున్నోడు. వాడు మొగడు కాడు. నువ్వాని పెండ్లానివీ కాదు. ఎన్నడో తెగదెంపు చేసిండు. నీదారి నువ్వు జూసుకోవాలె."

"చూత్తాం బతికితే."

"బతకకపోతే యిప్పుడే సచ్చిపోతన్నవా? ఆ చూసేదేదో ఇప్పుడే ఇక్కడే నన్ను సూడరాదు."

"నిన్నా ?"

"నాకేం దక్కువ. నిన్ను సాదనా ?"

"నాకంటె సిన్నోన్నివి."

"నీకంటె సిన్నగనే కనిపిస్తన్ననా? ఏసీ పిడికిడి బడతా. యిడి పించి చూడు తే లది."

ఆలోచనలో పడింది రాజమ్మ.

"యెద్దిమొకం బెట్టుకొని యేహాలోచి నవ్‌గని గడ్డిమోపెత్తుకో చెయ్యేత్త." అవను చెయ్యేసేసరికి ఆమె రెండు చేతులు గడ్డిమోపుపై వేసింది. అతడు మోపును ఆమె తలపై ఉంచి కుడిచేతిని అట్లానే ఆమె ముఖం మీదుగా తాకిస్తూ ఇంకా క్రిందికి తెచ్చి పొట్టభాగాన్ని వేళ్ళతో గిల్లి తీశాడు.

ఆమెకు చక్కిలిగింత పెట్టి మోపు క్రిందపడేసి నవ్వుతూ నిలబడింది. అతడామె దిక్కుచూసేసరికి ఆమె సిగ్గుపడుతూ తలవంచుకుని వంగి గడ్డికట్ట నెత్తుకోబోతున్నది.

అమాంతంగా అతని రెండు చేతులు ఆమె నెత్తిపట్టుకున్నయ్. చెట్లచాటుకు వెళ్ళారు. పచ్చిక పాన్పుపై కూలేసి ప్రక్కగా ఒరిగాడు లేవకుండా ఆమెను అదిమి పట్టుకుని.

"వద్దు." బాధగా అంది.

అడ్డంగా తలనూపాడు.

"మరిదివిరా."

"మగన్ని ఇప్పటినుంచి"

అతని ముఖంవైపు చూసింది. అట్లాంటి సమయాల్లో మగవాళ్ళెన్నో బాసలు చేస్తారు. కాని ఆమెకు అతని మాటల్లో విశ్వాసమే కనిపించింది. అతని కన్నులు ఆశతో మెరుస్తున్నయ్. ముఖంలో ఉత్సాహముంది. మొనలేపులి. అంబలో వేటలో ఉంది.

అన్నను కోరింది కాని కాదన్నాడు. తమ్ముని కోరలేదుకాని చేర వచ్చాడు. సరెలే అనుకుంది

ఆ భావం రావటంతోనే ఆమె శరీరంలో మార్పు వచ్చింది. అంత వరకు భయంతో ముడుచుకుపోయివ ఆమె శరీరం వికసనం చెందుతూ అతని శరీర స్పర్శానందం కోసం తపన పడసాగింది. ఆడదాని ఆ చర్యను పురుషుడు గ్రహించుకోగలడు.

# 30

డప్పుల చప్పుడు. ఊరంతా కోలాహలంగా ఉంది. ఒక పురుషుని తడికలేని పెద్దబండిలో కట్టి నిలబెట్టి ఊరేగింపు సాగిస్తున్నారు.

పురుషుని మెడలో చెప్పుల హారముంది. చప్పుళ్ళు జోరుగా మ్రోగుతున్నాయ్. హుషారుగా ఉన్నోళ్ళు కొందరు ఈలలు వేస్తున్నారు. పాటలు పాడుతూ కోలాటం ఆడుతున్నారు కొందరు.

ఊరేగింపు దొరగారి మేడ ముందాగింది. సగం మూసిఉన్న రేకు తలుపుల్ని పూర్తిగా తెరిచారు. వరండాలో మంచంమీద శేషశాయివలె పడుకుని ఉన్నదొర ఈ దృశ్యంచూసి లేచి నిలబడి తలపంచుకుని ఆలోచనలో పడ్డాడు. దాసిదొకటి వాకిట్లోనుంచి బంగ్లా లోపలికి పరుగెత్తింది. మేడమీది తలుపు తెరుచుకుంది. గర్భిణీగా ఉన్న సునంద వీధిలోని దృశ్యంచూసి వెంటనే తలుపు మూసింది. ఆమె ఆవేదన కారుతున్న కన్నీటికెరుక, పడుతున్న తలదిండుకెరుక.

వీధిలో అలజడి పెరుగుతూనే ఉంది. చేరే జనం పెరుగుతూనే ఉన్నారు.

ఆ అవమాన సంభావితుడవుతున్న వ్యక్తి మాధవరావు దొరగారి అల్లుడు. సునంద భర్త. ప్రక్కూరి దేశాయిగారి కొడుకు.

ఆ సన్నివేశం చూసేసరికి గుండె ఆగినంత పనైయింది. మేడపైకి వెళ్ళి హృదయ విదారకంగా యేడుస్తున్న కూతురును ఓదార్చసాగింది. ఈమె మాటలతో ఆమె రోదనాన్ని ఆపలేక పోయింది కాని, ఆమె శోకంలో ఈమె శ్రుతి కలిపింది. ఆ ధ్వని వరండాలోని దొరకు వినరాలేదు. కాని, వీధిలోని చప్పుళ్ళన్నీ ఆయన యెదలోనే మ్రోగుతున్నవి. వాళ్ళందరినీ తన్ని తన అల్లున్ని విడిపించాలని ఉంది. అది ఇప్పుడు సాగేపరిస్థితికాదు. వెళ్ళి బ్రతిమాలైనా విడిపించాలనుకున్నాడు. వినే ధోరణిలేదు. అల్లున్ని కాదు తననే అవమాన పరచాలని వారి పట్టుదల. అలజడి తీవ్రమయింది. ఊరేగింపు సాగిస్తున్నవాళ్లు ఆవేశంలో ఉన్నారు ఎటు కదిలితే ఎటు ముంచెత్తుతుందో ఈ ఉప్పెన అని వూరుకున్నాడు దొర కర్తవ్యహీనుడై.

దొరబాబు ఊళ్ళోలేడు. గుడిపూజారి దేవునికి అర్పింపుకోసం నైవే ద్యం పళ్ళెంపై అంగవస్త్రం కప్పుకొని వస్తూ ఈ ఆగడంచూసి దూరాన్నే నిలబడ్డాడు.

ఈ గ్రామ యువకులు కూడా చాలామంది ఆ ఉద్యమంలో పాల్గొ న్నారు.

అసలు కథేమిటంటే___

ఈ దొరగారి ఆ అల్లుడుగా౧౦ట బట్టలుతికే మనిషి. అందం మామూలే అయినా వయసు బిగువులో ఉంది. దానికితోడు ఆమె మగడు అర్భకుడు.

ఆ దేశాయి గారింట ఆపనో ఈపనో చేయటం ఈ పడుచుపై పడు తుండేది. ఒకనాడు దొరబాబు పడకపై సిల్కుచద్దరు పరచి సరిజేస్తూ మెరు స్తున్న పూలమీద చేతులేసి పరుపు నొత్తి చూసింది. మెత్తగా ఉంది. డెకొ లమ్ మంచంపై నైలాన్ దోమతెర పాము కుబుసంలా వ్రేలాడు తున్నది. చుట్టూ చూసింది. నీలం రంగుగోడలు పంచరంగుల చిత్రాలు తప్ప మరో ప్రాణి అక్కడలేదు. ఉత్కంఠ నాపుకోలేక ఆ మంచంపైపడుకుంది. కళ్ళు మూసుకుంది.

"దొర మంచం మీద పడుకుంటే ఎట్లుంటదో చూస్తున్నవా? దొర దగ్గర పడుకునిచూడు ఇంకెంత మంచిగుంటదో మరచిపోవు."ఆమెకు విష యం అర్థమయ్యేసరికి ఆక్రమించుకున్నాడు. భార్య పుట్టింటవున్న దొర బాబుకు ఇదో సదవకాశంవలె తోచింది. అప్పుడప్పుడు కలుసుకునేవాళ్ళు.

ఇంతవరకు బాగానేఉంది కాని, ఈ విషయం బయటపొక్కింది. ఆ యువతి ఎవర్నీ లక్ష్యపెట్టలేదు. దొరబాబు పులిబిడ్డ. ఎవరికీ జడిసే రకం కాదు.

అయితే వచ్చిన చిక్కల్లా ఆమె మగడికా సంగతి తెలపటం. తెలిసినా అతడు పట్టించుకోలేదు. అయిందాన్ని ఎవనితో పొమ్మన్నాపోదు. కానిదాన్ని ఇంటికి తాళం వేసి ఆపినా ఆగదు. అది బుద్ది జెడితే దానిపేరే చెడె. అనుకున్నాడు పెళ్ళాంతో మాట మాత్రం మానివేశాడు. ఆమె కూడా ఆ విషయాన్నేం లెక్కచేయలేదు. రాజును చూసిన ప్రాణం మొగన్నిచూసి మెచ్చనట్లయింది.

ప్రియునికి బాగానేవుంది ఆ ప్రేయసికి నెల తప్పేంతవరకు. ఆ విషయం తెలిసేనే ఆలోచన పాలైనాడు. అతడు శాశ్వతంగా ఆమెను ఏలుకోదలచుకోలేదు. అతడు చెప్పినట్లుగా ఆమె కడుపు తీయించుకోనంది.

"నీతో నేనెక్కడ కాపురం పెట్టేది. నా పెండ్లాం, మామ, బావ మరిది ఊర్కోరు"—అన్నాడు.

ఉంచుకున్నోడు కాదంటే చేసుకున్నోడయినా ఏలుకోవాలిగదా. పశువును కట్టివేసుటానికి ఏదో ఒక మట్టుగొయ్యి కావాలి అన్నట్లుగా ఎవరో ఒకరు తనకు ఆసరాగా ఉంటే చాలనుకుంది.

"మూడోడైనా పర్వాలేదా?" అన్నాడు దొరబాబు.

"మీకేంది నాలుగోన్నయినా తెత్తరు. మీకెంతమందో నాకంతమంది కావాలె కదా" అంది.

"నవ్వులాటకన్నానే ఎందుకంత కోపం? అనిమాట తప్పించుకుని, "సరే నువ్వు భయపడకు.నీకోదారి నేచూపుత.తియ్యిరందిపడకు"అన్నాడు.

"ఏ దారి చూపకపోతే ఏటిదారే నాది. మరిసి పోకుండి. అన్నంత పని చేసి చూపుత. నాది రేశం గల జల్మ. యేదో నీతోని రద్దిపాలైన"అని వెళ్ళిందామె.

ఆమె భర్తకు నయభయాన చెప్పిచూశాడు. అతడు వినలేదు.

"పొట్ట తేటి ఉన్నదాన్ని వదిలె యేడ బోద్దిరా?"అని అడిగాడు.

"అది పొట్ట జేసినోన్ని అడుగాలె" అన్నాడు రజకుడు.

"ఇదేందిరో నువ్వుకాకపోతె యెవ్వర్లా దానితోటి సంసారం జేసింది?"

"అది దాన్నడుగాలె."

"అది నీ పేరే జెప్పె."

"ఎందుకయ్యా అక్కెరకురాని మాటలు. అవి చేసింది నువ్వని నీకెరుక. ఊరి కంతటి కెరుక."

"ఇంత తెలిసుండి యెందుకూకున్నవ్‌రా?"

"అక్కెరకు రాని గేదె యే మందలపోతే నాకేంది?"

"అవ్వన్నీ సాగయే. నీ పెండ్లాన్ని నువ్వు తీసుకపో. లేదంటే నాలుగు తన్ని ఇంట్ల తోలి రమ్మంట."

"నన్ను తన్నుదెవన్నుంచి కాదు." పిట్ట కొంచెమైనా కూత ఘనం అనే వాపతు అతడు.

"నేను తలుసుకుంటే నీ పనెంతరా ?"

"నీ నుంచి కాదు నీ యబ్బ నుంచి సుతెంకాదు పోహ. ఏవొలావు బెదిరిత్తన్నవ్?"

అంతే అతడన్నది. దొర అతన్ని పొర్లించి పొర్లించి కొట్టాడు. ఒంటినిండా దెబ్బల దప్పుల్తో కులసంఘం పెద్దల్ని కలిసేడు.

పెద్దలు ఓ కాడి కొచ్చేలోపున కులంలోని కుర్రకారు కదిలింది. నాలుగూళ్ళ వాళ్ళు చేరేరు.

ఎవరి సలహామో ఎవరూ చెప్పలేదు. నలుగురూ నడుం కట్టేరు. దేశాయి కొడుకును అసహ్యంగా అలంకరించి బండి ఎక్కించేరు.

తమ పూళ్ళో పూరేగిస్తే తృప్తి కలగలేదు. సునంద ఎదట అవమానించాలి. బండి అటుపట్టించేరు.

వాళ్ళ పుత్సాహాన్ని చిరిచి, దొరల ఆపోరు తప్పించిన వాడు రాజు కావడం అందరికీ ఆశ్చర్యమే అయింది. కాని, అవమానంతో పాటు జరిమానా కూడ ఇప్పించేడని దొర బాధపడడం వింత అనిపించింది.

దేశాయిని చెప్పులు కట్టి పూరేగించడంకన్న అతడు కడుపు చేసిన చాకెతకి బతుకు చూపడం ఎంత అవసరమో రాజు చెప్పినప్పుడుగాని ఆ ఉత్సాహపరులకు తోచలేదు. తోచిన తరవాత డబ్బు కక్కిస్తేగాని వాళ్ళు వదలలేదు.

# 31

కొగడా పెట్టి వెదకినా కానరాని వస్తువులు ఒకొక్కప్పుడు చీకటిలోనే కాలికి తగిలి కనిపించినట్లుగా, యెండ్లు ప్రయత్నించినా కాని పనులు ఒకొక్కసారి సెకన్లలోనే జరిగిపోతాయి.

రాజమ్మ రాములు వేరు కాపురం పెట్టారు.

ఈడుకుదరని పెండ్లని కొందరు గుసగుసలపోయినా, మారు మనువుల్లో ఎన్నో సంబంధాలు అట్లాఉంటున్న పైనం వాళ్ళకు తెలిసిందే.

"పెద్దోనికి లగ్గంకాకముందు నువ్వెందుకు తొందరపడితివి కొడుకా?" అన్నది దుర్గమ్మ.

"ఇన్నేండ్లు ఎదిరిచూసే మొగడు రాకపాయే. అదేం జేస్తది. ఎవ న్నోన్ని ఒగన్ని కట్టుకొని బతికితేనే ఆడిదానికి మర్యాదుంటది. మగడిడ్సినా సచ్చినా పడుచుతనంల ఉన్నప్పుడు యాదాది రెండేండ్లు జూసి ఒగయ్య చేతిన పెట్టాలె. కాదంటే అదికావురంబట్టి కానిపనులు జేత్తే మంచిగుంటాది?' అని బిడ్డజేసిన పని మంచిదేఅని నెమ్మదిపడ్డాడు రాజమ్మ తండ్రి.

ఆ పెండ్లికి ఖర్చులులేవు. పెట్టుపోతలులేవు. పెద్ద రాయబారాలు భోజనాలు లేవు. అంతా వధూవరుల స్వయం నిర్ణయం. ఏదో నాలుగు దినాలు బతికిచచ్చేదానికిఎందుకో ఈ బంధనాలన్నీ? ఏనియమూలూ లేకపోతే పశువులమై పోతాం కదా. అందుకని కష్టాలను కలిగించే నిబంధనలను ఉంచుకోవద్దు. సుఖప్రదాలు సమాజ శ్రేయస్కరాలు అయిన నిబంధనలను తొలిగించుకోనూవద్దు.

జానపద ప్రణయకావ్యంవలె ఆ దంపతులజీవితం ఆనందమయంగా సాగిపోతున్నది.

అంతలోనే అనుకోని సంఘటన ఒకటి జరిగింది. రాజమ్మ మొగడు బాలయ్య చేరవచ్చాడు.

అతంతో లేచిపోయిందాని మీద మోజు తీరి ఎక్కడో ఊరు కాని చోట తోడు లేనిచోట విడిచి రావచ్చు. అని కొందరనుకున్నారు.

అదే మగన్నిడిసి మోజుపడి యీ వెంట పోయినట్టుగనే మరె వనోన్ని వీనికంటె రూపమో రూపాయలో యెక్కువునోన్ని జూసి ఉడా యించ వచ్చునని మరికొందరన్నారు.

అతడు మాత్రం "ఇది శిన్నపిల్ల గనుక, అది యెంబడి బడితె పోయిన యిప్పుడు నా పెండ్లంమీద ద్యాస మళ్లింది.అచ్చిన" అంటున్నాడు.

"మంచిపనే కొడుకా, మరి, ఏదైనా కావన్నన్నప్పుడు దొరు కన్నంటే కస్టం కాదురా. ఒక్క కాయె కావన్నంటెనే చెట్టును కొన్నేండ్లు పెంచన్నాయె. నాలుగు దినాలు ఓపిక పట్టంది ఆఓది అనుబవానికత్తాది?" పెద్ద మనుసులన్నారు.

"అదేమొ శిన్నదాయె. నేను అయిపోన్నయితి. ఎన్ని దినాలు చూసుకుంటుండాలె?"

"అయ్యో ఎన్నుకటి కాలాన్నయితె ముప్పయేండ్ల పినుమనికి మూడేండ్ల పిల్లను చేత్తురట. ఆల్లందరు గిట్లనే ఉరుకులాడిర్రా? నాలుగు దినాలు ఓపిక పడితె పిల్లే తల్లాయె. ఆడికులం ఎంతల పెరుగుతది. తోటకూర కులం బిడ్డా ఆల్లది." అన్నవాళ్ళకేం జవాబు చెప్పలేము కాని ఊళ్ళోకి పంచాయితీకి వెళ్ళాడు.

దొర దగ్గరికి పోనేలేదు. సర్పంచు దగ్గరికి పోతే అతడు పిలిస్తే వీళ్ళు వెళ్ళలేదు.

పోలీసు పటేలు దగ్గరికిపోతే "వెనుకటినుంచి మీ పంచాయితీలన్నీ కులం పెద్దల దగ్గర్నే తెంపుకున్నరు కదరా. ఇప్పుడు ఊళ్ళెకు నువ్వొత్తె వాళ్ళు వత్తారు?" అన్నాడు.

"ఊరి యెజమానన్నదేందిగ, తమరి మాటినరా?"

"మునుపే మీ గూడెం పంచాయితులు మాదాకరావు. ఇప్పుడు ఈ సంఘమంట తయారైంది. మా యే మాటా వాళ్లు వినుదే లేదు."

"గిట్లయితే ఎట్ల మల్లా?"

కడుపు నొచ్చినోడు ఓమ బుక్కుతడు. ఒకని కోసం ఇంకొగన్ని యేడ్వమంటే యెందుకేడు సడురా. యెవని బాధ వానిది."

బిర్రున ఊరికి వచ్చినోడు గిర్రున తిరిగి మళ్ళీ గూడెం వాళ్ళనే ఆశ్రయించాడు. ముసల పెద్దల చెవులు కొరికాడు. ఆశ పెట్టాడు.

"ఇప్పుడు మా మాట పారుతాలేదు బిడ్డా. అంతా వయసు పొలగాళ్ళదే పెత్తనం."

"ఎదురు తిరుగాలె."

"ఎందుకు? ఆల్లేం తప్పుపని జేత్తున్నరని. నాలుగురోజులైతే సచ్చిపొయ్యే ముసలి పీనుగులం మాకెందుకు బిడ్డా ఇంకా పెత్తనం. ఇంత తిని రంది లేక మిమ్ముల జూసుకుంట సంబ్రపడక."

విధిలేక రాజు దగ్గరికే వెళ్ళాడు బాలయ్య.

"మి తమ్ముడు లగ్గం జేసుకున్నడని అనుకోకు. ఇయ్యాల నా పెండ్లమయింది. రేపు నీది. ఆ! ఏమనుకోకు. ఎల్లుండి ఇంకోగంది. గిట్ల

యితే ఎవ్వరి సంసారం నిలుత్తది? లగ్గంజేసుకున్న లాభమేముంటది? దీని మీద యిశారం జెయ్యాలె. నువ్వు శిన్నోనివైనా పెద్దోనివని దండం పెడు తున్న" అన్నాడు.

"ఇంతగా చెప్పవల్సిన పనేంలేదు.సంఘసభ్యుల మీటింగ్ పెడదాం. ఏం న్యాయం చెపుతారో విందాం" అన్నాడు రాజు.

ఆనాడు సాయంత్రం అందరు స్కూల్ ప్రక్క గుమిగూడారు. ఎవ రికి తోచిన సమీక్షలు వాళ్లు చేసుకుంటున్నారు. రాజమ్మ భర్త తన పెత కత వెళ్ళబోసుకున్నాడు. నిజమే అని జాలివేసింది అతనిమీద ఆమాటలు విని చాల మందికి.

"రాములూ యేమంటవ్‌రా నువ్వు?" ఒకాయన అడిగాడు.

"దాన్నే అడుగుండి. నాదేమున్నది. ఇష్టపడ్డది. ఇంట్లకు తెచ్చుక న్నోన్ని నేను. అదిప్పుడు పాతోనితోనె పోతనంటె నేనడ్డంటనా?"

"మంచి మాట. ఆ ఏమంటవ్ రాజమ్మా?"

"ఏన్నేండ్లాయెనట అతగాడు నన్నిడిసిపొయ్యి.ఇన్నేండ్లకు పెండ్లాం యాదికచ్చిందటనా?"

"మొగోడు బిడ్డా ఆడు. చేసుకున్నోడు."

"మొగోడయితే యేతప్పు చేసినా చెల్లుదా?" వీరమల్లు అన్నాడు.

"యేతప్పు చెయ్యలే. నీ చెల్లె చిన్నది గనుక నేను ఇంకొకదానితో పోయిన."

"నువ్వు లేవు గనుక వయసుమీదున్న మా చెల్లెను ఒంటిగ ఉంచితె మంచిగుండదని మరొకనికి దారవోసినం."

"గట్లుంటదా?"

"నీ దెట్లుంది? నీ పనేమొ మంచిది. యీళ్ల పనేమో చెడ్డదా?"

"నేను పుత్తెగట్టిన పెండ్లాన్ని నా యిడుపు కాయిదం లేంది ఇంకొ గనికిత్తరా? ఇది అన్యాలంకాదా? మీరే చెప్పండి పెద్ద మనుసులు."

"రాజమ్మా! నువ్వు చెప్పు బిడ్డా యేమంటవో?"

"ఆయన ఉండెగదా యిడుపు కాయిదం తీసుకునెదానికి?" ఒక పెద్ద మనిషి అన్నాడు.

"ఆయన ఉన్నంక నేనెందుకిడిసిపెడుదును?"

రాజమ్మ ఆ మాట అనేసరికి నిశ్శబ్దం చోటుచేసుకుంది.

"కావన్నానుకున్నోడు కాదని పోయిండు. నన్ను కావన్నని మరొకడు దగ్గరికచ్చిండు. నా తప్పేముంది ఇందుల? ఆయినెకు నామీదలేని బమ నాకు ఆయినె మీద ఎందుకుండాలె. ఎవలబతుకాల్లం జూసుకున్నం, ఇండ్ల పంచాయితేముంది?"

"లగ్గం జేసుకున్నోడు కద బిడ్డా?"

"అయితే నేను కాదన్ననా? అయినె తన జోరు తనమోజు జూసుకొని తాను పోతే నేనెన్నేండ్లని ఎదురుచూడాలె. ఇప్పుడచ్చిండు గనక అటు మాట్లాడబడితిరి. రాక అటేపోతే యెన్నన్న సచ్చిపోతే ఇంత పున్య పురుసుడు దొరుకడని నేను ఎదురుజూసుకుంట గుడ్డి బతుకు బతుకన్నా?"

పెద్దమనుష్యుల కదిపింది ఆ ప్రశ్న. మగాడికో నీతి ఆడదానికో నీతి ఎందుకుండాలి? అనిపించింది.

"ఏమంటావ్ బాలయ్యా?"

"సరె! అదన్నది నిజమే. నాదే తప్పని ఒప్పుకుంటున్న. నేనో దిక్కు పోయిన్నని అదో దిక్కు పోయింది. నేను దాన్నిడిసచ్చిన, దాన్ని అన్నిడిసి రమ్మనుండి."

"మంచి మాట"అన్నారొకరు.

"నీకు రాబుద్ధయింది వచ్చినవ్. నీ వోలె ఆమెకు రాబుద్ధి కావాలె? కదా?" రాజన్నాడు.

"నువ్వు నీ తమ్ముని దిక్కు మాట్లాడకు" అన్నాడు బాలయ్య.

"రాజు దగ్గెర అసోంటి పచ్చెపాతం ముచ్చెట్లు లెవ్వురా" చంద్రయ్య అన్నాడు.

"ఏమంటవ్ రాజమ్మా?"

"సరే ఈయనె నిడిసి ఆయినెకు ఆలినయిత. మరి ఇప్పుడు నేను ఉత్తమనిసిని కాను. నాకు పుట్టే పొల్లగానికి తండ్రెవ్వలు, ఏమని చెప్పాలె? ఎవ్వలు సాదాలె?"

రాజమ్మ మాట సంచలనం కలిగించింది.

కనోన్నికి పిల్లగాన్నిచ్చి చేసుకునోన్నికి ఉండుమనొచ్చు. కాని పిల్ల నిడిసి ఈమె ఎట్లా ఉంటది? అతడెట్లా ఆడతోడు లేకుండా పిల్లాన్ని పెంచగలడు? ఆ పిల్లకేం సుఖముంటది? తల్లోచోట తండ్రోచోట. తల్లికి తన సంతానం మీదికి మనసు కొట్టుకోదా? ఇటు ధ్యాస పెట్టుకొని అటెట్లా కాపురం చేస్తది? ఇట్లాంటి ప్రశ్నలు వచ్చినై.

"నేను పుత్తెగట్టిన పెండ్లం ఇంకోని కెట్లుంటది?"

"నీ గంటెపుసె అమ్మగన. అంతాకొడితె యీసమె తయితే లేదు. నేనేం అమ్ముక తినలేదు. మా యింట్లనే పారేసిన ఎల్లమ్మ దగ్గరి పుంత గూళ్లై. మా అయ్యనడిగి నీది నువ్వు తీసుకపో."

"ఇంకేమన్న సొమ్ములున్నాయిరా నియ్యి?"

"ఇడుపు కాయిదమేనా?"

"ఇంకేం అతుకుద్ది?"

"ఆల్లే అట్ల జేసుకునిరి."

"కాలమే చేసింది?"

"అదే మంచిది."

"సొమ్ములు నగలు పెట్టి కూసుండబెట్టి సాత్తున్నారు ఆడోల్లను మొగోల్లు మన కులంల! అది కూలినాలి జెయ్యాలె. ఇంటిపని, వంటపని, చెయ్యాలె మొగనికి అత్తమామకు సాకిరి చెయ్యాలె. ఏం సుకపడుతుంది ఆడిది. ఇంక దానిమీద మొగోని పెత్తనమా? ఎందుకు దానిష్టమున్నట్టుగ అదుంటది."

"ఇప్పుడు విడిపోతెనే ఈ సమస్య తీరుద్ది."

నలుగురు చేరినచోట నానారకాలఅభిప్రాయాలు వస్తుంటవి. న్యాయానికి అనుకూలమైన మాటలను మనం లెక్కలోకి తీసుకుంటే సరి. పైవి రాజమ్మకు మద్దతుగా నిలిచిన వ్యాఖ్యానాలు. విడపు కాగితానికే నిర్ణయమైంది.

"పెండ్లి కర్సు మరి?"

"ఎంతరా అది?"

"మీ కెరుక లేదా?"

"ఆడిదిడితె అరువై మగోడిడిత్తె మువ్వై."

"అగొ గట్ల ఆడిదానికో తరీక, మొగోనికో తరీక."

"గట్లనే నడుత్తంది."

"ఓ పద్దులు పాతకాలం మాట. ఇప్పుడు నూర్లల్ల పడ్డది. పెద్దలోకుల్లనైతె ఎయ్యేల్ల నడుతంది."

"ఆ పైసలేం జేత్తరు. పిల్లకో పిల్లగానికో చెందుతన్నయా ?"

"పెద్ద మనుసులు కల్లుదాగుతరు."

"అంతీకదా, మేమెవ్వలం కల్లు కావన్ననం. ఒకనిల్లు నిలపెటోల్లం కని కూలగొట్టెటోలం కాదు. ఎవలమాట వాల్లు తీసుకుని ఎవల సందాన వాల్లు బతుకుండి ఎవలకెవలిచ్చుడు లేదు."

# 32

అర్ధరాత్రి. కారుచీకటి. ఎక్కడి వాళ్ళక్కడ గాఢనిద్రలో మునిగి ఉన్నవేళ వెంకన్న గుడిసెకు నిప్పంటుకుంది. భగ్గున మంటలు లేచాయి.

ఇంటివాళ్ళ కంటే బయటివాళ్ళే ముందులేచారు. ఇంటిపక్క వాళ్ళ కేకలతో ఇంటివాళ్ళు లేచారు. అప్పటికే ఇల్లు సగం మంటలతో నిండింది. నీటి ఎద్దటి కాలం. గ్రీష్మానికి ముందు పేరుకే వసంతం. కాని ఎండలు మండి పోతున్నయ్.

ఇంటివాళ్ళు ప్రమాదం లేకుండా బయట పడ్డారు కాని, వాళ్ళు వీళ్ళు నీళ్ళు చల్లేసరకు ఇల్లు కాలేపోయింది. పెద్ద సామాను నష్టం కాలేదు కాని ఆ ఆదాయంతో నష్టపడిన వస్తువులనైనా సమకూర్చుకోవటానికి ఎంతో కాలం కావాలి.

గుడిసె కప్పు చల్లారి మిగిలిన వాసాలనుంచి పొగ వెళ్ళుతున్నది.

అంతలోకే ఎగరొప్పుతూ చేరవచ్చాడు రాములు. అంతవరకు అతడు ఉన్నదీ లేందీ ఎవరూ గమనించలేదు ఆ రణగొణ ధ్వనిలో. రాజమ్మ ఆ మందిలో సాయపడుతున్నది. రాములు కణతకు దెబ్బతగిలి నెత్తురు కారుతున్నది.

"ఏందిరా రాములు ఏమయింది?" అడిన వాళ్ళకు "కొట్టిరసు గాడిది కొడుకులు. నీయవ్వ యేడికి పోతరు. వాల్ల నెత్రు కండ్ల జూడకుంటెనా_" రాములు పండ్లు కొరుకుతూ పిడికిడి బిగించాడు.

పల్లె ఆసుపత్రికి ఒకడు అయోడిన్ కురికితే ఒకడు పసుపు తెచ్చాడు. అంతకు మంచిదిరా నీళ్ళతో తుడిచి చెకుముకి రాళ్ళ దూది పెట్టి బట్ట పేలికతో కట్టువేశారు. రాజమ్మ భర్తకు కొంగుతో విసురుతూ నిలబడింది. దుర్గమ్మ శోకం పెట్టి యేడిస్తే ఆడంగులూరుక్కొంచ సాగారు.

"దరుమ రాజసొంటోల్లు కాదే దుర్గక్క నీ మొగుడు నీకొడుకులు. నువ్వు గంగగోవసోంటి దానివి. ఎవల కండ్లు మండెనే అల్ల కండ్లు నాకులు పొడవ, అల్ల యిండ్ల పీనుగులెల్ల, మీ గోస దాకి నాశిడెమై పోతరుసూడు. ఊకోవె. యే వేడుత్తవ్-" ఎండకాలం, పొయ్యిలోని నిప్పురవ్వ ఏదైనా ఎగిరి ఈ ప్రమాదం సంభవించవచ్చని కొందరికి అనుమానంగా ఉంది. మరి కొందరేమో ఎవడన్నా తీట సన్యాసి కాలుతున్న చుట్టో బీడో విసిరేస్తే గుడిసెమీద పడి యింత పనయిందేమో అనుకున్నారు. కాని, నరుని కన్నే కుట్ర కావించిన పని అని అనుకోలేరు.

రాములు రాకతో కథ మలుపు తిరిగింది. మంటలు లేచేది చూసి రాములు త్వరగా బయటకు వచ్చాడట. దీన్ని కనిపెడుతున్న మనుషుల్ని చూశాడు. అటు ఉరుక సాగాడు. ఈ అలికిడి గమనించి వాళ్ళు పరుగు నందుకున్నారు. వేగం పెంచి రాముడు వాళ్ళ సమీపించాడు. ఒకనితో పెనుకులాడుతుంటే రెండోవాడు నెత్తిపై దొంగ దెబ్బ తీశాడు. ఇతడు పడిలేచి చూసేసరికి ఆ యిద్దరు దూరం పారిపోయారు. ఒక్కడు రీలగా సప్పరించాడు కాని ఆ రెండవ వాడెవ్వడో బోధపడలేదతనికి.

"ఎవ్వడురా రాములూ ఆడు?" బావమరిది అడిగాడు.

"వాడెవ్వడో వాన్ని తోలినోడెవ్వడో అన్నీ యెరుకే నాకు. యిప్పుడెవ్వలకు చెప్ప. అని కాల్లు రెక్కలిరిసి కుప్పపెట్టిన్నాడు తెల్సుకోండి_" అన్నాడు ఆవేశంతో.

"వాడే దెబ్బపడి ఉన్నాడు. ఇంకా వదిరించి ఆ యాస పెట్టకుండి_" అన్నాడు రాజు.

వెంకన్న ఇల్లుకాలింది. ఆయన కొడుకుల మీది అసూయ వల్లనే అది కాలింది. కాని మరునాడు సాయంత్రం వరకు మళ్ళీ కొత్త గుడిసె యదాతథంగా నిలిచింది. గూడెమంతా తలా ఓ చెయ్యి వేశారు. ఊళ్ళోవాళ్లు కూడా వాసం పెండెలో తాటికమ్మలో యథాశక్తి ఉదారంగా అందించారు.

# 33

ఈ గుడిసె కాలిన విషయాన్ని అనుమానితుల పేర్ల జాబితాతో పాటు పోలీసు రిపోర్టు ఇవ్వాలనే సూచన వచ్చింది.

అయితే, ఈ పోలీసు రక్షణ, ఈ కోర్టుల న్యాయాలు పేదోళ్ళకోసం కాదు, పెద్దోళ్ళ కోసమే అన్నాడు రాములు.

దొంగల దోపిడీ కంటె ఈ పోలీసు శాఖ వాళ్ళ దోపిడీ ఎక్కువది. న్యాయం కోసమని కోర్టులకెళ్ళిమా తిరగలేక, ఖర్చులు కక్కలేక దివాలా తీసి దివానాలయి చెంపలు వాయించుకుని ఊర్కోవల్సిందే అన్నాడు వీరేశు.

ఈ సంఘటనను ఉచ్చకీడ్వ నెంచారు వాళ్ళు. ఇంకా చూద్దాం. ఇప్పుడే తొందర దేనికి? శత్రువుల రంగేమిటో పూర్తిగా తెలిసిరానీండి. అప్పుడు మన మొక క్రమపద్ధతిగా పకడ్బందీగా ఎదిరించేందుకు ప్లాన్ వేసుకోవచ్చునని రాజు అభిప్రాయ పడ్డాడు.

సారా డిపో దగ్గర రాములు బాలయ్య చిత్తుగా తన్నుకున్నారు. రాములు చొక్కా అంతా చినిగిపోయింది. బాలయ్యకైతే బనీనేకాదు దోతీ కూడా పేలికలైంది. చిన్న చెడ్డీతో ఓ మోస్తరు బొర్రతో భైరవ విగ్రహం వలె ఉన్నాడు.

వాళ్ళిద్దరు ఎందుకు పోట్లాడు కుంటున్నది ఎవరికీ సరిగా తెలువదు. పెళ్ళాం విషయంలో తగాదా పడ్డారేమో అనుకున్నారు.

"ఎందుకురా రాములు వాంతో కొట్లాడుతున్నవ్?"

"అది వాన్నడుగు మావా?"

"ఏమన్న అన్నాడురా?"

"ఇంకా అని బతుకుతాడు?"

"ఏందిరా బాలయ్యా ఇది?"

"ఏమోనే."

"ఇంకా ఇదేందో యెంమకో ఎరుక కాలే. మూడు రోజుల్నుంచి నువ్వు తాగుతున్న సారా యెవ్వడు ఎందుకు పోయిస్తున్నడో చెప్పురా?" అంటూ మరో గుద్దు గుద్దినాడు. దవడ యెముక అదిరిపోయింది పాపం; మొదట సమఉజ్జీగా ఎదుర్కొన్నా తర్వాత క్రమంగా అలసిపోయాడు బాలయ్య. సాధారణంగా ఎక్కడ తన్నులాట జరిగినా మాటలనుంచి దెబ్బలకు దిగుతుంది. ఇదేమో కిందుమీదు వ్యవహారమైంది.

బాలయ్య పిర్యాదు చేసుటానికి దొర బంగ్లాదిక్కు వెళ్ళాడు. నాలుగు రోజుల క్రితం పట్నం నుంచి వచ్చిన దొర కొడుకు అప్పుడే స్కూటర్ పై బయటకు వస్తున్నాడు.

ఎదురుగా వస్తున్న దిగంబర విగ్రహాన్ని చూసి ఆగ్రహాన్ని పెదవుల మధ్యనే బిగించుకుని స్కూటర్ వేగాన్ని పెంచాడు. అనుగ్రహాన్ని ఆశించి ఉన్న బాలయ్య పాపం పసిబాలునివలె నోరు తెరిచాడు.

# 34

బాలయ్య పంచాయతీ సర్పంచు గంగిరెడ్డి మీద ఆశ పెట్టుకుని అటు నడిచేడు. రానున్న పంచాయతీ ఎన్నికల చూపుతో గంగిరెడ్డి అతనిని నాలుగు రోజులు వెంట తిప్పుకున్నాడు. కాని హరిజన కాలనీ వోట్లు చేయిజారుతాయని భయం పుట్టి వదిలేసేడు.

గ్రామ పంచాయితీ ఎన్నికలు దగ్గరపడినై. ఆంధ్రప్రదేశంలో పదకొండేండ్లుగా నిలిచిపోయిన పంచాయితీ ఎన్నికలు తిరిగి సాగటంతో గ్రామాలలో సంచలనం ఆరంభమైంది.

ఈ గ్రామ పంచాయితీలు ఆరంభమైన తొలిరోజుల్లో పోటీకి నిలిచిన అభ్యర్థులకు వందలుకూడా ఖర్చు అయ్యేది కాదు. పోను పోను తెలువులు

మీరి, పదవీగ్రహీతలకు ఆదాయాలు చేరి, పోటీలు పెరిగి వ్యయాలు పెరుగుతున్నవి. ఈసారి సర్పంచు పోటీకి ఒక్కొక్క అభ్యర్థి మూడు నాలుగు లక్షల్లో వ్యయం కావిస్తున్నారు. ఈగ్రామంలోనూ పోటీ తీవ్రమేఅయింది.

గ్రామపంచాయితీ పుట్టినప్పుడు సర్పంచ్ గద్దె నెక్కిన గంగిరెడ్డి మళ్ళీ ఈ ఎలక్షన్లలో నిలబడ్డాడు. ఆ ఏడుకొండలవాడు కరుణించి సమితి ప్రెసిడెంట్ అయితే మరీ మంచిదే. ఈ గ్రామాధ్యక్ష పదవి మాత్రం తన నుండి మరొకరికి పోరాదు. పోతే ఎన్నో నష్టాలు. తన ఆదాయంపోతుంది. విలువ పోతుంది, అవమానం పాలవుతాడు.

తాను అధికారంలో ఉండగా తక్కువే చేయలేదు. కంట్రోలు శర్కరను తన యింటి సొమ్ముగా వాడుకున్నాడు. ప్రతినెల కోటాలో సగం బస్తాలు దొంగతనంగా అమ్ముకుని సొమ్ము చేసుకునేవాడు. సగం మాత్రమే ఊరికి తెచ్చేడు. తన అనుగ్రహంకొద్దీ ఎవరికి ఎంతివ్వాలో అంతే ఇచ్చేడు. తనకు సరిపడనివారికి లేదు. తన పనులకు రాని కూలీలకు లేదు. ఏమన్నా అంటే ఎగబడి తిట్టేడు. చాటుగా తిడుతున్నారని తెలిసినా విన్నా తనను కాదన్నట్లుగా ఊరుకున్నాడు. ఎవరేమన్నా తన స్వభావం మాత్రం మార్చుకోలేదు.

గ్రామపంచాయితీ భవనం నిర్మించబడి పదేండ్లయినా దీని ప్రారంభోత్సవం కానట్లు. అద్దె భవనంలో నడుస్తున్నట్లు లెక్కలు రాశాడు.

కారోబార్‌గా ఆ వూరి బడిపంతులు పేరే రాసి పంపాడు. పనిదేముంది కాని పైస కూడా అతనికిచ్చిన పాపాన పోలేదు. వ్యయం మాత్రం సరిగా చూపేవాడు.

ఊరి నూద్చే ముసలోడు సత్తువుడిగే దాక చెత్తనూడ్చి ఎత్తిపోసేవాడు. సత్తదొరా దయజూపుండన్నా ఒక కొత్త కూడా రాల్చలేదు. ఊరివాళ్ళ దయాదాక్షిణ్యాలమీద అతడు బతికి చచ్చాడు.

వీధి దీపాలు ఏవైనా ఎన్నికలు వస్తే తప్ప వెలుగలేదు. ఏ పార్టీ వాళ్ళొచ్చినా 'మీ దిక్కే నేను. ఈ ఊరంతా నేను చెప్పినట్టు నడుచుకుంటారు' అనిచెప్పి అటు మూడు ఇటు నాలుగువేలు కాజేసేడు. అందులోనుంచి ఈ కులం పెద్దలకు వంద, ఆ కులం పెద్దలకు వంద అని నాలుగైదువందలు యిచ్చి మెహెర్బానీ చేసేడు.

ఇద్దరు కొడుకు లాయనకు. ఒకాయన ఎర్రన. ఒకాయన కర్రెన. దానిదేంకాని ఇద్దరూ చదివింది పదవ తరగతే. ఒకాయంది దొంగ సర్టి ఫికేట్. మరొకాయంది కాపీ సర్టిఫికేట్. అయితేనేం ఇద్దరికీ ఉద్యోగాలు దొరికినై తండ్రి తెచ్చిన రికమండేషన్లవల్ల. ఇద్దరికీ ఇన్‌కం బాగా ఉండే సీట్లే దొరికినై తండ్రి యిచ్చిన లంచాలవల్ల. మంచి సంబందాలు కుదిరి పెళ్ళిళ్ళయినై బంధుత్వాలవల్ల. అతనికి నలుగురు కూతుళ్లు. రూపాలు బాగా లేకున్నా, చదువులు రాకున్నా రూపాయలు బాగా ఉన్నై. ఇస్తున్న కారణంగా మంచి సంబంధాలు జతపడినై.

మొదట తండ్రి కాలాన రెండు దున్నపోతుల ఒంటి నాగలి వ్యవ సాయం వుండేది. ఈయన బాల్యంలో బట్టకు, పొట్టకు గడవటమే కష్టంగా వుండేది. కాంగ్రెసు హయాంలో అనేకులివలె పార్టీనాశ్రయించి క్రమ క్రమంగా బలపడి తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లుగా నాలుగెదు అరకల వ్యవసాయదారుడై చిన్నపాటి భూస్వామి హోదాకు చేరుకున్నాడు. మొన్నటి ఎమర్జెన్సీలోని ప్రధాని ఇరవై సూత్రాలకు బెదిరి నిజంగానే తనభూమి పోతుందేమోనని భయపడ్డాడు. వెట్టిచాకిరి నిర్మూలన, కూలీల రేట్లు హెచ్చింపు అంటే చాల బాధపడ్డాడు. అత్యయిక పరిస్థితి ఎత్తివేయబడి జనతా ఏర్పడి ఎన్నికలకు పోటీచేసినప్పుడు తాను జనతాకి మద్దతునిచ్చాడు. జనతాపార్టీ ఢిల్లీ పీఠమెక్కినపుడు ఈయనగారికి పట పగ్గాలే లేవు. వాళ్ళు గద్దె దిగినప్పుడు ఘటపగలే దొంగలు పడ్డట్టు వ్యధచెందాడు. కొన్నాళ్లు జనసంఘ్‌నన్నాడు. తర్వాత లోక్‌దళ్ ననుకున్నాడు. ఇప్పుడు కాంగ్రెసునే అంటున్నాడు. కమ్యూనిస్టులంటే మండిపడతాడు.

ఇంతవరకు ఆయనకు ఎప్పుడు రాకదేకాని పోకడ ఎరుగడు. ఎప్పుడు ఏకచ్ఛత్రాదిపత్యమేకాని పోటీ ఎరుగడు. ఈ ఎన్నికల్లో గట్టిపోటీ ఎదురైంది. మంచి ఖర్చే దాపురించింది. ఏడుపు వస్తున్నదతనికి. నిప్పు తొక్కిన కోతివలె ఒకచోట నిలువక ఇంటింటికి తిరిగాడు. పిచ్చిపట్టినవాని వలె వెళ్ళినింటికే మళ్ళీ వెళ్తున్నాడు. పులివంటివాడు పిల్లికూనగా ఒక్కొ క్కరి దగ్గరికి వెళ్తున్నాడు.

ముందటి కాలాన ఓటర్లను ఒట్లు పెట్టించేవాడు. పసుపు బియ్యం పట్టించి బాస చేయించేవాడు. బెదిరించేవాడు. ఇవన్నీ సాగనిచోట బ్రతిమి లాడేవాడు. ఇప్పుడు వాటిలో చివరి విధానమొక్కటే దిక్కయింది.

ఎక్కడివాన్నో ఓ సారా డిపో గొడును ఇతనికి పోటీకి నిలిపారు. ఊరంద రకేనట. హరిజన గూడెం సహాయం అకేనట. బీడీల కంపెనీ గంగాధర్‌గాడే నాలుగువేలు చందా ఇచ్చాడట.

దొర చూపు తనదిక్కే. పటేలుపట్వారీ తనవాళ్ళే. అయితేముంది ఓడేది ఖాయం. తన పాలేళ్ళే తనకు ఓట్లేసే ధ్యాసలో లేరు. వెయ్యక పోతే మానేకాని "ఎందకెయ్యన్నయ్యా? ఏం జేసిండ్లయ్యా మీరు మాకు ఇన్నొద్దులోపేతే?" అని నిలదీసి అడుగుతున్నారు. పటేలుసానికైతే పంచప్రాణాలెల్లిపోతున్నై వాళ్ళ మాటలు వింటుంటే.

'పాడుపుండకొడుకులు. నియ్యతి లేనోళ్ళు' అనుకుంది. "మా సొమ్ము తిని బతుక్కుంట మమ్మల్నే కాదంటార్రా?" అని అడిగింది.

"యెవల సొమ్ము తింటున్నవ్వో మీరేనా భూమి మన్ని, నిల్లుకట్టి పంట పండించింది? అప్పనానికి ఇంట్ల కూసుండి మా రెక్కల కట్టం తిని బతుక్కుంట ఇంక మమ్ములనంటన్నారు?" అన్నారు వాళ్ళు.

"ఓరి మీమీద మన్నుబడ. ఎంత మాటంటిర్రా? అప్పనానికి బతుకున్నాంరా మేము? ఈ భూమి జాగలన్ని మాయి కావురా. మీరు రెక్కల కష్టం జేస్తే మీకింతాయె మాకింతాయె!"

"ఆ! ఈ బూములన్ని మీరు రాంగ యెంబడితెచ్చినారు? పదేండ్ల కింద యేముందెనవ్వ మీకు?"

"అవన్ని సొద్యాలు మీకెందుకురా?"

"అహఁ గందుకుకాదుగని, ఆరుగాలం కట్టంజేత్తె మాకేముంది? మీరేమొ మారాజుగ బతుకవడితిరి."

"పోంర్రా. పాత రోతయింది. ఆ కొత్తగ గెలిసెటోడు మీకు బంగ్లాలు కటి సదు పోండి" అంది.

"అంకర మెదిలై ఆని పని గింతే."

ఆమె మరేమీ అనలేదుకాని పాడుకాల మొచ్చిందని బాధపడింది.

ఆ వూరి పోటీ ప్రచారం చాలా బాగుంది. ఈ సర్పంచు మూడు సార్లు ఎన్నికై ఊరికేం జేశాడు? వీధి లైటయినా వెలిగించాడు? మురికి కాల్వలు తీయించాడా? సఫాయోనికైనా జీతం ఇచ్చాడా? కారోబార్‌కి జీతమిచ్చాడా? కడుప కడుపకు విడువకుండా వసూలుచేసిన ఇంటి పన్ను

అన్నీ యేమయినై? ఈయన గుత్తాపట్టి కట్టిన బడి కూలింది. రోడ్డు చెడిరింది. పంచాయతిల్లో వసూలుచేసిన దండుగలేమూయె. గుడికని వసూలు చేసిన చందాలేమాయె? ఇవే ప్రశ్నలు.

మొగం చెల్లుతలేదు పాపం సర్పంచుగారికి. ప్రత్యర్థులవేకాక ప్రజల ప్రశ్నలూ పరేశాను జేస్తున్నవి.

ఆ ఓట్ల పర్వం ముగిసింది. పాత సర్పంచ్ ఓడినాడు. కొత్త సర్పంచ్ గౌడును పెద్ద చప్పుళ్ళతో, ఊరేగింపుతో తీసుకుపోతుంటే పాపం గంగిరెడ్డిగారు ఇల్లు వదలి బయటకి రాలేదు. ఆయన భార్యయితే ఏడ్చింది.

మాధవరావు దొరగారొక తీర్మానం చేశారు. "మాపూళ్ళో తాగేవాళ్ళని పోసేవాళ్ళదే జోరు. మిగతావాళ్ళది ఏంలేదు" అని.

# 35

ఊరంతా ఎన్నికలలో వోట్లు వేసే హడావిడిలో వున్నారు. రంగనాథం వచ్చేసరికి మల్లమ్మ ఒక్కర్తే ఇంటి వద్ద వుంది. ఎప్పుడూ దొరకని ఏకాంతం.

"మై ఫెయిర్ లేడీ" అంటూ రంగనాథ్ మల్లమ్మ వెంట పడ్డాడు. సిగ్గుమొగ్గై నవ్వి పువ్వైంది.

"అంటే యేమన్నట్టు?" రుసరుసగా అంది.

"నీలో ఏదో కనికట్టు ఉందన్నట్టు." కన్ను కొట్టాడు.

"ఛత్ !" దూరం పోసాగింది.

"అట్లా పారిపోతావేం ? నీదీ నాదీ ఒక జట్టు."

"ఎందుకు ?"

"పెళ్ళి చేసుకునేందుకు."

"నిజంగా?"

"ఒట్టు."

"అయితే మా అన్నను నాన్నను అడుగాలె."

"నన్ను పెళ్ళాడేది వాళ్ళా నువ్వా ?"

"వాళ్ళే."

"మగాన్ని పెళ్ళి చేసుకుని ఏం చెయ్యాలె ?"

"వంట చేయాలె, తినబెట్టాలె, తిట్లు తినాలె, కొట్లు పడాలె."

"ఊఁ. యింకా ?"

"ఇంకా ఏమన్నా ఏమనద్దు !"

"ఎందుకు ?"

"మొగుడు కదా !"

"మగడైతే తిట్టినా కొట్టినా ఏమనొద్దా ?"

"అంతేనా, విడిచినా, అక్కడక్కడ యింకెవత్తితోనైనా తిరిగి వచ్చినా?"

"యేమనొద్దు. బాగుంది ఇంకా ?"

"పెళ్ళాన్ని నువ్వు నాకొద్దు పొమ్మన్నా, అడివిన వదలినా, అమ్ముకున్నా."

"అవునవును మన పురాణ పురుషులు రామచంద్రుడు హరిశ్చంద్రుడు చేసినట్లుగనా, ఇంకా ధర్మరాజువలె జూదంలో పణంగా పెట్టినా యేమనకూడదు అవునా?"

"అంతే."

"అయితీ నేనట్లా చేయొద్దంటవ్ ?"

"అదీ చెప్పనా్న ?"

"అయితే ఈ పవిత్ర ధర్మభూమిలో మహాపురుషున్ని అయ్యేదెట్లా మరి ?"

"సామాన్య మానవునిగా ఉండే చాలు."

"బాగుంది చాల బాగుంది. నేను మత మహోద్ధత పైత్యంలో పడిపోను. మామూలు మానవునిగా మసలు కుంటాను. నిన్ను నేను కొట్టను, తిట్టను, వదలపెట్టను. ఆటలో ఉంచను, విక్రయించను. సరేనా ?"

"అయితే సరే."

"మరి అవన్నీ నువ్వు నన్ను చేస్తే ?"

"చెయ్యను."

"చేసే. కాలమెట్లాగనో ఉంది. కథ తిరగబడితే ?"

"దండం పెట్టాలి." నవ్వుతూ అంది.

"దండం పెట్టాలి కాదు. దండం పట్టాలి."

"కొడతావా నన్ను ?"

"నిక్షేపంగా!"

"రాక్షసునివి నువ్వు."

"నువ్వేమైనా దేవతవా ?"

"నేను మనిషిని. స్త్రీని."

"అయితే నువ్వు నన్ను అవ్వన్నీ చేయొచ్చునా ?"

"మీ మగవాళ్ళు మా ఆడవాళ్ళను అవన్నీ చేయలేదా ?"

"మీ, మా ! ఆ మా మగాళ్ళు వంకర మెదిలితే ఈ నీ నాకా శిక్ష? నేనేం తప్పు చేసిన్నాని. ఆ భర్తలు తప్పుగా మెదలినప్పుడు ఆ భార్యలు తిరుగబడి వల్సి ఉండె."

"అప్పుడు వాళ్ళు అమాయకురాండ్రు."

"అహో బయల్దేరావు చతురమతివి!"

"బదలా, దెబ్బకు దెబ్బ."

"అది కాదో పిచ్చిరకమా,"

"పిచ్చిదాన్నా నేను?"

"పెంకి పెళ్ళానివి."

"పెళ్ళాన్ని ఎప్పుడైతి ?"

"అవుతవ్ లే ఈ మగాడు మగడు. నిన్నేం వదలడు."

"నేను చేసుకోను."

"నేను విడిచిపోను."

"నిన్ను చేసుకుంటే నేను సుకపడను"

"నిన్ను చేసుకుంటే నేను సుఖపడుతానా ?"

"మరెందుకు చేసుకునుడు ?"

"ఇట్లా చిటాపటా మాటకు మాటా దీపావళి పటాసుల్లా పేలుస్తూ పోట్లాడుకునేందుకు !"

"ఏం బాగుంటది ?"

"అమ్మమ్మో. ఎంతమాట. ఎంతో బాగుంటది. పాపలు కూడా వస్తరు."

"ఛీ ఛీ ! దుర్మార్గునివి "

"సన్మార్గమే నేను చూపేది."

"చక్కొందే."

"చక్కని సంసారం కంటే మించిందేముంటుంది జీవితంలో?"

"మనకు కలపదు."

"కులం గోత్రం శాస్త్రం ఆచారం అన్నీ వదలి ఇట్లా ఎంచక్కా మాట్లాడు కుంటున్నామంటే, కలవదు కాదు కలిసింది మనకు."

"అమ్మో నువ్వు గడుసు రకానివి. నేను చేసుకోనబ్బా."

"ఒక మాట. నువ్వు పెంకి రకానికాదా. అయినా నేను ఒప్పుకుంటు న్నానుకదా. ఎందుకు? పెళ్ళాం మొగుడు ఇద్దరు సమఉజ్జీలుగా ఉంటేనే ఆ సంసారం చక్కగా ఉంటుంది. పెళ్ళాం, భర్త చరణదాసిగా పడి ఉండటం ఎట్లా మంచిది కాదో, సతీదాసుగా మగాడు అయినా బాగుండదు. ఏమంటావ్?"

"అంతే."

"అయితే మనం పెళ్ళి చేసుకుందాం."

"మావోళ్ళ నడుగు."

"అదికాదు, నేను కావన్నంటే నువ్వే మీ వాళ్ళ నడుగెహె."

"ఎహె యేంది ?"

"ఓహో. మల్లమ్మా ! నీ భాష ఎంత మారింది. నీమాట లెంత తెలివిగా ఉన్నయో. చదువులేక సంస్కార విహీనంగా ఉంది. ఎన్ని కోట్ల మందో మన దేశంలో మట్టిలో మాణిక్యాలు."

"అంతే కదా."

"మల్లీ ! నిన్ను మొల్ల అని పిలుస్తాను ఇష్టమేనా ?"

"ఊ !" ఆమె సిగ్గుపడింది.

అతను నవ్వాడు. ఆ నవ్వు ఆమెను నవ్వించింది.

# 36

సమితి ఎన్నికల గాలి వీచింది. ప్రచారాల దుమారం లేచింది. పంచాయితీ ఎన్నికల తర్వాత అంతా పదిహేనురోజులకే ఇవి. ఇంతకు పూర్వం సర్పంచుల ఓట్లతో సమితి ప్రెసిడెంట్‌లు గెలిచేవారు. ఇప్పుడు సమితిలోని అన్నిగ్రామాల పౌరులందరూ మామూలు ఎం. ఎల్. ఏ. ఎం. పి. ల. ఎన్నికలకు వలె ఓట్లేసే విధానం వచ్చింది. పోటీ సమస్య క్లిష్టమైంది. ఎవరు గెలిచేది అంచనా వేయరాని పరిస్థితి ఏర్పడింది. పాపం! పోటీదార్లకు ఖర్చు పెరిగింది. మునుపు సర్పంచుల్ని లాక్కు వెళ్ళి ఏ సిటీలోనో పుణ్యక్షేత్రంలోనో గొర్రెలమందగా ఉంచి ప్రత్యర్థులకు తెలుప కుండా ఎత్తుకు పోకుండా గట్టి బందోబస్తు కావించి కొత్త అల్లుండ్రను అత్తవారింటి వాళ్ళు మేపినట్లు విందుల్లో ముంచేవారు. గెలిచేవారు. ఇప్పుడు పరిస్థితి మారి ప్రాంతానికో అభ్యర్థి పలుకుబడి ఉండి, ఇంకా ఊరూరికి కులాలవారీ అభిమానాలుండి గెలుపూ ఓటముల నిర్ణయం ఊహించరాని దయింది. వీటికితోడు వివిధ రాజకీయ పార్టీల అభిమానాలు చేరినై.

సర్పంచ్ ఎన్నికలకు కొద్దిరోజుల తర్వాతే ఈ సమితి ఎన్నికలనే సరికి ప్రజలకు వింతగానే ఉంది. ఈ సర్కారోనికి పనీపాటాలేదు. ఎప్పుడూ ఎన్నికలు ఓట్లే అన్నారు కొందరు. ఓట్లు వేయించే ఒప్పందపు దళారీలు రాబడి అంచనాల్లో ఆశల్లో పడ్డారు. ప్రభుత్వ ఉద్యోగులకు ఈ తేప పోలింగ్ డ్యూటీ నిర్వహించినందుకు బత్తాలు దాగానే పుట్టినై. ఎంత వచ్చినా ముఖం మాడ్చే ఏడుపుగొట్టుల పదిత్తే ఇన్నాళ్ళూ ఎన్నడూ ఈయనంతటి మొత్తాల్లో ప్రయాణ భోజన భత్యాలను అందించారు.

ఈ ఎన్నికలకు మన కథా గ్రామం చేరి ఉన్నసమితి హరిజనులకు రిజర్వు అయింది. దాంతో ఇంతకాలం పొత్తేళ్ళలా పుర్ర్మలాడుతున్న రెడ్డి, రావు వర్గాల వారికి చుక్కెదురైనట్లయింది.

రాజును ప్రోత్సహించే వారధికమైనారు. ఒకరు బలవంతంగా నామి నేషన్ ఫాం దాఖలా చేసి వచ్చారు. ఈ విషయం తెలిసిన దొర నాలుక కరచుకున్నాడు. ఓడిన సర్పంచ్ గంగిరెడ్డితో మంతనాలాడి మరొకన్ని

ఈతనికి పోటీగా నిలుప నెంచారు. ఊరి వారెవ్వరూ ముందుకు రాకపోవ టంతో ప్రక్కూరి దొరగారి సహాయంతో వారి అనుచరున్ని అందుకు ఎన్ను కున్నారు. మరిద్దరు వ్యక్తులుకూడా పోటీకి నిలిచారు. వారిలో బాలయ్యా ఒకడు.

డిపాజిట్‌కు డబ్బూ, కరపత్రాలకు డబ్బూ గంగిరెడ్డి దొర ఇచ్చు కున్నారు. కాని, మరునాటినుంచే బాలయ్యా దొరికినమట్టుకు అందుకుని పోటీ నుంచి తగ్గాలనే ఆలోచనతో వున్నాడు. పట్నంలో ఎన్నికలప్పుడు అటు వంటి వాళ్ళను చూసేడు. తానూ కబుర్లు పెట్టేడు. కాని ఎవ్వరూ లెక్క చేయలేదు.

అందరిలోకీ చిన్న వయసువాడు, చదువుకున్నవాడు, యింతవరకు భ్రష్ట చరిత్ర లేనివాడు, అభ్యుదయ భావాలున్నవాడు, ఎవరి తొత్తూ కాని వాడు రాజు. దాంతో అతనికి ప్రచారం అక్కరలేక పోయింది. రాజకీయ విద్యార్థి బృందాలు వచ్చి ఉదారంగా తోడ్పడినై. ఏ వూరికి వెళ్ళినా ఆ ఊరి స్టూడెంట్స్ భోజనాలేర్పాటు చేసేవారు. ఈ ప్రచార బృందంలో ఒక సుగుణముంది. తాగరు, తాగిపించరు. జిల్లా హరిజన సంఘం ఒక జీపు పంపింది. వారే కరపత్రాలు వేసి పంపారు, పంచారు ప్రతి గ్రామానికొక సారితప్పక వెళ్ళి తన పరిచయం కావించుకుని వచ్చాడు రాజు. అతని ఆద ర్శాల గూర్చి ప్రచారం చేసేవాళ్ళు తక్కువలేరు.

మిగతా అభ్యర్థుల ప్రచారం దళిత వర్గాలవల్ల కాక దొరలవల్ల సాగింది. దాని అర్థం ఏలానా పోటీదారు మా మనిషి. గెలిస్తే మాకేకాక మా ద్వారా మీకూ ప్రయోజనమహో అనే రహస్యపు ఒప్పందం ఒకవిధంగా. దీనులు దరిద్రులు తమ అభ్యర్థి తమలో ఒకడుగా తమకు సన్నిహితంగా ఉండాలని కోరుకుంటారే తప్ప యితరులకు తొత్తుగా చూడలేరు. ఈతడు వేరేవారి చేతి కీలుబొమ్మ అయితే ఆ బొమ్మ ఆడించేవాని యిష్టాన్నిబట్టి ఆడుతుంది కాని మన మాట వినదురా అనుకుంటారు పేదోళ్ళు వాళ్ళు ఈ మధ్య పెద్దోళ్ళను అంతగా నమ్మతులేరు కూడా. నిజానికి దళారీ వ్యాపా రం వల్ల, మోసపు చేతలవల్ల, జనం అజ్ఞానంవల్ల గెలుస్తున్నారు ఈ ధనిక అభ్యర్థులు. కాని ప్రజాభిమానంవల్లకాదు. వింతేమిటంటే అత్యధిక సంఖ్యా కులైన విద్యావిహీనుల ఆమోదబలంతో ఎన్నుకోబడుతున్న ప్రజా నాయ

కులు అత్యల్ప సంఖ్యగల విద్యావంతులు మేధావి వర్గంవారు ఏర్పరచిన రాజ్యాంగ ధర్మసూత్రాల ప్రకారం పరిపాలన సాగిస్తున్నారు.

రాజు గెలిచాడు. పోటీకి యితరులు నిలపిన దొరల పదనాలు నల్లుపు తిరిగినై. రాజుకు పోటీనిలిచి ఓడిన హరిజనఅభ్యర్థులు పైరభావానికి పోక రాజు దగ్గరికి వచ్చి అతని విజయానికి తమ సంతోషాన్ని ప్రకటించారు. ఆ ముగ్గురు పోటీదారుల్లో యిద్దరు దొరల అభిమతంతో నిలిచినవాళ్ళు. మూడవ అతను ఎవరేమైనా ఇంత ఇచ్చి పోటీనుంచి విరమించుకొమ్మ నరా అని డబ్బుకాశించి డిపాజిట్ కోల్పోయిన బాలయ్య.

రాజు అభిమానుల ఆనందానికి అంతులేదు. పెద్ద ఊరేగింపు తీశారు. జిల్లా కేంద్రాన ఓట్ల లెక్కింపు జరిగి ఎన్నికల ఫలితం తెలిస్తేనే రాజుకు పూలదండలు వేసి ఊరేగింపు నారంభించారు. అక్కడినుండి వారి తాలూకాకు వెళ్ళారు. ఆ బ్లాకు షాహుకార్లు కంట్రాక్టర్లు ఈ ఎన్నికల ఫలితం వింటూనే ఉన్నవాళ్ళు తమ తమ జీపులు,కార్లు, లారీలతో వీరి ఊరేగింపులో పాల్గొన్నారు.

సమితి ఆఫీసు నుండి దారిలోని ఊరూరికి వేడుకగా ఆగుతూ రాజు వాళ్ళూరికి చేరేసరికి తెల్లవారింది. ఎప్పుడు ఏ ఉత్సవానికైనా గూడెం ఊరికి చేరేది. ఈనాడు ఆ పూరే గూడాన్ని చూడవెళ్ళింది.

# 37

సమితి ప్రెసిడెంట్ అయ్యేక రాజు ప్రతిష్ఠ రాష్ట్రం హద్దులు దాటింది. అతను ఉద్యోగంకేసి చూడక ప్రజాసేవకై కేంద్రంగా చేసుకొని చేస్తున్న కృషి పత్రికల కెక్కింది. హరిజన కాలనీ అభివృద్ధిపై ప్రత్యేక వ్యాసాలు వచ్చాయి. ఫొటోలు పడ్డాయి.

అతనినుంచి మాటకోసం పూరిపెద్దలు ముందుకువస్తూంటే అతనిని అభినందిస్తూ అనేక ప్రాంతాల హరిజన నాయకులు వ్రాసేరు.

పెద్ద పేరున్న మంత్రిగారు ఆ ప్రాంతం పర్యటిస్తూ. తాము ఆ పల్లెను చూడాలన్న ఆతురతనే కనబరిచేరు. అరవై యేళ్ళ వృద్ధ నాయ

కులు వారు. అటు కేంద్రంలోనో యిటు రాష్ట్రంలోనో మంత్రిగా ముప్ప దేండ్లుగా ప్రజాసేవ చేస్తున్నవారు. తమతోటి వృద్ధులకు తగిన గౌరవం లభించడంలేదని ఆయన తపన. దేశంలోని గ్రామాలలో హరిజనులకు రక్షణ లేకుండా పోయిందని ఆయన విచారం. రాజకీయాలు దిగజారి పెద్ద లంటే గౌరవం, పేదలంటే జాలి లేకుండా పోయిందని. ఆ రెంటినీ కాపాడి దేశ భవిష్యత్తును తీర్చిదిద్దగల పార్టీకోసం ఆయన అన్వేషణ.

ఏదేళ్ళగా పార్టీలన్నీ పనికి రాకుండా పోయినాయన్న తపనతో వున్న మాధవరావు దొర యీ పెద్ద నాయకుని ఆహ్వానించేడు. వారు జిల్లా నగరంలో ప్రసంగించి మరో తాలూకా నగరంలో ప్రసంగించి పొరుగు జిల్లాకు పోతున్నారు. ఈ గ్రామం ఆ మార్గానికి సమీపంలోనే ఉంది. అదో సదవకాశం.

ఈరోజు (హరిజన) నాయకుని ప్రసంగం ఉందనేసరికి వారి అభి మాన జనం జిల్లాలో పెద్ద మీటింగ్ పెట్టారు. అక్కడ జిల్లా పార్టీ కార్య నిర్వాహకులు ఎంత ప్రాధేయపడినా ఉపాహార కార్యక్రమంతోనే ముగించి 'మీ అభిమానం భోజనాల విషయంలో కాక మంచి అభ్యర్థులను ఎన్నుకునే విషయంలో చూపించండి' అని హితవు చెప్పారు.

ఈ గ్రామానికి వచ్చేసరికి సాయంత్రం అయిదయింది. ఆ చుట్టు ప్రక్కల గ్రామాలవారికి యింత పెద్ద సమావేశం యిదే కొబట్టి వేల సంఖ్యలో జనం ప్రోగైనారు.

మాధవరావు తమ గడీ లోగిలిలోనే సమావేశం ఏర్పాటు చేయాలను కున్నారు. స్థలం విశాలంగానే ఉంది. కాని కొందరు రారేమో అని ఊహించి బడి ఆటస్థలాన్ని సభాస్థలంగా ఏర్పాటుచేసి వేదిక నిర్మించారు.

ఈ అగ్రనాయకుని వెంట మరికొందరు ఛోటా నాయకులు రాష్ట్ర ప్రభుత్వ రంగంలోనివారు ఈ జిల్లా సంబంధీకులూ వేంచేశారు. అందరికీ తలో దండ వేశారు. వేదికపై కూర్చోబెట్టేరు. సన్మానాలు జరిగినై. వరు సగా ప్రసంగాలు ముగిసినై. మాధవరావు దొరకు సంతృప్తిగా ఉంది. మళ్ళీ యింతమందిలో తాను సభా సన్మానితుడౌతున్నందుకు సంతోషంగా ఉంది. తానేర్పాటు చేసిన సభే ఇది. తనను సంభావిస్తున్నది తన కిరాయి మనుష్యులే అనుకునేసరికి మనసు కాస్త చివుక్కుమంది.

వారి ప్రసంగంలో ఈ గ్రామంలోని హరిజనగూడెం అభివృద్ధిని బహుముఖంగా అభినందించారు. యువశక్తి నిరుద్యోగమంటూ నిరుత్సాహం పాలుకాక ఇట్లా ప్రజాశ్రేయస్సుకొరకు పాటుపడుట అభినందనీయం అన్నారు.

'అట్లాగైతే వృద్ధనాయకులు గద్దెలపైభద్రంగా ఉంటారు ప్రమాదం లేకుండా' అన్నారెవరో చిన్నగా.

"ఈ విధంగా యువకులు ప్రజాసేవ కార్యరంగంలో దిగటంవల్ల తమకైతేనేం, జనంకైతేనేం, దేశానికైతేనేం ఎంతో మేలుచేసిన వాళ్ళవు తారు" అన్నారు మంత్రి.

సభ ముగిసింది.

మాధవరావు బావమరది ఒక మందను తెచ్చి ఈ బావగారి గడీలో విడిది చేయించారు. వాళ్ళ నుద్దేశించి ఏర్పాటుచేసినదీ సమావేశం. ఇంకా అగ్రనాయకులు రాజధానినుండి దేశానికి కదలి వచ్చినప్పుడు గుంపుగా జనాన్ని చూడంది సభల్లో ప్రసంగించనిదీ వారికి తృప్తిఉండదుకదా. త్వర లోనే రాష్ట్రప్రభుత్వ ఎన్నికలట చిన్నదాని పెళ్ళిలోనే పెద్దదాని గర్భా దాన మన్నట్లు ఈ సమావేశముందు ముందు పనికిరావచ్చుననీ వారి ఆశ.

సాయంత్రం దొరగారి మేడలో పెద్ద విందుకు సన్నాహాలు జరుగు తున్నవి. రకరకాల మాంసపు వంటకాలు, శాకపాకాలు, పొలావ్, చపా తీలు తయారవుతున్నవి. విందుకు గ్రామనాయకులు, ప్రముఖ అతిధులు, బంధుజనులు పాల్గొంటారు. అందరూ దొర గడీకి చేరి ఉచితాసనాలమీద కూర్చున్నారు. లోపల విందు వడ్డన ఏర్పాట్లు జరుగుతున్నవి. అంతా హైక్లాసులో సిటీ హెయిర్లో బఫే విందు ఏర్పాట్లు జరుగుతున్నాయి ఢిల్లీ నాయకులు వేంచేసినప్పుడు తమయింట భోంచేసినప్పుడు ఆ విందు సైతం ఆ లెవెల్‌లో ఏర్పాటుచేసి తమ స్టేటస్‌ను, స్టాండర్డ్‌ను నిరూపించుకోవా లని దొరవారి తాపత్రయం.

వంటకాల సువాసనలు వీధిలోని వారి నాసికాపుటాల నాకర్షించి నోరూరింప జేస్తున్నవి.

అన్ని వస్తువులూ తయారైనవి. ఇక విందు కుడుపులే తరువాయి.

# 38

అంతలో రాజు మరికొంతమంది మిత్రులతో అక్కడికి వచ్చాడు. అతన్నిగూర్చి ఒకరు ప్రాంప్టింగ్ అందించారు ఎక్స్ మినిస్టర్ గారికి.

"రా బాబూ రా కూర్చో" అని ఉదారంగా స్థలంచూపారు మంత్రి తాను కూర్చున్న సోఫాలోనే జరిగి.

అక్కడే ఉన్న మాధవరావు "రాజూ! మీరందరూ భోజనానికి ఇక్కడే ఉండండి. పోలీస్‌పటేల్ చెప్పలేదా? అతంతో మిమ్మల పిలువుమన్న, ఇంకా రాలేదేమా అని చూస్తున్న" అన్నారు.

"మేము వచ్చింది మంత్రిగారిని మా కాలనీకి విందుకు పిలుచుకు పోవాలని" రాజన్నాడు.

"ఓ తప్పకుండా. ఇక్కడి హరిజనులు చాల అభివృద్ధిని సాగిస్తున్నారని విన్నాను. తప్పక మీ కాలనీ చూడడానికైనా వస్తాను" మంత్రి ఉవాచ.

"భోజనానికి ఏర్పాట్లు జరిగినై. ఆ తర్వాత వెళ్ళితే మంచిగా ఉంటుంది" దొర అభ్యర్థన.

"ఎంతలో పదినిముషాల్లో తిరిగి రావొచ్చు. భోజనానికి ఇక్కడికే వస్తారు. మేం ఏదో మా తృప్తికోసం చిన్నగా వీరికి విందు ఏర్పాటు చేయాలనుకున్నాం."

"పదండి" మంత్రి లేచాడు.

"మేమూ వస్తాం" ఇతరులు లేచారు.

"సంతోషం" రాజన్నాడు.

"త్వరగా తిరిగి రావాలి. నేనూవస్తున్న మీరుకూడా మాతో రావాలి మరి" అని మాధవరావు అనేసరికి "తప్పకుండా వస్తాం"అని రాజన్నాడు. రాజు సమితి ప్రెసిడెంట్ అయినప్పటినుంచి దొరగారిమాట మందలింపులో కొంత తేడా కన్పిస్తున్నది.

కార్లపై వెళ్దామంటే కాలినడకనే అని మంత్రిగారు కదిలారు వారి వెంట మిగిలినవారు తరలారు. దగ్గరే కాలనీ అలంకరింపబడి ఉంది. రంగుల

కాగితాలేకాక మామిడాకు తోరణాలు కూడా కట్టబడి ఉన్నై. మంత్రులు వచ్చేముందు సున్నగా ఊడ్చి రోడ్డు కిరుప్రక్కలుండే బడ్డీదుకాణాల వాళ్ళను, బిచ్చగాళ్ళను అదలించి పంపేసి అందాన్ని చేకూర్చినట్లుగాకాక ఆ గూడెం ఎప్పుడూ శుభ్రంగానూ ప్రశాంతిగాను ఉంటున్నట్లు కని పించింది.

"రాజుగారూ! మీ కృషిని చాలా అభినందిస్తున్నాను. మన హరిజన కాలనీ ఇంత అందంగా ఉండుట నేను చూడలేదు. ప్రెసిడెంట్ రాజూ! మీవల్ల ఈ సమితి గ్రామాలన్నీ అందులోని హరిజన వీధులన్నీ ఇంత అభివృద్ధిని పొందాలని ఆశిస్తున్నాను" మంత్రిగా రన్నారు.

"మీ ఆశీర్వాదం సార్."

"నైస్ జంటిల్‌మన్" అని సంతసించారు వారు. బడి, మంచినీటి బావి దాటి మీటింగ్‌హాల్‌కోసం కట్టబడిన పెద్ద గుడిసె చెంతకు చేరారు. దానికున్న రెండు ద్వారాలకూ రంగుల పూల పరదాలు వ్రేలాడుతున్నవి. అక్కడ నులకమంచాలపై వంటపాత్రలు పరచబడిఉన్నాయి. వాటిని చూసే సరికి అతిథుల గుండెలు ఝల్లుమన్నై!

మంటికుండలు, రాతెండి గిన్నెలు, వరిఅన్నంతో కొన్ని, జొన్న గడకతో కొన్ని నిండిఉన్నవి. ఒకటి రెండు, పప్పు సొరకాయల కూర కంచుళ్ళున్నవి. కారంతొక్కు చిప్పలు గంజిపాత్రలు పరచబడి ఉన్నవి. విద్యుద్దీప కాంతిలో అవన్నీ తమ సహజ సౌందర్యాలను ప్రదర్శించు కుంటున్నవి.

అతిథులు ఒకరి ముఖాన్నొకరు చూసుకుని రాజు దిక్కు చూపులు తిప్పారు. అతడు మంత్రిగారి దిక్కు చూస్తున్నాడు.

అగ్ర హరిజన నాయకులు నోరువిప్పలేదు. వీరికి గొంతులో వెల క్కాయ ఇరుక్కున్నట్లుగా ఉంది. రాజు నోరు విప్పాడు.

"మేం ఏతిండి తింటున్నామో అదే మీముందుఉంచాము. మీకోస మని వేరే మేమేమీ తయారు చేయలేదు. మా సహజపరిస్థితికి భిన్నంగా మీకు విందుపంటకాలను ఏర్పాటుచేస్తే అది మమ్మల్ని మేము వంచన చేసు కోవటమే. దేశంలోని బీదల సహజ స్థితిగతులు తమ చెవులవరకు చేరకనే తమ కన్నులు చూడకనే ఈ అనర్థాలు జరుగుతున్నట్లు మన అగ్రనాయ

కుల మాటల్లో అప్పుడప్పుడు వినవస్తున్నది. మీరు మా నాయకులు. ఢిల్లీలోనో భాగ్యనగరంలోనో మంత్రిగా ముఖ్యమంత్రిగా బాధ్యతాయుతమైన పాత్రను నిర్వహిస్తున్నారు.

"ఇదుగోండి, గ్రామీణ హరిజనుల పరిస్థితి. ఆ వంటకాలను రుచి చూడండి వాస్తవం తెలుస్తుంది. ఈ తిండిని ఈ శ్రమను ఈ జీవితాన్ని మీరు ఊహించను కూడాలేరు. వీటిని సహిస్తున్న మా సాంఘిక ఆర్థిక పరిస్థితులేమిటో గమనించండి. మేం మీకు కానున్నా మా గ్రామ ప్రముఖులకు సుపరిచితులం. మా శ్రమ వారికి అందుబాటులో చౌకగా లభించేదే. కాని నిజానికి మా తిండీతిప్పలు సహజ స్వరూపాలు వీళ్ళకు తెలువదు. వీరు మహాలయితే దూరంనుంచే ముద్దుగా కేకేసి పిలుస్తారు. కాని మా గుడిసెల్లోకి వచ్చి మా స్థితిని చూసినవాళ్ళుకారు. నిజమైన అభ్యున్నతి అనేది మనం, మేం ఇతర జాతుల వారందరితో సమంగా సాంఘికంగా ఆర్థికంగా గౌరవాన్ని బలాన్ని పొందిననాడు సిద్ధిస్తుంది. అది ఎలా సాధ్యమౌతుందనేది మీరు పెద్దలు ప్రజాసేవకులు, నాయకులు ఆలోచించాలి.

"ఇది మేం సాధించుకున్న ప్రగతి. మనసుల్ని, శరీరాల్ని, ఇండ్ల పరిసరాల్ని శుభ్రంగా ఉంచుకోగల్గుతున్నాం, శాయశక్తులా శ్రమిస్తున్నాం. అయినా మా ఆదాయాలు మాకు ఈ ఆహారాన్నే సమకూర్చుతున్నవి.

"మా స్థితిగతులు యథార్థ స్వరూపాన్ని మీకు చూపాలనే నేనీ సాహసం చేశాను. అందుకు ఎవరి మనసు నొచ్చినా నన్ను క్షమించండి" అంటూ చేతులు మోడ్చాడు.

# 39

ఎన్ కౌంటర్ పేర ఇద్దరు నక్సలైట్ నాయకులపై దాడి జరిగింది. ఒకరు చంపబడితే మరొకతను తప్పించుకొని పోయాడు. ఆ విజయం సాధించింది కొత్తగా పోలీస్ ఆఫీసర్ ఉద్యోగంలో చేరిన శ్రీకాంతరావు. ఈఊరికి పది పన్నెండుమైళ్ళ దూరపు అడవిగ్రామంలో నక్సలైట్లు

ఉన్నట్టు ఇన్స్పెక్టర్ శ్రీకాంత్‌రావుకు ప్రమాణం అందింది. ఆ వార్త పంపింది ఆ వూరి దొరగారు వీరికి దూరపు బంధువు.

శ్రీకాంత్ వెళ్ళేసరికి ఆ యింటి ముసలమ్మ తన మగనితోపాటు మరో ఇద్దరు యువకులకు అన్నం పెట్టి చేపల పులుసు పోస్తున్నది వాళ్ళు అన్నం కలిపి ముద్ద నోట పెట్టుకోబోతున్నారు. అంతే.

"హేండ్సప్" అనే కేక వినబడింది.

ముసలమ్మ ప్రాణం ఝల్లుమంది. ముసలయ్యకు నోట మాట లేదు పోలీసుల చూసేసరికి. ఎక్కడి వాళ్ళక్కడ అట్టాగే ఆగిపోయారు.

"ఎవల కండ్లు చీల్లెరో, ఆల్ల దినాలు కానూ—" అని ముసలమ్మ ఏడుస్తూ ఆ యువకులకు అడ్డం నిలిచింది.

"లే జరుగు ప్రక్కకు—" ఇన్స్పెక్టర్ హుంకరింపు.

"నేను జరుగ నా కొడుకులనేం చెయ్యకు—"

"కొడుకులు—లుచ్చా గాడ్ది కొడుకులు. వీళ్ళు ఎందర్ని చంపినోళ్ళో నీకు తెల్వానె ముసల్దానా?"

"నా కొడుకులు అసోంటోల్లు కారు. ఏ మనిసికి ఏ కట్టమచ్చినా గిల గిల తన్లాడుతరు."

"దేవందర్ ఎవర్ మీ యిద్దరిలో?"

"నేను."

"నేను—" ఇద్దరూ లేచి నిలబడ్డారు.

"ఈ యిద్దరు కారు, ఆ పేరాయినె యెవలు లేరీడ" అని ముసలమ్మ వాళ్ళకు అడ్డు నిలబడింది.

మరునాడీ వార్త పేపర్లో పడింది. మరణించిన వ్యక్తి పేరు దేవేందర్ అంతే నరేందర్ అంటున్నారు. నిజం తెలలేదింకా. పారిపోయిన వ్యక్తి పేరు మురళి అట. అరెస్టు చేయబోతే మారణాయుధాలతో ఎదిరించితే పోలీస్ ఇన్స్పెక్టర్ ఆత్మరక్షణ కోసం ఎదురు కాల్పులు జరిపారు—అని వ్రాశారు.

శ్రీకాంత్ చేసిన ఘనకార్యం మాధవరావుకు తెలిసి ఉబ్బిపోయాడు. "ఈ కమ్యూనిస్టు గాడిదల పిట్టల కాల్చినట్టు కాల్చిపడేస్తే మిగతా కూలిగా డిదెలకన్నా బుద్ధి వస్తుంది" అనుకున్నాడు. పులికడుపున పులే పుడుతుందని

తన కొడుకు తనవంటి వీరుడేనని తన వంశం పేరు నిలుపుతాడని సంబర పడ్డాడు.

జిల్లాలో మీటింగ్ జరిగింది. ఎస్. పి. ఈ ఎస్. ఐ. ని మెచ్చుకు న్నారు మిలిట్రీ కమాండర్‌గా ఉండదగిన వీరుడన్నారు. త్వరలోనే ప్రమో షన్ తప్పక వస్తుందన్నారు.

"థాంక్యూ సర్" అని కడక్ సెల్యూట్ చేసి తలవంచి వినమ్రంగా నిలిచి ఆ దొరబాబు తన ప్రభుత్వ దాస్యబుద్ధిని చాటుకున్నాడు. ఆ దినం సొంతూరికి చేరి తన తల్లిదండ్రి ప్రేమలో గడిపాడు.

ఆ మరునాడు ఉదయం అతడు తన ఆఫీసుకు చేరేసరికి నిన్నటి మనుషుల వేట జరిగిన ఊరి దొరలు ఇద్దరు వచ్చి స్టేషన్‌లోనే ఎదురు చూస్తూ కూర్చుని ఉన్నారు.

"ఏమిటి విశేషం ?"

"ఏం లేదు మీరీ రోజు మాతో మా గ్రామానికి రావాలె"

"మీరు వెళ్ళండి, మీకేమైనా అనుమానంగా ఉంటే నాకు చెప్పి పంపండి నాకు పనుంది."

"ఇప్పుడు మీరు రాంది మేం పోం. ఇంత ధైర్యం కొద్ది మీరు ప్రాణాలకు తెగించి శత్రువును జంపి మాకు మేలు చేసినప్పుడు, మేం మిమ్మొల నొదిలి పోతాం. ఈ రోజు మీరు అక్కడ మాతో గడిపి రేపు తిరిగి రండిక్కడికి–" అంత పెద్ద దొరలు చేతులు జోడించి దండాలు పెడుతూ అన్నారు.

"సరే" అనక తప్పలేదు ఇన్స్పెక్టర్ గారికి. పగటి భోజనం మామూలుగా సాగింది. కాని, రాత్రి చూడాలి వాళ్ళ విందు. అంతా పది మందే కాని వందమందికి జరిగినంతటి యేర్పాట్లు జరిగినై. దాస్యనిర్మూ లను ఒకవైపు ప్రచారం సాగుతూనే ఉన్నా మరోవైపు ఆ దొరలింటినిండా పని మనుషులు తిరుగుతూనే కన్పించారు. ఏ వూరి వాళ్ళో మరి!

విందు–మందు జోరుతో మైకంలో పడి దొరలు ప్రగల్భాలాడుతూ తమతో తాము మాట్లాడుకుంటున్నవేళ "ధన్ ధన్ ధన్" రైఫిల్ దెబ్బలు మ్రోగినై.

మూడు జీవాలు శవాలయినై. పులి అరపు విన్న కుందేళ్ళవలె మిగితా చుట్టరికపు దొరలంతా తలకోవైపు దౌడు తీసారు.

శ్రీకాంత్‌కు ప్రాణం త్వరగా పోలేదు. కణతనుంచి ముక్కులోపలికి చెంపకు వెళ్ళింది గుండు. నోటినుంచి నెత్తురు కారసాగింది. బాధ! దప్పి !!

క్రమంగా తనకేమీ తెలువని స్థితికి చేరుకుంటున్నాడు శ్రీకాంత్. తన మేడలు, భూములు, డబ్బు, ఖాందాన్, మేనమామకూతురు,కల్యాణం, ఉద్యోగం, వీరత్వం, సన్మానం, ప్రమోషన్ అన్నీ వదలి నీటికి నాలుక పీక్కుపోగా తన నెత్తుటి నీచుకంపు ఉప్పుని చవిచే చప్పరిస్తూ నికృష్టమైన చావు చచ్చాడు.

శ్రీకాంత్ శవం చూసి మాధవరావు శిలావిగ్రహమైనాడు. శాంతమ్మ కొడుకును కళ్ళనిండా చూసి కన్నీరు కారుస్తూ కొడుకు శవంపై కుప్పకూలి మరి లేవలేదు. ఆమె గుండె ఆగి మరణించింది. కొడుకును భార్యను నిర్జీవంగా చూసి మాధవరావు ఒక్కగావుకేక వేసి ధ్యాస తప్పాడు. బెదిరి చూస్తాడు తప్ప సరిగా మాట్లాడడు. మనుష్యలనే గుర్తించలేని మృతతుల్యుడైనాడు.

# 40

అనుకోకుండా ఒకనాడు రాజుకు ఒక మెడికల్‌షాపు ముందునుండి వస్తూ సునంద ఎదురైంది. ఆమె చాల చిక్కిపోయి ఉంది. ఒళ్ళంతా తెల్లగా పాలిపోయింది. ఆమె యెంత అనారోగ్యపడినా ఆమె కన్నులు మాత్రం మరింత పెద్దవై అందాన్ని విరజిమ్ముతున్నయ్. రాజును చూడగానే, అంత విషాదంలోనూ ఆమె నేత్రాలు ఒక్కసారి జిగేల్‌మన్నయ్. నీలిమేఘాలలోని మెరుపును చూసినట్లయిం దతనికి. ఆమె తన కలయికకు సంతోషపడిందని గ్రహించాడు.

"బాగున్నారా సునందగారూ."

"ఆ." అంది. ఆమె నయనాలు సజలాలైనవి. తల ప్రక్కకు తిప్పు కుంది. అతని మనస్సు బాధపడింది. ఆమె పరిస్థితి దయనీయమైంది. అన్న హత్యచేయబడ్డాడు. తల్లి మరణించింది, తండ్రి పిచ్చివాడైనాడు. భర్త అవమానాల పాలయాడు.

ఏమిటా జీవితం?

"టీ తీసుకుంటారా?"

"మీరిస్తే విషమైనా తీసుకుంటాను."

షాక్ తిన్నాడు రాజు, అంత ఆరాధన ఆమెకు ఇంకా తనపై ఉందా! ఎగతాళి చేస్తున్నదా, హేళన చేస్తే అలా ప్రసన్నంగా అని ఉండదు? అప్యాయతను కూడా శంకించటం అవివేకానికి ప్రథమలక్షణం అను కున్నాడు.

"రండి అలా కూచుందాం" హోటల్‌కు దారితీశాడు. ఆమె నిస్సం కోచంగా వెళ్ళింది. స్పెషల్ కాబిన్‌లోకి వెళ్ళారు. వాళ్ళవలెనే నిశ్శబ్దంగా ఉందాగది. స్తబ్దంగా ఉన్న ఫ్యాన్ ఆనయింది. వాళ్ళహృదయాల్లోని ఆలోచనల సుడిగుండాలు దాన్నిమించి తిరుగసాగినై.

"ఏమైనా తింటారా?"

"ఉహూ."

బాయ్‌వస్తే రెండు టీలు తెమ్మన్నాడు.

"సిటీకి ఎందుకొచ్చారు?"

"మావారు హాస్పిటల్‌లో ఉన్నారు."

"అనారోగ్య మేమిటి?"

"సుఖరోగం."

"కోలుకుంటున్నారా?"

"మృత్యువుతో పోరాడుతున్నారు."

"ఎంతకష్టం మీకు."

"నాకేమయింది. వారయితే నరకయాతన ననుభవిస్తున్నారు" అని కళ్ళను కర్చీఫ్‌తో తుడుచుకుంది.

సునంద తన నెంతగా కోరింది. పెళ్ళిచేసుకుందామంది, పారిపోయైనా బ్రతుకుదామంది, తానే అనేకానేక శంకలతో ఆమె అభ్యర్థనను

త్రోచిపుచ్చాడు. ఫలితంగా తనకేం కాకపోయినా ఆమె జీవితం మాత్రం పాడయింది. తనను చేసుకుంటే బాగుపడేదా? ఏమో! ఇంత అన్యాయమైతే జరుగకపోయేది. ఆ పతిదేవునిద్వారా ఈమె సుఖపడిందేం లేదు. ఆయన భోగలాలసత్వంవల్ల నిరాదరణకు గురయినట్టుంది. సతీత్వంవల్ల భర్తపుణ్యంవల్ల రోగంపాలయినట్లే ఆ రూపం తెలుపుతున్నది. పతి అవమానాల కారణంగా మనోవ్యధను పొందింది. సంతానవతీ కాలేకపోయింది. అంతా ఏడాదికాలంలో ఎంత కథ జరిగింది.

"స్పెషలిస్టుకు చూపకపోయారా?"

"అన్నీ అయినై."

సర్వర్ టీ కప్పులు తెచ్చి టేబిల్ పై ఉంచి వెళ్ళాడు.

ఒక కప్ తీసి ఆమె కందించి రెండవది తాను తీసుకున్నాడు.

"పట్నం తీసుకు పోలేకపోయారా, నీలోఫర్ కో, ఉస్మానియాకో?"

"లాభంలేదండీ! వారి బాధ చూస్తుంటే ఎంత త్వరగా కన్నుమూస్తే అంతమంచిదనిపించుతున్నది."

పెదవులానృబోతున్న కప్పును అకస్మాత్తుగా ఆపి ఆమెవైపు చూశాడు. ఆమె టీ సిప్ చేస్తున్నది. ఆమె వదనం నిశ్చలంగా, నిర్వికారంగా ఉన్నది.

నీళ్ళగ్లాసు అందుకుని ఒక బుక్కెడు తాగందే అతడు మామూలు పరిస్థితికి రాలేకపోయాడు.

"మీ వివాహజీవితం విషాదమయం అయినందుకు విచారిస్తున్న."

"ఇప్పుడేమనుకొని యేం ప్రయోజనం?"

మరికొన్ని నిముషాలు గడిచాయి. అతనో వింత ప్రశ్న వేశాడు.

"మనలనిలా తెలిసినవాళ్ళు చూస్తే అభాండాలు వేయరూ?"

"ఇష్టంకాని వాళ్ళతో ఉన్నసంబంధాన్ని చెప్పుకున్న దానికంటే, ఇష్టమైన వారితో లేని సంబంధాన్ని అంటగట్టినా బాగానే ఉంటుంది."

"నన్ను క్షమించండి" నిట్టూర్చి అన్నాడు.

"గతాన్నిగూర్చి ఆలోచిస్తూ కూర్చోవటం పిచ్చితనం. ఎప్పుడూ వర్తమానంలోనే జీవించాలి"

"ఏమైనా మీ నాన్నగారు మంచిపని చేయలేదు."

"ఎవరి తల్లిదండ్రులైనా తమ పిల్లల బాగునే కోరుకుంటారు. పరిస్థితులు వికటిస్తే అందుకు వారేం చేస్తారు? ఇలా అవుతుందనుకున్నారా వారు? అనుకుంటే ఒప్పుకునే వారు కారు. మనసుకు నచ్చిన సుఖ జీవితాలను గడుపుతున్న వాళ్ళెందరున్నారని!"

"మీది చాల గొప్ప సుగుణం."

"నన్ను మీరు కాకపోతే మరెవ్వరు మెచ్చుకునేది?"

"ఎంతో ధైర్యంతో దుఃఖాన్ని సహిస్తున్నారు."

"చావలేక. చావురాక."

అతని కళ్ళు ఆర్ద్రాలైనవి. ఆమె అది చూసీ చూడనట్లుగానే తన చాయ్ త్రాగటం ముగిస్తూ "తాగండి. టీ చల్లారిపోతుంది," అంది.

నిజానికి చల్లారి పోయింది. కప్పు సాసర్‌లో పెడుతూ "నాకు మీ వారిని చూడాలని ఉంది" అన్నాడు.

"మీకు మీటింగ్ ఉంది కదా, నేను వస్తా మీటింగ్ దగ్గరికి."

"మీకు తెల్సిందా?"

"కరపత్రం చూశాను."

"తొమ్మిదింటికి వచ్చేదా?"

"ఆరంటికి ప్రారంభం."

"ఇంకా మొదలే వచ్చే ప్రయత్నం చేస్తా."

"మంచిది."

"వెల్దామా."

"ఊఁ." ఇద్దరూ లేచారు.

అనుకోకుండా ఒకరి నొకరు చూసుకున్నారు. వెంటనే చూపులు తిప్పుకొని ముందుకునడిచారు. ఎన్నెన్ని ఆలోచనలో.

# 41

కొత్తగా ఎన్నికైన ఎమ్మెల్యే ప్రభుత్వ పార్టీకి చెందినవాడుకాదు. ఏ పార్టీతోనూ సంబంధాలు లేనివాడు.

'మీ సౌజన్యం మిమ్మల్ని గెలిపించిందండీ. అన్నవారితో' "మా ప్రత్యర్థుల దౌర్జన్యం వారి నోడించింది." అన్నాడు. ఇతను రచయితనా అని అనుమానం కలిగి కొందరు. "మీరు పుస్తకాలు రాస్తుంటారా?" అని అడిగితే." నేను పుస్తకాలు చదువుతుంటాను." అన్నాడు.

"రాజకీయ నాయకులుగా మీరేం చేయదలచుకున్నారండీ?"

"మీరు చేయదలచుకున్న సత్కార్యాలకు నాయనోచిత సహాయాన్ని అందించాలనుకుంటున్నాను."

వారి సన్మానం సభనాడు రాజుకు కూడా సన్మానం చేయటానికి నిర్ణయమైంది. ఆ ఎమ్మెల్సీగారికి రాజుకు సాన్నిహిత్యం ఉందనేకాక వాళ్ళిద్దరూ ఒకే తాలూకా వాళ్ళు కావటం విశేషం.

ఈ ఎమ్మెల్సీగారు సాహితీ ప్రియులు. చతురులు.

చలోక్తులతో సరస సంభాషణలతో ప్రభుత్వ అనుకూలాలపై ప్రతిపక్షాల అసమర్థతపై విసుర్లతో వ్యాఖ్యలతో, చక్కగా అరగంట సమయంలో తన ప్రసంగం ముగించారు. మరోగంట అయినా బాగుం డునడిపించింది. శ్రోతల కరతాళధ్వనులు అరనిమిషం అవిరామంగా మ్రోగి ఆ నాయకునిపై తమకున్న అభిమానాన్నిచాటినై.

ద్వితీయ ప్రసంగం రాజుది.

రాజు ప్రసంగం సాగుతున్నప్పుడు మొదట సభ నిశ్శబ్దంగాఉంది. తర్వాత అప్పుడప్పుడు చప్పట్లు మ్రోగినై. చివరి వాక్యం వినేసరికి ఒక రాయి వచ్చి స్టేజీపై పడింది.

అది చూసి "ఏరకమైన దౌర్జన్యానికీ మనం లొంగిపోకూడదు." అనేసరికి మరి రెండు మూడు రాళ్ళు పడ్డవి.

# 42

సునంద వచ్చేసరికి అంతా సంకుల సమరంగా ఉంది. ఆ మందిని త్రోసుకుంటూ స్టేజీ దగ్గరగా వచ్చింది. ఎవరు ఎవరిని కొడుతున్నారో

ఆమెకు అర్థం కానిదిగా ఉంది. ఆమెకు ఏ దెబ్బయినా తనపై పడుతుం దేమో అనే ఆలోచన సైతం లేదు. ముందుకువెళ్ళాలి అంతే. అప్పుడామె ఆలోచించింది, ఆచరించింది. అసలు సమయానికే అక్కడికి చేరుకుంది. రాజును ఎక్కిస్తున్న కారులో ఎక్కి అతనికి ప్రక్కన కూర్చుంది. అతని తల ఆమె చేతిలో ఉంది. ఎవరూ వారించలేదు. రాజు కూడా. అతడేం స్పృహతప్పిలేదు కాని, ఆయాసంలో ఉన్నాడు.

"హాస్పిటల్‌కు వెళ్దామా?" అన్నారొకరు దారిలో.

వద్దు. అన్నాడు రాజు.

అతన్ని మంచానికి చేరిస్తే ఆమె వెంటనే వెళ్ళింది. ఒకరు కూజాతో నీరు తెస్తే గాసులో పంచి, తన చీర కొంగు చించి నీటిలో తడిపి నొసట కట్టువేసింది. ఆ చల్లదనం అతనికి కాస్త రిలీఫ్‌నిచ్చింది.

టేబిల్ ఫ్యాన్, ఆన్‌చేసి దానికి అడ్డంగావున్నవాళ్ళు దూరం జరిగారు. గది కిటికీలు తెరచి ఒకరిద్దరు సన్నిహితులు తప్ప మిగతావాళ్ళు బయట నిలిచారు.

"మీ నుదుట బొట్టు మెరుస్తున్నది" రాజన్నాడు.

"ఈరోజు నేను బొట్టు పెట్టుకోలేదే?"

"అదుగో ఎర్రగా మెరుస్తున్నది. రక్తం కాబోలు."

ఆమె ఒక్క క్షణం మౌనంగా వుండి తర్వాత "బొట్టు, ప్రేమ, పెళ్ళి ఈ సెంటిమెంట్స్ వేటిపై నాకు ఆసక్తి లేదిప్పుడు" అంది.

ఒక్క క్షణమాగి—

"అయినా వీర తిలకం కావచ్చునది రక్తసిందూరం కదా!" అంది. వాళ్ళిద్దరిని చూసిన ఎవ్వరికీ వేరు భావం కలగదు. అంత నిర్మలంగా, ఆప్యాయంగా మాట్లాడుకుంటున్నారు.

"మీ దొరగారు బాగున్నారా?" రాజడిగాడు.

"ప్రమాదంగా వుంది."

"అయ్యో! చివరి నిమిషాల్లోనైనా దగ్గర ఉండలేకపోయారు."

"వీలునామా రాయించుకోవాలనేదేంలేదు. నాకూ అక్కడేఉండాలని వుండె. కాని...." అంటూ నిట్టూర్చింది.

బయట కొంత దూరం నుంచి నినాదాలు వినవస్తున్నై. ఊరేగింపు ఆరంభమైనట్టుంది.

"దోపిడీ విముక్తికోసం, స్వేచ్ఛకోసం జీవులు సాగించే పోరాటంలో పాలకులనుంచి ఎదురుదెబ్బలు తప్పవు."

"మాక్సిం గోర్కీ 'అమ్మ' నవలలో ఉద్యమకారులకు సంప్రాప్తమైంది అవేకదా"

సునంద జవాబువిని రాజు ఆసక్తిగా "మీరు 'అమ్మ'ను చదివారా?" అడిగాడు.

"ఆఁ చదివాను."

"అమ్మ నాకు చాలా యిష్టం" రాజన్నాడు.

"ప్రతి కమ్యూనిస్టుకూ దానితోనే పాఠాలు ప్రారంభిస్తారుకదా. అమ్మ పాత్ర ప్రతివ్యక్తికీ సంకేతం. ఆమె చివరి పరిస్థితి ప్రతివ్యక్తిదీ."

"అవును" అన్నాడు ఆమె సూక్ష్మపరిశీలనకు ఆశ్చర్యపడిపోతూ.

"దొరసానిగారూ?" ఆమె డ్రైవర్ వచ్చి పిలిచాడు వినయంగా.

"అయిపోయిందా?" అని అడిగింది అటు చూసి నెమ్మదిగా.

ఆ వ్యక్తి తలవంచుకుని నిలపటంతో మరేమీ ప్రశ్నించక "ఊ" అని నిశ్వసించింది.

"ఏమిటది?"

"దొరగారు పరమపదించారు."

వీధిలోని ఊరేగింపు నినాదాలు దగ్గరగా వినవస్తున్నై.

"నేను వస్తా" అంటూ ఆమె కొంగుతో ముఖాన్ని తుడుచుకుని లేచింది. ఇందాక తిలకంవలె కనిపించిన మరక తొలగిపోయింది.